# భారతి

మాసపత్రిక

❧

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

❧

జూలై 1982

సంపుటము : 59 సంచిక : 7

---

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## జూలై 1982





# సమాధిపై సంచలనము

శ్రీ సూర్యదేవర రవికుమార్

గోరి మృతదేహమున్నది, గోరి పైన
విరిసె పచ్చిక ; యది లోని విగతజీవి
సత్యజీవన చిహ్నము; శవమునుండి
యవతరించెను ప్రాణము యవనమందు.

దేహమెంతగ మట్టిలోం దిరిగి కలియు
నంతగాం బచ్చదనమున నలరె గడ్డి
మృతుని జీవము గడ్డిలో మెదలసాగె
చావు నవజీవనమ్ముగా సంక్రమించె.

మృతుని నిర్జీవచికురంబు లతి నిగూఢ
మూలములు గడ్డి పోంచల మొదలిపట్టు
లవనిలో జొచ్చుకొన్నవి జవముగల్గి
జీవమీరీతి-వెడలె నిర్జీవినుండి.

గడ్డిపూలలో మృతజీవి కండ్లు వెలసి
తొంగి చూచు ప్రపంచంబుం దొలుత నతడు
అనుభవించిన పెవిధ వర్ణాను రాగ
గాన పరిమళ స్పర్శ సంగతుల దాని.

ధూమ్ర పర్ణోపశోభిత కమ్ర కుసుమ
సంచయంబులు శిరములు వంచెనవిగొ
వర్షఋతువున సాగు తుంపరల దోంగి
కల్లలైనట్టి వెనుకటి కలలం దలచి.

నిన్న యవల పర్ణంబుగా నున్న కొమ్మ
చెలగి యీనాడు పచ్చని చిగురుం దొడిగె
నదియె మొనమొన్న నిర్జీవమైన మోడు
మరణమే జీవసృష్టికి మార్గమయ్యె.

నూతనోదయ కాంక్షచే నూలుకొనుచు
ప్రాణి మృత్యువులోం దాను లీనమగును
కాలవశమున రూప భేదాలు గాంచు
నాత్మమారదు జీవము నారిపోదు
పొగి సమాధిపై లేగడ్డి పుట్టినటుల.

పత్ర పుష్పతరుపతత్రి మానవ పశు
బృందమణగును శూన్యమందు; గాని
సాగుం దత్తజ్జీవ సంకేతములు శాశ్వ
తంబులై నిలిచి లోకంబునందు

నాకు పచ్చదనము నలరుల యందము
తరువులన్నిట గల్గు పెరుగు దలయు
పక్షుల గమనంబు పశువుల హృద్వృత్తి
మనుజులధీశక్తి మాయ వెపుడు

శాశ్వతత్వమె బ్రతుకు ; శాశ్వతము జీవ;
మిక నశాశ్వతజీవ మీ యిలను లేదు
బ్రతుకు లేనట్టి శాశ్వతత్వమును లేదు
వెల్ల చీకటి నల్లని వెలుగు రీతి.

మృత్తికరాశితోఁ జుట్టుమెత్తబడిన
విగతజీవుని లో లేని విమలజీవ
మా సమాధిపై బుట్టిన మోసులందు
మెలగు జీవము, సత్యమై నిలుచునెపుడు

ఒక్కరూపంబు విడిచి వేరొక్క రూపుఁ
జెందుజీవము శిథిలంబుఁ జెందదెపుడు
మృతిని బొందియు మనిషి తా మృతుడు కాడు
కలడు తన గోరిపై పుట్టు గడ్డిలోనె.

[శ్రీ సంజీవదేవ్ గారి ఆంగ్ల కవిత “గ్రాస్ ఆన్‌ది గ్రేవ్” కు అనువాదము]



# ఆమ్రకుంజం

శ్రీ ఉపాధ్యాయ

కాలం కడుదొడ్డది
అక్కడ కవుల కికూరింపులు చెల్లవు
దార్శనికుల దృష్టి సాగదు
ఋషుల వాక్కులను అర్థాలు
అప్పటప్పట అనుసరించవు.

ప్రాక్పశ్చిమాలు ఉదయాస్తమయాలు
తనకి లేవనుకున్న సూర్యుడు కూడా
తన కాంతిప్రవాహంతో
ఒకేసారి రెండర్థగోళాలను
ముంచెత్తలేడు.

రాత్రికొందరికి పన్నెండు గంటలయితే
మరికొందరికి ఆరుమాసాలవుతుంది.

ఒక సంస్కృతికి చీకటి కమ్మితే
ఆ రాత్రి ఎంత దీర్ఘమైనదో.

అంతరించిన ఏ సంస్కృతిమాత్రం
పునర్వికాసం పొందింది?
బానిసజాతి సంస్కృతి బలంపుంజుకోవాలంటే
ఎక్కడో ఒకనాడి కొట్టుకులాడితే చాలదు
ప్రాణస్పందన పొందిన ఒక జాతి పరాక్రమించాలి
మళ్లీ ఒక వెల్లువ విరుచుకుపడాలి
అంతవరకూ
అదృశ్యపారదర్శక వజ్రకవచానికి
బయట నేను
లోపల ఆమ్రకుంజం.



డా॥ మోపిదేవి కృష్ణస్వామి

# ధర్మాద్వైతస్థితి-అభిప్రాయాల పరిశీలన సిద్ధాంత ప్రతిపాదన

విద్వత్సంస్తవనీయు భవ్యకవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకర సంభావ్యాను భా
వుండుఁ గృ
ష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితనిష్ఠంబూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నా
యమున్!

"విద్వాంసులచే స్తుతింపబడే భవ్యకవితావేశం కలవాడూ, తన విజ్ఞాన సంపదచే ప్రసిద్ధుడైనవాడూ, మహర్షుల బృందంచే గౌరవింపబడే సహజ సద్గుణాలు కలవాడూ అయిన వేదవ్యాస మహర్షి లోకహిత నిష్ఠతో ధర్మాద్వైత స్థితితో కూడిన భారత మనే లేఖ్యమైన ఆమ్నాయాన్ని రచించాడు" అని తిక్కనగారు వ్యాసభగవానుణ్ణి తమ విరాటపర్వ అవతారికలో కీర్తించారు. ఈ కీర్తించడంలో వ్యాసుని విశిష్టతను గూర్చి ఆయన చెప్పిన మిగిలిన అంశాలకన్నా భారతంలో వేదవ్యాసుడు ధర్మాద్వైతస్థితిని సమకూర్చాడు అన్న అంశం పెద్దల్లో చాలా మందిని బాగా ఆకర్షించింది. ధర్మాద్వైతస్థితి అంటే ఏమిటి? అని పెద్దలు అనేకులు తమలో తాము నాటినుంచి నేటివరకూ తర్కించుకొంటూనే ఉన్నారు. వారిలో కొందరుమాత్రం ధర్మాద్వైత స్థితి అంటే "ఇది" అని వివరించినవారు ఉన్నారు. వారి వివరణలు వ్యాసుని సందేశాన్నీ, వ్యాసుని గూర్చిన తిక్కనగారి సందర్భనాన్నీ ఎంతవరకూ పట్టి ఇచ్చాయో పరిశీలించి ముందుకు సాగడం ఉచితం.

భారతం యొక్క అంతరాత్మ ధర్మాద్వైతమని తిక్కన దర్శించడానికి కీ. శే. పింగళి లక్ష్మీకాంతంగారు చెప్పారు.[2] యదార్థవిషయాన్ని సూచించిన లక్ష్మీకాంతం గారు తాము వివరించగల సామర్థ్యాన్ని కలిగిఉండి కూడా ఎందుచేతనో ధర్మాద్వైతస్థితిని గురించి ప్రత్యేకించి వివరించలేదు. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు భారతం సర్వధర్మాలకూ సమాన ప్రతిపత్తిని చెప్పుతున్నదనీ, ధర్మ బోధ ప్రధానంగా గల ఇతిహాసం అవడంచేత దీన్ని తిక్కన ధర్మాద్వైతస్థితి గల గ్రంథంగా కీర్తించి ఉండవచ్చుననీ తిక్కన జీవితంలో కూడా ధర్మాద్వైతస్థితి ప్రతిఫలిస్తున్న దనీ తమ వ్యాసంలో భావించారు.[3] పై ఇద్దరి పెద్దలూ తమ అభిప్రాయాలు ప్రకటించిన తర్వాత ధర్మాద్వైతస్థితిని గురించి పండితలోకంలో మరింత వివేచనా, విమర్శా, సమన్వయం కొనసాగాయి. ఇటువంటి విమర్శలు కావించిన వారిలో ప్రధానులు ముగ్గురు కానవస్తున్నారు. వారు డాక్టర్ కేతవరపు వేంకటరామకోటిశాస్త్రిగారు, డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యగారు, బ్రహ్మశ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రి గారు. వారివారి విమర్శలు వెలువడిన కాలాన్నిబట్టి ఈ వరస ఏర్పడింది. విమర్శ తీరునుబట్టి డాక్టర్ రామకోటిశాస్త్రి గారిది, బ్రహ్మశ్రీ నీలకంఠశాస్త్రి గారిదీ ఒకే కోవకు చెందినవి. వారి వాదాల సారాంశంకూడా దాదాపుగా ఒక్కటే. డాక్టర్ రామకృష్ణమాచార్యుల వారిది వేరొక తీరు. వారి వాదం వీరిద్దరి వాదంకన్నా భిన్నంగా ఉంది.

డాక్టర్ రామకోటిశాస్త్రిగారు భారతాన్నేకాక శంకర భాష్యాన్నీ, తత్త్వగ్రంథాల్నీ సమ్యగధ్యయనం చేసి ధర్మాద్వైతస్థితి విషయంలో విపులమైన విమర్శ కావించి సిద్ధాంత ప్రతిపాదన చేశారు. వీరి బుద్ధినైశిత్యం, శాస్త్రీ పాండిత్యం, విమర్శన పాటవం అసాధారణమైనవి. బ్రహ్మశ్రీ నీలకంఠశాస్త్రి గారిది వేదవేదాంగాల్లోను, ధర్మశాస్త్రాది బహుశాస్త్రాల్లోనూ పారంగతమైన పాండిత్యం, వీరు ధర్మాద్వైతస్థితిని వివరించిన తీరులోకూడా పాండిత్యం శాస్త్ర మర్యాదలూ మొదలైనవన్నీ రామకోటిశాస్త్రి గారి రచనలో మాదిరిగానే ప్రస్ఫుటం అవుతున్నాయి. డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యుల వారు అపారమైన మేధా సంపత్తీ, అలౌకికం అయిన ప్రతిభావిశేషమూ కలిగిన గొప్ప విద్వాంసులు. ఈ ముగ్గురు పెద్దల సిద్ధాంతాల తీరుతెన్నుల్నీ సంగ్రహంగా క్రింద పొందు పరుస్తున్నాను.

1. రామకోటిశాస్త్రిగారి ప్రతిపాదన : ధర్మాద్వైతాలంటే కర్మజ్ఞానాలు. ధర్మం అంటే కర్మ. అద్వైతం అంటే జ్ఞానం. ధర్మాద్వైతస్థితి అంటే కర్మజ్ఞానాల యొక్క కలిమి. గీతలో కృష్ణుడు లోకేస్మిన్ ద్వివిధానిష్ఠా...."అన్న శ్లోకంలో కర్మ జ్ఞానా లందలి నిష్ఠనే తాను ఏర్పరచానని చెప్పాడు. వేదం కూడా పూర్వోత్తర కాండల్లో కర్మజ్ఞానాలతో కూడుకొని ఉంది. కర్మజ్ఞానాలను ప్రతిపాదించింది కాబట్టే భారతం పంచమ వేదం అయ్యింది.

2. నీలకంఠశాస్త్రిగారి ప్రతి పాదన : ధర్మాద్వైతస్థితి అనే సమస్త పదంలో ధర్మ + అద్వైత + స్థితి అనే మూడు పదాలున్నాయి. ధర్మం అంటే వేదవిహిత కర్మం.అద్వైతం అంటే భేదరహిత జ్ఞానం. ధర్మాద్వైతస్థితి అంటే వేదంలోని కర్మకాండచే తెల్పబడినధర్మస్థితిలోనూ, జ్ఞానకాండ [ఉపనిషత్తుల]చే ప్రతిపాదింప బడిన జ్ఞానస్థితిలోనూ వ్యాసభగవానుడు భారతాన్ని రచించాడు.

3. నండూరివారి ప్రతిపాదన : రెండు ధర్మాలు విప్రతిపన్నాలు అయినపుడు అందులో ఏది పరమధర్మమో దాన్నే అనుసరించాలి. అప్పుడు రెండవ ధర్మానికి ఉపహతి కలిగినా ఆచరించింది ధర్మమే అవుతుంది. ఈ విధంగా స్వార్థాన్ని కుటుంబం కోసం, కుటుంబాన్ని దేశంకోసం, దేశాన్ని విశ్వమానవ శ్రేయస్సు కోసం త్యజించాలి. ధర్మానికీ, అధర్మానికీ వైరుధ్యం ఏర్పడినప్పుడు ధర్మాన్నే స్వీకరించాలి. అది సులభ పరిష్కారమే. రెండూ అధర్మాలే అయినప్పుడు రెండూ విడిచిపెట్టదగినవే ఇక రెండూ ధర్మాలేఅయినప్పుడూ, అరెంటికీసంఘర్షణ ఏర్పడి నప్పుడూ కర్తవ్యంఏమిటిఅనేదేప్రశ్న. విప్రతిపన్న ధర్మాలకూ, ధర్మ వికల్పాలకూసమన్వయాన్ని కల్పించి పరమ ధర్మాన్ని నిర్వచించి ధర్మాద్వైతతత్వాన్ని నిరూపించే పంచమ వేదమే మహాభారతం.

ఆలోచనలను రేకెత్తించే ఈ మహామహుల ప్రతిపాదనలను చదివిన తరువాత ఈ వ్యాసకర్తకు కొన్ని సందేహాలూ, కొన్ని సమాధానాలూ, కొన్ని సమన్వయాలూ ఏర్పడ్డాయి. గురు కటాక్షంవల్ల ఈ వ్యాసకర్త పొందిన పరిజ్ఞానం మేరకు ఈ వ్యాసంలో విషయ వివేచనం జరిగింది.

శ్రీ శాస్త్రిగార్లయొక్క వాదాలవల్ల ఏర్పడ్డ సందేహాలు ఇవి -

1 వేదం కర్మకాండమనీ, జ్ఞానకాండమనీ వ్యవహరింపబడుతున్నమాట సత్యమే. కానీ సూక్ష్మంగా పరిశీలించినపుడు ఈ రెండురకాల విభాగాలూ, వాటి పేర్లూ సౌకర్యం కోసం ఏర్పడినవేగానీ వేదతత్వాన్నిబట్టి ఏర్పడినవి కావని పిస్తుంది. వేదకర్మలను నిష్ఠతో ఆచరించినప్పుడు అనుభవానికి వచ్చే అద్వైతస్థితే గదా మనం జ్ఞానకాండమని చెప్పబడే దానిలో వివరించబడి ది. ఒకటి ఆచరణా, రెండవది అనుభవం. ఆచరణా అనుభవాలు ఒకదానికన్నా ఒకటి వేరు ఎలా అవుతాయి ? కాబట్టి కర్మకాండ, జ్ఞానకాండ అన్న విభాగం కేవలం వేదాన్ని అధ్యయనం చేసేవారు తమ సౌకర్యం కోసం పెట్టుకొన్న పేర్లే అని తెలుస్తుంది. మన వాళ్లు తత్త్వంతో సంబంధం లేకుండా ఇలాంటి పేర్లు చాలా పెడుతూ ఉంటారు. ఉదాహరణకి రుద్రాధ్యాయంలో ప్రతి

మంత్రానికి చివర "నమో నమో" అని వస్తూ వుండటంవల్ల దానికి "నమకం" అని పేరు పెట్టారు. అలాగే మంత్రాలకు చివర "చమే చమే" అని వచ్చే అధ్యాయానికి "చమకం" అని పేరు పెట్టారు. సౌకర్యం కోసం పెట్టుకొన్న ఈ "నమక చమకా"లనే పేర్లకి, ఆయా అధ్యాయాల్లోని తత్త్వాలకి సంబంధం ఏమీలేదు. అలాగే వేదంలో కర్మలను వివరించే భాగానికి కర్మకాండమనీ, అద్వితీయాను భూతిని గూర్చి వివరించే భాగానికి జ్ఞానకాండమనీ పూర్వు లెవ్వరో పేర్లు పెట్టి ఉంటారు అని మనం గ్రహించవలసి ఉంటుంది.

ఇక వేదంలోని కర్మకాండ, జ్ఞానకాండలకూ భారతంలో వివరించబడ్డ కర్మజ్ఞానాలకూ ముడిపెట్టడం కుదరదు. వేదానికీ భారతానికీ సారంలో సామ్యం ఉందిగానీ స్వరూపంలో సామ్యం లేదు. వేదవిహిత కర్మలకూ, భారతంలోని కర్మలకూ పేరులో మాత్రమే సామ్యం ఉంది. వేదంలోని కర్మ యజ్ఞయాగాది రూపంలో ఉండగా, భారతంలోని కర్మ మానవుల నుండి ప్రవర్తించేదిగా ఉంది. కాబట్టి వేదసారాన్ని మానవజీవిత గాథలతో మెడిపి అందించడానికి సంకల్పించబడ్డ భారతంలో వేదంలో ఉన్న స్వరూపం లాంటి స్వరూపం ఉండటం సాధ్యం కాదు. వేదంయొక్క ప్రణాళిక వేరు. ఆ వేదసారాన్ని అనుభవాత్మకంగా ఉపబృంహణం చేసి బోధించడానికి రూపు కట్టుకున్న భారతం యొక్క ప్రణాళిక వేరు. వేదంలోనూ, భారతంలోనూ ఉన్న అంతరమైన తత్త్వం ఒక్కటే. బాహిరమైన రూపురేఖల్లో రెంటికీ పోలిక తక్కువ. కాబట్టి వేదం కర్మకాండా జ్ఞానకాండా అని రెండు భాగాలనీ, అవే కర్మ జ్ఞానాలుగా, భారతంలోకి దిగివచ్చాయనీ చెప్పడానికి అవకాశం కనబడటంలేదు. అయితే శ్రీ కృష్ణుడు-

> లోకేఽస్మిన్ ద్వివిధానిష్ఠా పురాప్రోక్తా మయానఘ
> జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం
> -భగవద్గీత, 3-3

అని లోకంలో కర్మనిష్ఠనీ, జ్ఞాననిష్ఠనీ వేర వేరుగా తానే ఏర్పాటు చేసినట్లుగా చెప్పాడు గదా! అనవచ్చు. నిజమే. చెప్పాడు. కానీ అదే కృష్ణుడు అర్జునుణ్ణి మరికొంత దూరం తీసుక వెళ్ళి-

> యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానం తద్యోగైరపిగమ్యతే
> ఏకం సాంఖ్యంచ యోగంచ యఃపశ్యతి సపశ్యతి
> భగవద్గీత, 5-5

అని సాంఖ్యయోగాలను ఒక్కటిగా చూసినవాడే నిజమైన చూపుకలవాడనీ సాంఖ్య యోగాలను వేరుగా చూసినవాళ్ళు పిల్లకాయలనీ, పండితులు అలా చూడరనీ5 నొక్కి చెప్పాడు.4 నిజానికి అనుభవంలో కర్మ వేరుగా జ్ఞానం వేరుగా ఉండదు. కర్మవల్ల జ్ఞానం వస్తుంది. వచ్చిన జ్ఞానంవల్ల అనుష్ఠించే కర్మ మరికొంత దారిన పడుతుంది. కర్మ జ్ఞానాల్ని వేరుగా విడదీసి చూడటం అధ్యయనంలో సాధ్యపడుతుందేమో కానీ ఆచరణలో సాధ్యపడదు. భారతం జ్ఞానయుక్తమైన కర్మనిర్వహణలో మానవుడికి శిక్షణను ఇస్తోంది కాని కర్మస్థితినీ, జ్ఞానస్థితినీ వేరుగా ఎక్కడా బోధించడంలేదు. కర్మాచరణలో మోహితుడైన అర్జునుణ్ణి ఆ స్థితి నుంచి మేలుకొలిపి జ్ఞానం ఇచ్చి జ్ఞానయుక్తమైన కర్మాచరణకు సిద్ధపరిచాడు కృష్ణుడు. కర్తవ్యకర్మకు భయపడిన వాడు అర్జునుడు. అతడికి కృష్ణుడు ఉపదేశించింది జ్ఞానం. దానికి ఫలితంగా చేయించింది కర్మ అయిన యుద్ధం. కాబట్టి వేదంగానీ మహాభారతంగానీ కర్మస్థితిని, జ్ఞాన స్థితినీ రెండుగా విడదీసి వివరిస్తున్నాయి అనడం సమంజసం కాదు.

2. ధర్మం అంటే వేదవిహితకర్మం [illegible] మాట నిజమే. కా[illegible] ఆ వే[illegible] [illegible] ఉద్దేశించికాక స్వార్థదృష్టితో [illegible] అవుతున్నాయి [illegible] వేదవా[illegible] [illegible] తమ[illegible] తప్ప [illegible] దీ[illegible]దు అంటున్నారు. [illegible] ఫలితానికి స్వర్గం అని పేరుపెట్టి దానిపై కోరికతో వేదకర్మలను నిర్వర్తిస్తున్నారు. ఈ విధంగా స్వర్గాలపైన కోరికతో కర్మల్ని ఆచరిస్తున్నప్పుడు వ్యక్తి ప్రజ్ఞ / ఇంద్రియాల్లోకి

చెదిరిపోయి / బహుత్వాన్ని పొందుతోంది. ఇక అతనికి బుద్ధి, సమాధి అందేవి కావు" అన్నది కృష్ణుని ఉద్ఘాటన. 5 సృష్టిధర్మాన్ని దృష్టిలో పెట్టుకుని వేదాల్లోని కర్మలకు రూపుదిద్దారు ఋషులు. ఆ కర్మల్ని ఆచరించడం ద్వారా మానవుడు సృష్టిధర్మంతో శృతి కలిపి ముక్తుడై జీవించగలడన్నది వారి దర్శనం. ఆ కర్మలను స్వార్థదృష్టితో ఆచరించినపుడు అది ఋషుల మార్గంకాదుకాబట్టి అధర్మం అవుతుంది. ఒక కర్మ ధర్మమా, అధర్మమా అన్నది కేవలం ఆ కర్మపైన ఆధారపడి ఉండదు. కర్మ చేస్తున్న వ్యక్తి యొక్క సంకల్పం మీద ఆధారపడి ఉంటుంది. తోటి వ్యక్తితో ప్రేమగా మాట్లాడుతున్నవాణ్ణిచూసి వాడుధర్మాన్ని ఆచరిస్తున్నాడు అని చెప్పలేం. వాడు ప్రేమతో మాట్లాడితే ఆ మాట్లాడటం ధర్మం. తన ప్రయోజనం కోసం అవతలి వ్యక్తిని వశపరచుకోవడానికి అలా మాట్లాడితే అది అధర్మం. అలాగే మద్యాన్ని రోగనివారణకు వాడితే ధర్మం అలాకాక కోరికతో పుచ్చుకొని వ్యసనపరుడై పశువులా ప్రవర్తిస్తే అధర్మం. అలాగే వేదకర్మ ధర్మమా, కాదా అన్నది నిర్వర్తిస్తున్నవారి సంకల్పంమీద ఆధారపడి ఉంటుంది.వారు ఆ కర్మను పరమధర్మాన్ని ఉద్దేశించి ఆచరిస్తే అది ధర్మం. ఫలితాలపై కోరికతో ఆచరిస్తే అది అధర్మం. ఈ సత్యం మరికొంత సూక్ష్మంగా ఆలోచించినవారికి తప్పక బోధపడుతుంది. కాబట్టి ధర్మం అంటే వేద విహిత కర్మ మాత్రమే అని చెప్పడానికి కుదరదు. ఒకవేళ ధర్మం అంటే వేదంలోని యజ్ఞయాగాది రూపం అయిన కర్మే అనుకొన్నప్పటికీ అది భారతానికి ఎలా నప్పుతుంది, భారతంలో యజ్ఞయాగాది కర్మల గురించి తక్కువా, మానవుల నుంచి వర్తించే కర్మల గురించి ఎక్కువా ఉంది.

3. పోనీ కేతవరపు వారు చెప్పినట్లు మానవుల నుంచి వర్తిస్తున్న కర్మధర్మం అందామా? అదీ పొసగదు. నిజానికి కర్మ అంటే సృష్టికర్మ. మనం చేస్తున్న కర్మలన్నీ ఆ సృష్టి కర్మలోని భాగాలే. ఈ సృష్టికర్మ బ్రహ్మ నుండి ఉద్భవిస్తోంది.6

ఇక ధర్మాలు అనేవి సకలసృష్టికర్మలూపుట్టకముందు కూడా ఉన్నాయి,7 అవన్నీ ఒకే ధర్మం నుంచి పుడుతున్నాయి. దాన్నే అవ్యయం లేక అక్షరం లేక ప్రణవం అని శాస్త్రం చెబుతోంది. సృజన కర్మకు కారకుడైన బ్రహ్మ ఈ అక్షరం నుంచే వ్యక్తం అవుతాడు.8 దేవతలు ప్రకృతిలో మొట్టమొదటగా సృష్టి కర్మను ఆరంభించేనాటికే ధర్మాలు ఉంటాయి. అవి వారి కొరకు ఏర్పరచబడ్డ మార్గదర్శక సూత్రాలు. ఆ సూత్రాలకు అనుగుణంగానే దేవతల సృష్టి నిర్మాణం జరుగుతుంది.

సముద్రపు నీరు ఉప్పగా ఉంటుంది. ఆ సముద్రపు నీటిచుక్క మన నాలుకపై పడ్డప్పుడు ఈ విషయం మనకు అనుభవంలోకి వస్తుంది. మన అనుభవంలోకి రాక పూర్వం కూడా సముద్రపు నీరు ఉప్పగానే ఉంది. అసలు సముద్రం పుట్టనప్పుడు కూడా ఉప్పదనం అనే ఒక రుచి విశేషం విశ్వంలో ఉండనే ఉంది. ఉప్పదనమనే ధర్మం సముద్ర జలంలో నిక్షిప్తమై మన నాలుకపై పడ్డప్పుడు అనుభవానికి వస్తున్నది. అలాగే సకల సృష్టి ధర్మాలూ సృష్టికన్నా, సృష్టికర్త అయిన బ్రహ్మకన్నా ముందే శాశ్వత ధర్మంలో ఉంటాయి.

ఇక కర్మ అనేది శాశ్వత ధర్మాన్ని ఆధారం చేసుకొని సృష్టియొక్క ప్రారంభంతోనే కలిసి పుడుతోంది. అంటే ధర్మం సూత్రం, కర్మ నిర్మాణం; ధర్మంప్రచోదకం, కర్మ ప్రచోదితం; ధర్మం అంతరం, కర్మ బాహిరం. ధర్మం శాశ్వతమైనది. అది అభివ్యక్తం అయినప్పుడు మాత్రమే కర్మకు అస్తిత్వం ఏర్పడుతోంది. కాబట్టి శాశ్వతమైన ధర్మానికి తాత్కాలికమైన కర్మనే అర్థంగా పొసగించడం సమంజసం కాదు. కర్మకు ఉండటం, లేకపోవడం ఉంటుంది కాని ధర్మానికి లేకపోవడం అనేది ఉండదు. వాస్తవానికి ధర్మం అంటే కర్మ కాదన్న సత్యం కేతవరపు వారి మనస్సులో మెదులుతూనే ఉంది. భీష్మ పర్వానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో వారు ధర్మాన్ని సంప్రదాయ బద్ధంగా విశ్వసించి ప్రయత్నం చేశారు.9

4. ఇక అద్వైతం అనగా జ్ఞానం అనడం కూడా కుదరదు. కర్మజ్ఞానాలను జీవితంలో సమన్వయించుకొన్నప్పుడు మానవుడు పొందే ఆనందమయస్థితే గదా అద్వైతస్థితి! కర్మజ్ఞానాల కలయికకుఫలితం అయిన అద్వైతస్థితికి జ్ఞానం అనే అర్థం చెప్పడం పొసగదు. మానవుడు గ్రుడ్డు బద్దలు కొట్టుకుని కర్మజ్ఞానాలనే రెండు రెక్కలతో పైకి లేచిన ఒక పక్షివంటివాడు. అందులో ఏరెక్కా పక్షికాదు. తాను రెక్కల కన్నా వేరుగా ఉన్నాననీ, ఆ రెక్కలు తనవేననీ గ్రహించిన అనుభూతేఅద్వైతానుభూతి ఈ స్థితినేవ్యాసుడూ కృష్ణుడూ ప్రతిపాదించింది. కర్మజ్ఞానాలు తనరెక్కలనీ10 తాను వేదాత్మకుడనైన సుపర్ణుడననీదర్శించినవానికి ఈస్థితి అనుభూతం అవుతుంది. కాబట్టి అద్వైతం అంటే కర్మజ్ఞానాలలోని జ్ఞానం అనడం కుదరదు.

"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అన్న తైత్తరీయ ఉపనిషత్తులోని మంత్రంలో జ్ఞానం పరబ్రహ్మకు పర్యాయపదంగా వాడబడినమాట నిజమే. కాని ఈ సందర్భంలోని జ్ఞానానికీ, కర్మజ్ఞానాలలోని జ్ఞానానికి చాలా అంతరంఉంది. కర్మజ్ఞానాలలోని జ్ఞానం కర్మలను నిర్వహించడానికి ఆవశ్యకమైన జ్ఞానం. ఆ జ్ఞానంతో కర్మల్ని ఆచరిస్తే అనుభవానికి వచ్చేదే తైత్తరీయఉపనిషత్తులోని పరబ్రహ్మం. ఆ మంత్రంలోని బ్రహ్మము ఎలా (చతుర్ముఖ) బ్రహ్మ కాదో, అలాగే ఆ మంత్రంలోని జ్ఞానం కర్మజ్ఞానాలలోని జ్ఞానం కాదు. ఈ సత్యం కేతవరపు వారు ఎరుగనిది కాదు. ।

5. ధర్మాద్వైతాలు అంటే కర్మజ్ఞానాలు అన్న అభిప్రాయం తిక్కన గారికి ఉండి ఉంటే ఆయన సూటిగా కర్మజ్ఞాన పదాలనే ఉపయోగించి ఉండేవారు. కర్మకు మారుగా ధర్మాన్నీ, జ్ఞానానికి ప్రత్యామ్నాయంగా అద్వైతాన్నీ వాడి అనావశ్యకం అయిన మెలికలు పెట్టి, విషయాన్ని క్లిష్టం చేసి చదువరులను కష్టపెట్టవలసిన ఆవశ్యకత కానరావడంలేదు. నిజంగా కర్మజ్ఞానాలకు పర్యాయపదాలుగానే ధర్మాద్వైతాలను ఆయన వాడిఉంటే శాంతిత్రయంలో కర్మజ్ఞానాల ప్రసక్తి వచ్చినప్పుడు ఈ పదాలను తప్పక వాడి ఉండేవారు. భారతగ్రంథం మొత్తంమీద కర్మకు పర్యాయపదంగా ధర్మం, జ్ఞానానికి పర్యాయపదంగా అద్వైతం వాడకపోవడం మనం గమనించవలసి ఉంది

6. భారతంలో కర్మజ్ఞానాల ప్రసక్తి ఉందిగానీ కర్మజ్ఞానాలకు వేరువేరుగా అస్తిత్వం మాత్రం లేదు. కర్మజ్ఞానాలకు సమన్వయాన్నీ, ఏకత్వ అనుభవాన్నీ అందిస్తుంది భారతం. అలాగే ప్రవృత్తి నివృత్తి మార్గాలకూ, ఇహపరాలకూ, భోగమోక్షాలకూ సమన్వయస్థితినీ, అద్వితీయ దర్శనాన్నీ అనుగ్రహిస్తుంది భారతం. కాబట్టి ప్రత్యేకంగా కర్మజ్ఞానాలనే దృష్టిలో పెట్టుకుని భారతాన్ని వ్రాశాడనడం పొసగదు. భారతంమానవుడి కొరకు వ్రాశాడు వ్యాసుడు. మానవుడికిసంబంధించిన అన్ని అంశాలకూ పెద్దా చిన్నా భేదం లేకుండాఇందులో చోటు ఉంది. ఆ అంశాల్లో కర్మజ్ఞానాల స్వరూపాన్ని వివరించి వాటి ఏకత్వాన్ని దర్శింపచేయడం కూడాఒకటి.

భారతాన్ని తొలిసారిగా జనమేజయుడికి వినిపించిన వైశంపాయనుడూ, దాన్ని తెలుగులోనికి అవతరింపచేయడంలో ప్రధానపాత్ర వహించిన తిక్కనగారూ భారతంలో పురుషార్థాలైన ధర్మార్థకామమోక్షాలకు సంబంధించిన సమగ్ర దర్శనంఉంది అనిఅంటున్నారు. కాబట్టి తిక్కనగారుచెప్పిన ధర్మాద్వైతస్థితి కూడా ఆ పురుషార్థాలకు సంబంధించినదే అయి ఉండాలి.

## నండూరి వారి ప్రతిపాదనను గూర్చి :

నండూరి వారి వివరణ "వేదములకూ అఖిల స్మృతివాదములకూ" అన్న తిక్కనగారి పద్యాన్ని ఆధారంగా చేసుకొని సాగింది దానికి పైపద్యంలో భారతంలో ధర్మాద్వైతస్థితిని సమకూర్చాను వ్యాసుడు అని తిక్కనగారు చెప్పారు. మహాభారతం ధర్మాద్వైతస్థితిలో ప్రకాశిస్తూ ఉండటంవల్ల ధర్మార్థకామమోక్షాల విషయంలో వాదైనచోట్ల నిష్కర్ష లభిస్తుందని తిక్కనగారి అభిప్రాయం. ఇది ధర్మాద్వైత స్థితిలో భారతం వెలుగొందుతూ ఉండటం

వల్ల మానవుడికి సిద్ధించే ప్రయోజనం. ఈ ప్రయోజనాన్నే ధర్మాద్వైతస్థితిగా చెప్పడం సముచితమైన సమాధానం కానేరదు.

విప్రతిపన్న ధర్మాలను సమన్వయించి పరమధర్మం బోధిస్తున్నది మహాభారతం రెండు ధర్మాలకు ఘర్షణ ఏర్పడినప్పుడు దానిలో ఏది పరమధర్మమో నిర్ణయిస్తోంది మహాభారతం అన్నారు వీరు. కొంచెంసూక్ష్మంగా చూస్తూముందుకు సాగితే మరికొంత వెలుగూ, క్రొత్త వెలుగూ ఏర్పడతాయి. రెండు ధర్మాలకు మధ్య సంఘర్షణఏర్పడినప్పుడు లోకశ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని ఒక ధర్మాన్ని స్వీకరించి రెండవ ధర్మాన్ని కాదనడం పొసగని పని. ఇలా తిరస్కరిస్తూపోతే చివరకు ఒకే ధర్మం పరమధర్మంగా నిలిచి మిగిలినవి అన్నీ కొట్టివేయబడతాయి. భారతంలో అలాకాక అన్ని ధర్మాలూ దేశకాలపాత్రాలనూ, సంఘటనలలోని ఔచిత్యాన్నీ అనుసరించి ఆచరణీయాలై పరమధర్మంలో అద్వైతస్థితిని పొందుతున్నాయి.

సాధకుడు ప్రాథమికావస్థలో ఉన్నప్పుడు మాత్రమే అతడికి క్రొత్తగా గోచరమైన ధర్మం పాతధర్మాన్ని కొట్టివేస్తుంది (విజ్ఞానశాస్త్రంలో నేడు కనిపెట్టిన సిద్ధాంతం నిన్నటిదాన్ని కాదంటే నేటిదాన్నే స్వీకరిస్తున్నట్లు). కాని సాధకుడు ఆ స్థితిని దాటినతర్వాత క్రొత్తగా దర్శనం ఇచ్చిన ధర్మాలూ, సిద్ధాంతాలూ పాతధర్మాలనుకొట్టివేయవు. వాటిపై క్రొత్త వెలుగును ప్రసరింపచేస్తాయి. అప్పుడు సమన్వయం ఏర్పడి ధర్మాద్వైతస్థితి అబ్బుతుంది. జీవితంలో అన్ని ధర్మాలకూ స్థానం ఉంటుంది. వాటియొక్క పరస్పర సంఘర్షణకు మాత్రం తావు ఉండదు. ఈ స్థితినే భారతం ప్రతిపాదిస్తోంది. బ్రహ్మచర్యమే జీవితధ్యేయంగా భావించి అనుష్ఠిస్తున్న జరత్కారుడికి చెట్టుకు వ్రేలాడుతున్న పితృదేవతలు కనబడి మొర పెట్టుకోవడంతో అతడి మనస్సుపై క్రొత్త వెలుగు ప్రసరించింది. అతడు గృహస్థాశ్రమ స్వీకారానికి అంగీకరించాడు. అంటే బ్రహ్మచర్యం తప్పనిగాని గృహస్థాశ్రమం మంచిదనిగానీ అతడికి అనిపించలేదు. జీవితంలో బ్రహ్మచర్య గృహస్థాశ్రమాలకుగలస్థానం అతడికిబోధపడింది. ఇక్కడ ఒక ధర్మం మరొక ధర్మాన్ని కొట్టివేయడం లేదు. క్రొత్త వెలుగును ప్రసరింపచేస్తోంది. ఆ వెలుగులో రెండు ధర్మాలూ పరమధర్మంతో అద్వైతస్థితిని అనుభవిస్తున్నాయి. భారతంప్రతిపాదిస్తున్న ధర్మాద్వైతస్థితి ఇలాంటిది. ఈ అంశం ముందు ముందు ఇంకా వివరించబడుతుంది.

మొత్తంమీద నండూరివారు తిక్కనగారి భారతావతారికను తమ మనఃపీఠం పైకి అవతరింప చేసుకుని ధర్మాద్వైతస్థితిని గూర్చి దార్శనికంగా వివరించడానికి ప్రయత్నించారు. అవతారికను వదలి పండితమార్గంలో తిక్కనగారిని వివరించడానికి ప్రయత్నించడంకన్నా, అవతారికనే సూక్ష్మదృష్టితో అధ్యయనంచేస్తే తిక్కన గారు బోధపడగలరు అన్న రాచబాటను వేశారు. ఆ రాచబాటలో ఇంకా ప్రయాణం కొనసాగిస్తే తిక్కన గారి హృదయానికి చేరువ కాగలమనిపిస్తుంది.

  

మానవుడు సృష్టిలోని భాగం. సృష్టిలోని భాగమైన మానవుడు సృష్టి క్రమంతో శ్రుతి కుదుర్చుకున్నప్పుడు అనుభవానికి వచ్చేదే అద్వైతస్థితి. అట్టి శ్రుతిని కుదుర్చుకునేందుకు అతడికి అందినసాధనమే అతడి శరీరం. శరీరాన్ని ధరించిన మానవుడినుంచి వ్యక్తంఅయ్యేవి ధర్మార్థకామాలు.

మానవుడి నుంచి వ్యక్తం అవుతున్న ధర్మం వర్ణాశ్రమాల నిర్వహణ రూపంలో ఉంటుంది. వర్ణం అంటే అతడి స్వభావం ఆ స్వభావం నుంచి దిగివచ్చేవి అతడి గుణకర్మలు.[12] ఆశ్రమం అంటే స్థితి. మానవుడి శరీర పరిణామాన్నిబట్టి దర్శింపబడ్డ స్థితులే ఆశ్రమాలు. అవే బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసాశ్రమాలు. మానవుడు తన స్వభావం నుంచి దిగివస్తున్న గుణకర్మలను తన శరీర పరిణామ దశలతో తగిన రీతిలో జతపరచుకొని ఆ స్వధర్మంతో లోకాన్ని అర్చించాలి.

స్వధర్మాచరణవల్ల మానవుడికి సమకూరే ధనధాన్యాది వస్తు సంపదలే అర్థం. శరీరంతో ఉన్న మనిషికి అవశ్యకమైన సుఖభోగాలే కామం. అర్థకామాలను స్వధర్మ నిర్వహణకు పరిపోషకాలుగా స్వీకరిస్తూ విశ్వరూపంలో ఉన్న అంతర్యామిని అర్చించసాగినప్పుడు మానవుడు అనుభవించేది ధర్మాద్వైతస్థితి. ఈ అర్చనలో మానవుడి జీవితంలోని

వివిధ దశల్లో వ్యక్తం అవుతున్నట్లు కనిపిస్తున్న వర్ణాశ్రమ ధర్మరూపాలకు సృష్టి ధర్మంతో శ్రుతి కుదరి అద్వితీయస్థితి అనుభవానికి వస్తుంది. ఈ సత్యాన్నే శ్రీ కృష్ణుడు ఇలా విశదీకరించాడు -

> యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్
> స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః [13]

జీవరాసుల స్వభావం ఎక్కడనుంచి పుడుతోందో దేని చేత సృష్టి అంతా నిండి ఉందో, అది తనకు ప్రసాదించి స్వభావం నుంచి దిగివస్తున్న గుణకర్మలతో దానినే అర్చించి మానవుడు సిద్ధిని పొందుతున్నాడు.

విశ్వరూపంగా వ్యక్తం అవుతున్న అంతర్యామే గదా మానవుడికి తాను మానవుణ్ణి అనే ప్రత్యేకమైన గమనికనీ ఆ గమనికకుతగ్గ శరీరాన్నీ, దానిద్వారా వ్యక్తం అయ్యే స్వధర్మాన్నీ, ఆ స్వధర్మాన్ని నిర్వహించగల సామర్థ్యాన్నీ ప్రసాదించింది. ఆ అంతర్యామి ప్రసాదించిన స్వధర్మంతో తోటి జీవుల రూపంలోవ్యక్తంఅవుతున్న ఆ అంతర్యామినే సేవించ గలిగినప్పుడుమానవుడిచే వివిధ స్థితుల్లో అనుష్టింపబడుతున్న సకల ధర్మాలకూ అద్వితీయస్థితి సిద్ధిస్తుంది.

ఈ సత్యాన్నే వ్యాసభగవానుడు భాగవతంలో మరొక సారి గుర్తుచేస్తూ "ధర్మంబునకు భక్తిఫలంబు, పురుషులు వర్ణాశమ ధర్మభేదంబులం జేయు ధర్మంబునకు మాధవుండు సంతోషించుటయే సిద్ధి"[14] అని నిర్ధారించి చెప్పాడు. లోక రూపంలో వ్యక్తం అవుతున్న ఏకైకమూర్తిని స్వధర్మంతో అర్చించినపుడు "అతడు" సంతోషించి అనుగ్రహించేదే అద్వితీయ స్థితి అదే సిద్ధి అన్నది వ్యాసుడి సందేశం.

ఈ ధర్మాద్వైతస్థితిని అనుభవించడమే మానవ జీవితానికి పరిపూర్ణత అని తెలిసి దానిని అనుభవించగోరిన మానవుణ్ణి ఉద్దేశించి వ్యాసుడు అనుగ్రహించినదే మహాభారతం. దీనిలో ధర్మార్థకామాల స్వరూప స్వభావాలు ఉదాహరణపూర్వకంగా ఉపదేశించబడ్డాయి. ధర్మార్థకామాల సక్రమ నిర్వహణ నుంచి వ్యక్తం అయ్యే తురీయపురుషార్థమే మోక్షం లేక ధర్మాద్వైతస్థితి. కాబట్టి ధర్మార్థకామాల నిర్వహణలో లోతుపాతులు తెలుసుకొని కౌశలాన్ని సాధించకపోతే ధర్మాద్వైతస్థితి కోరికగా మాత్రమే మిగిలిపోతుంది. శ్రుతి స్మృతులు ధర్మార్థకామాలనుగూర్చి సూచిస్తున్నాయి. నిర్వచిస్తున్నాయి నదిలో ఈత నేర్చుకోవాలి అనుకొనే వాడికి ఈత అంటే ఇదీ అని చెబితే బోధపడుతుందేమోగానీ ఈత మాత్రం రాదు. ఈత రావాలీ అంటే ఈత నేర్పేవాడు కావాలి. ధర్మార్థకామాల నిర్వహణలో అలాంటిఆచరణాత్మకం అయిన చేయూతను ఇవ్వడంకోసమే వ్యాసుడు భారతాన్ని రచించింది. ఈ ఇతిహాసాన్ని శ్రద్ధతో చదవడం ప్రారంభించిన వ్యక్తికి ధర్మార్థకామాల నిర్వహణలో ఆ వ్యక్తి కొన్ని వేల జన్మల్లో గాని పొందలేని అనుభవాన్ని వ్యాసుడు అవలీలగా అందిస్తాడు. మనస్సు పెట్టి భారతం చదువుకొన్న వ్యక్తికి జీవితంలోని సత్యం కరతలామలకం అవుతుంది.

వర్ణం అంటే ఏమిటి? అది నరుల్లో ఎలా పనిచేస్తూ ఉంటుంది? గుణకర్మల సాయంతో దానిని ఎలా గమనించుకోవాలి? గమనించుకొని ఎలా ఆచరించుకోవాలి? ఆచరణలో గతితప్పితే ఎలాంటి దుస్థితులు ఎదురవుతాయి? గతి తప్పకుండా కొనసాగాలంటే మార్గం ఏమిటి? మొదలైన అంశాలన్నీ అవగతం అవుతాయి.

అలాగేఆశ్రమంఅంటే ఏమిటి?చతురాశ్రమాల స్వరూప స్వభావాలు ఏమిటి? గృహస్థాశ్రమం యొక్క పవిత్రతా సార్థకతా ఏమిటి? ముక్తులైన పెద్దలు కూడా చతురాశ్రమాల్ని ఎందుకు నిర్వహిస్తున్నారు? ఒకవేళ అవశ్యకత లేనివారు నిర్వహించకపోతే దోషం అవుతుందా? మొదలైన అంశాలన్నీ బోధపడతాయి.

వర్ణాశ్రమధర్మనిర్వహణ కోసం అయిన స్వధర్మాచరణతో అర్థకామాలను ఎలా అనకలుపుకోవాలి? అర్థకామాలను స్వధర్మానికి పరిపోషకంగా నడుపుకున్నప్పుడు ఎలాంటి దివ్యస్థితి అనుభవానికి వస్తుంది? స్వధర్మంచేత అర్థకామాలకు ఉద్వేగం చేయించినపుడు ఎలాంటి దుర్భరస్థితి అనుభవించవలసి వస్తుంది? మొదలైన అంశాలు అర్థం అవుతాయి.

దాంపత్యధర్మ స్వరూపస్వభావాలు ఏమిటి? అది ఎలాంటి పరిణామాల్ని చెందివివాహవ్యవస్థ రూపుకట్టుకొంది. ఆచరించబడుతున్న వివిధ వివాహాల విషయంలో గ్రహించవలసిన మెలకువలు ఏమిటి? దాంపత్య ధర్మనిర్వహణలో సూక్ష్మదృష్టిని ప్రసరింపచేసినపుడు దర్శనం ఇచ్చే పాతి

ప్రవత్యం యొక్క పరిపూర్ణ స్వరూపంఏమిటి? సతీసహగమనం మొదలైన సంప్రదాయులు ఎలా రూపుకట్టుకున్నాయి? ఆ సంప్రదాయాలనిర్వహణలోమానవుడుచూపించవలసినవివేకం ఎలాంటిది? మొదలైన అంశాలు అవగాహనకు వస్తాయి.

ధర్మార్థకామాల నిర్వహణలో మానవుడు చూపవలసిన కౌశలం ఎలాంటిది? దేహంతో ఉన్న మానవుడు ఆ దేహాన్ని ఎలా ఉపయోగించుకోవాలి? ఇంద్రియాల్లోకి చెదిరిపోయినపుడు మానవుడు ఎలాంటి బద్ధస్థితిని అనుభవిస్తాడు? ఇంద్రియాల నుంచి మనస్సుకూ, మనస్సు నుంచి బుద్ధికీ, బుద్ధి నుంచి తనలోకి తానూ చేరుకొన్నప్పుడు ఎలాంటి ముక్తస్థితి అనుభవానికి వస్తుంది? అలా తనలోకి తాను చేరేటందుకు తాను తానుగా నిలబడగలిగేటందుకు మానవుడు ఎటువంటి సాధన చేయాలి? మొదలైన అంశాలన్నీ ఉపదేశింపబడతాయి.

ముక్తస్థితిలో నిలిచిన మానవుడి కర్తవ్యం ఏమిటి? అన్న ప్రశ్నకు లోకసామాన్యమైన సమాధానం ఆ స్థితి లభించడమేగమ్యం కనుక ఆ తర్వాత ధర్మాచరణకు ప్రసక్తి లేదూ అని. కాని మహాభారతం ముక్తస్థితిలో నిలిచిన వ్యక్తి మాత్రమే స్వధర్మాచరణలో మెలుకువను చూపగలడనీ, తన పాత్రకు పరిపూర్ణమైన న్యాయం చేకూర్చగలడనీ చెబుతుంది. బద్ధస్థితిలో ఉన్నప్పుడు ధర్మార్థకామాల ఎడల తన సంస్కారాన్నిబట్టి మానవుడు ప్రవర్తిస్తాడు. అతడు అనుకొన్నట్లుగా ధర్మార్థకామాల నిర్వహణ జరగాలని తాపత్రయ పడతాడు. ముక్తస్థితిలో నిలిచిన వ్యక్తి అలాకాక ధర్మార్థకామాల స్వరూపస్వభావాలను దర్శిస్తాడు. విశ్వరూపంలో జరుగుతున్న యజ్ఞాన్ని దర్శించి ఆ యజ్ఞం తననుంచి ప్రసారం చేస్తున్న స్వధర్మాన్ని ఆ యజ్ఞానికి అనుగుణం అయిన రీతిలో మలచుకొని యజ్ఞార్థంగా నిర్వహిస్తాడు.[15]

బద్ధస్థితిలో ఉన్నవాడు కర్మలకు అంటుకొంటాడు. ముక్తస్థితిలో ఉన్నవాడు కర్మలకు అంటుకోడు.[16] బద్ధస్థితిలో ఉన్నవాడు ఫలాపేక్షతో కర్మల్ని ఆచరిస్తాడు. ముక్తస్థితిలో ఉన్నవాడు ఫలాలపై దృష్టిలేక యజ్ఞార్థంగా ఆచరిస్తాడు.[17] బద్ధస్థితిలో ఉన్నవాడు సుఖదుఃఖాది ద్వంద్వాలకు లోను అవుతాడు. ముక్తస్థితిలో ఉన్నవాడు ద్వంద్వాలకు అతీతుడై సర్వత్రా సమత్వాన్ని కలిగి ఉంటాడు.[18] బద్ధస్థితిలో ఉన్నవాడు కర్మాచరణలో చిక్కుకుంటాడు ముక్తస్థితిలో ఉన్నవాడు. కర్మాచరణలో కౌశలాన్ని చూపుతాడు.[19]

యోగి అయినవాడు ఎలా ఉండాలో వివరిస్తూ తాను ఎలా ఉంటున్నాడో ఇలా చెబుతున్నాడు కృష్ణుడు- "ఈ మూడు లోకాల్లోనూ నేను చేసి తీరాలన్న పని ఏదీలేదు. ఏదైనా ఆచరించి నేను పొందగోరేదీ ఏదీ లేదు. నేను పొందనిదీ ఏదీలేదు. అయినప్పటికీ నేను కర్మల్లో నిరంతరం వర్తిస్తూనే ఉన్నాను."[20] తన స్థితిలో నిలబడి తనవలే స్వధర్మాన్ని ఆచరిస్తూ తనతో అద్వైత స్థితిని అనుభవించమని కృష్ణుడి ఉపదేశం. అతడు ఇంకా ఇలా అంటున్నాడు- "తెలియనివారు ఫలితాలకోసం ఎంత పట్టుదలతో పనిచేస్తున్నారో యోగులైనవారు ఫలితాలపై ఆసక్తిని విడిచి అంత పట్టుదలతోనూ లోకశ్రేయస్సుకై పనిచేయాలి."[21]

బంధస్థితిలో వున్నవాడు స్వధర్మాన్ని తాను నిర్వహిస్తున్నానన్న అహంకారాన్ని కలిగివుంటాడు. యోగస్థితిలో వున్నవాడు కర్మలన్నీ ప్రకృతి నుంచి పుట్టిన త్రిగుణాల ప్రేరేపణచే జరుగుతున్నాయనీ, ఈ గుణాలే కర్మాచరణానికి కర్తలుగాని ఈ గుణాలుగలవ్యక్తులు కారనీగ్రహించి[22] తాను చేస్తున్నానన్న అహంకారాన్ని ఆరోపించుకోకుండా తనలో వ్యక్తం అవుతున్న స్వభావాన్ని, ఆ స్వభావం నుంచి దిగివచ్చే గుణకర్మల్ని దర్శించి యజ్ఞార్థంగా వాటి నిర్వహణ జరిగేటట్లు చూస్తాడు. ఆస్థితిలో ఉన్న వ్యక్తి వర్ణాశ్రమధర్మ రూపమైన స్వధర్మాన్ని అనుష్ఠిస్తున్నపుడు జీవితంలోని వివిధదశల్లో అతడినుంచి వ్యక్తం అయ్యే సకల ధర్మాలకూ అంతర్యామితో అద్వైతస్థితి సిద్ధిస్తుంది. ఈ స్థితిలోనిలిచేటట్లు చేసి అర్జునుడిచేత స్వధర్మాన్ని నిర్వహింపచేసేటందుకే సంగ్రామం నడుమ గీతను ఉపదేశించాడు కృష్ణుడు. కృష్ణుడి కరుణ వల్ల మోహం తొలగిన అర్జునుడు ముక్తస్థితిలోనిలిచి లోకహితంగా స్వధర్మాన్ని అనుష్ఠించాడు తాను యుద్ధం చేస్తున్నానన్న అహంకారాన్ని విడిచి తన నుంచి క్షత్రియధర్మంవ్యక్తం అవుతోందనీ, అది లోకంలో జరుగుతున్న ధర్మసంస్థాపన కార్యక్రమానికి సమర్పించబడాలనీ కృష్ణుడి వెలుగులో దర్శించి సమర్పించాడు. తన నుంచి ధర్మాచరణజరుగుతుంతగా తానుపరమపురుషుడితో అద్వైత స్థితిని అనుభవించాడు

కృష్ణుడు అనుగ్రహించిన ఈ దివ్యస్థితిని సామాన్య మానవుడికి ఒంటబట్టేటట్లు చేయడానికే వేదవ్యాసుడు కృష్ణ సందేశాన్ని హృదయంగా చేసి మహాభారత శరీరనిర్మాణం కావించాడు. ఈ దివ్యస్థితికే తిక్కనగారు ధర్మాద్వైతస్థితి అని పేరు పెట్టారు.

ముక్తస్థితిలో నిలిచిన మానవుడు తననుంచివ్యక్తం అవుతున్నస్వధర్మాన్ని లోకహితంగా ఆచరిస్తాడనీ, ఆ స్థితిలో అతడి నుంచి వ్యక్తం అయ్యే సకల ధర్మాలకూ అంతర్యామితో అద్వైతస్థితిలభిస్తుందనీ శ్రీకృష్ణ కృష్ణద్వైపాయనులు నొక్కి చెబుతున్నారు. వ్యాసుడు భారతాన్ని రచించింది ఈ సత్యాన్ని బోధపరచడానికే అని దర్శించిన తిక్కనగారు, వ్యాసుడి ఉపదేశంలోని విశిష్టతను సామాన్యులకు సువ్యక్తం చెయ్యడానికి భారతోపదేశానికి ధర్మాద్వైతస్థితి అని నామకరణం చేశారు.

సాధారణంగా లోకంలో అద్వైతస్థితి అనగానే కలిగే భావం ఏమంటే ఆ స్థితిలో జీవుడు దేవుడితో ఐక్యం అవుతాడు. ఇక అక్కడ మనం ఎరుగున్న లౌకిక వ్యవహారాలకు గానీ, ధర్మాచరణాలకుగానీ తావుండదు. ఇదంతా ఇహలోకం. అద్వైతస్థితిలో జీవి అనుభవించేది ఇహలోక సంబంధి కాదు. అప్పుడు ఈ ఇహలోకకార్యక్రమాల ప్రసక్తి ఉండదూ అని. ఈ విధమైన భావనతో వున్న లోకం భారతం అద్వైత స్థితిని బోధిస్తోంది. అంటే తాము అనుకొన్న అద్వైతస్థితినే అనుకోవచ్చు. అదికాదనీ, భారతం బోధిస్తున్నది ధర్మాద్వైతస్థితి అనీ తిక్కనగారు స్పష్టం చేయాల్సి వచ్చింది. ఈ ఉద్దేశ్యంతోనే మహాభారతం ధర్మార్థకామాల విషయంలోనేగాక మోక్షధర్మం విషయంలో కూడా మూడల అవుతోందని తిక్కనగారు నొక్కి చెప్పారు మోక్షం అంటే మనం కలిగించుకున్న అభిప్రాయాలనూ, ఊహించుకొంటున్న భావాలనూ భారతంయొక్క వెలుగులో సరిచూసుకొని ధర్మాద్వైతస్థితిలో మానవుడు స్థిరపడవలసి ఉంటుందని తిక్కనగారి ఉద్ఘాటన.

కృష్ణుడి నుంచి ఉపదేశం పొందిన అర్జునుడు ముక్తస్థితిలో నిలిచి తననుంచి వ్యక్తం అవుతున్న సకల ధర్మాల అద్వైతస్థితిని అనుభవించాడు.

యుద్ధానంతరం విరక్తుడై రాజ్యాన్ని వద్దన్న ధర్మజుణ్ణి మహర్షులూ, కృష్ణుడూ మందలించారు. కృష్ణుడు ధర్మజుణ్ణి చక్రవర్తిని చేసి భీష్ముడి బోధతో అతడు ధర్మాద్వైతస్థితిలో స్థిరపడేలాగున చూశాడు.

లోకహితనిష్ఠతో భారతాన్ని అనువదింపదలచిన తిక్కన గారికి హరిహరనాథుడు ప్రత్యక్షమై తిక్కన గారు కోరిన ప్రకారం ముక్తిని ఇచ్చి ఆపైన ,ఆయన నుంచి ధర్మాద్వైతస్థితిలో భారత రచనజరిగేటట్లు అనుగ్రహించాడు.

వ్యాసుడు ధర్మాద్వైతస్థితిలోనిలిచి ధర్మాద్వైతస్థితిలో కూడిన భారతాన్ని లేఖ్యమైన అమ్నాయంగా రచించాడు. దాన్ని అనువదింపగోరిన తిక్కన గారికి కూడా ధర్మాద్వైతస్థితి అనుగ్రహించబడింది. భారతం మనస్సుపెట్టి చదివిన వారికి వ్యాసుడు వివరించిన స్థితీ, తిక్కన పొందిన స్థితీ అయిన ధర్మాద్వైతస్థితి తప్పక సిద్ధిస్తుంది.

## అధోజ్ఞాపికలు

1. ఆం. మ. భా., విరాట. – 1-3
2. ఆంధ్ర సాహిత్యచరిత్ర, పు|లు 40, 41
3. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, సంపుటి 49, సంచికలు 5, 6
4. సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః – భగవద్గీత, 5-4
5. యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్య విపశ్చితః
వేద వాదరతాః పార్థ నాన్యదస్తీతివాదినః

కామాత్మానః స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదామ్
క్రియావిశేష బహులాం భోగైశ్వర్య గతిం ప్రతి

భోగైశ్వర్య ప్రసక్తానాం తయా పహృతచేతసామ్
వ్యవసాయాత్మికాబుద్ధిస్సమాధౌ నవిధీయతే
–భగవద్గీత, 2-42-44

6. కర్మ బ్రహ్మోద్భవం విద్ధి - భగవద్గీత, 3-15

7. తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ - పురుషసూక్తం

8. బ్రహ్మాక్షర సముద్భవమ్- భగవద్గీత, 3-15

9. సమాజమునకు ధర్మము కవచము. ఆ కవచమును రక్షించినచో అది మనలను రక్షించును. ధర్మ రక్షణ భారము నెందరు ఋషులు వహించిరో చెప్పలేము.

ధర్మ మనగా నేమి ? ఏమి చెప్పిన ధర్మము చెప్పి నట్లగును? ప్రజకు ముందు ధైర్యము కావలయును. ఓర్పు కావలయును. వారు ఏ రూపముగానూ దొంగతనమునందు ప్రవర్తింపరాదు. సమాజము రోగములతో తీసికొనరాదు. ఇంద్రియ నిగ్రహము నలవాటు చేయవలయును. విషయ విచారణచేయు బుద్ధి పాటవము ముఖ్యము. సత్యమునకు దూరమై సమాజము పోకూడదు. సమాజ మిట్లు సంపూర్ణ ముగా వికసించియుండుటను ప్రబోధించినచో ధర్మమును ప్రబోధించినట్లు. మరియు హింసా ప్రవృత్తి ప్రజల కల వాటుకారాదు. క్రోధము మంచిది కాదు. దయాదాక్షిణ్య ములు మానవత్వ లక్షణములు. అవి భద్రముగా కాపాడు కోవలసినవి. శమదమాదు లెంత ముఖ్యమో కుటిలప్రవృత్తి లేకపోవుట అంతకంటె ముఖ్యము. ఆయా విషయములను ప్రబోధించినచో ధర్మప్రబోధము జరిగినట్లు. ఇంతమాత్ర ముతో సరిపోదు? ఇందుకు విరుద్ధమైన అధర్మ ప్రవృత్తిని నిర్ద్వంద్వముగా ఖండించి వేయవలయును. అదియును ధర్మప్రబోధములోని భాగమే. ఇంతకును ఈ ధర్మ ప్రబోధ మెందుకు? ఎందుకనగా లోకప్రవృత్తి సక్రమముగా నుండు టకు...........

- భీష్మపర్వము - ఉపోద్ఘాతము, పు|లు 3,4; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ

10. పులస్త్యస్మృతి కూడా మనిషిని పక్షితోనూ, కర్మ జ్ఞానాలను రెక్కలతోనూ పోల్చింది.

జ్ఞానం ప్రధానం నతు కర్మహీనం| కర్మప్రధానం నతు బుద్ధిహీనం

తస్మాదుభాభ్యాంతు భవేత్ప్రసిద్ధిః| నహ్యేకపక్షో విహగః ప్రయాతి

- సూక్తి ముక్తావళి నుంచి ఉద్ధృతం

-సంకలనకర్త మహీధర జగన్మోహనరావు

11. అకాడమీ వారి భీష్మపర్వ అవతారికలో కర్మ, జ్ఞాన, మోక్షాలను సంప్రదాయ బద్ధంగా ఇలా వివరిస్తున్నారు -"..... దుఃఖనివృత్తి జ్ఞానమువల్ల కలుగును. జ్ఞానము చిత్తశుద్ధి ద్వారా కలుగును. చిత్తశుద్ధి కర్మ యోగమువల్ల కలుగును. దుఃఖనివృత్తియే మోక్షము." పు. xiii

12. చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః
- భగవద్గీత, 4-13

13. భగవద్గీత, 18-46

14. ఆంధ్రమహాభాగవతం -1-56

15 పరమ పురుషుణ్ణి పశువుగా బంధించి దేవతలు యజ్ఞం చేయడంవల్ల ఈ సృష్టి రూపుకట్టుకుంటోందని, ఈ సృష్టి ఆ పరమపురుషుని వ్యక్తరూపమే అనీ పురుషసూక్తం వివరిస్తోంది. దేవతలు నిర్వహించే సృష్టియజ్ఞాన్ని మరింత విపులంగా వర్ణిస్తుంది శత పథబ్రాహ్మణం -

16. "తస్మాదసక్తస్సతతం కార్యం కర్మసమాచార"
భగవద్గీత, 3-19

17. యుక్తః కర్మఫలం త్యక్త్వాశాన్తి మాప్నోతినైష్ఠికీమ్
అయుక్తః కామకారేణ ఫలేసక్తో నిబధ్యతే
-భగవద్గీత5-12

18. తేద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాందృఢవ్రతాః-
భగవద్గీత 7-28

19. ...యోగః కర్మసు కౌశలమ్ -భగవద్గీత, 2-50

20. నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి
భగవద్గీత 3-22

21. సక్తాః కర్మణ్య విద్వాంసో యథా కుర్వన్తిభారత
కుర్యాద్విద్వాం స్తథ సక్తశ్చికీర్షుర్లోక సఙ్గ్రహమ్
భగఫద్గీత 3-26

22. గుణావర్తన్త ఇత్యేవయోవ{ష్ఠ తినేఙ్గతే
భగవద్గీత 14-23

[భారతం-ధర్మాద్వైతం, వ్యాసుని దర్శనం-తిక్కనసందర్శనం అన్న పరిశోధన వ్యాసంలోనిది వ్యాసం. పర్య వేక్షకులు డాక్టర్ చిలుకూరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.]

# త ప న

## డా॥ గంటి శ్రీరామమూర్తి

నాకొలిచిన దేవుళ్లంతా చెదపట్టిన విగ్రహాలు
నామెచ్చిన మహాత్ములంతా మోసగాళ్లు
నేకోరినరాజ్యంరానేరాదు.
నా జాతిపిత అబద్ధాలహరిశ్చంద్రుడు,
కామాంధుడు;
ఒక అర్ధశతాబ్దం అదే పనిగా
గీతాప్రయోగంతో
నైతిక సూచీవైద్యంతో
నాజాతిని
నిర్వీర్యం చేసిన నిరంకుశ చక్రవర్తి;
ఆది ద్రావిడుల ఉసురుపోసుకొన్న
ఉన్మత్తమేధావి.
వ్యాసుడు, వాల్మీకి, వశిష్ఠుడు, మనువు చెదపట్టిన
ధీశాలురు
జయప్రకాశనారాయణుడొక గతితప్పిన ధీమాన్యుడు
మతం విషం, గతం భయం
కొవ్వొత్తి జీవితంహాస్యాస్పదం.
ఆశ్రమాలు అనుమానాస్పదాలు
అవినీతికి తలఒగ్గని "భీరు" లంతా
బ్రతుకుకాలి, బండబారి
కదల్లేని శవాల్లాగ
కలల్లేని శిలల్లాగ
నూకలునిండేదాకా
నిలుద్దామన్నా
అవకాశం లవలేశం
కనిపించని
ఈ మహావిపణిమఃలుపుల్లో
నాకొలిచిన దేవతలంతాకొరగానికొరకంచులు
నా మెచ్చిన మహాత్ములంతా జగా దగాకోర్లు.

శ్రీ రంధి సోమరాజు

# సీటు దొరికింది

ఈ రోజుల్లో చదువే విద్యార్థికి సమస్తం. రుచి తెలియని, నిద్రనెరుగనిస్థితిలో కూరుకపోయి పాపం బి.యస్.సి. ఫస్టుక్లాసులో పాసయ్యాడు శశికుమార్. ఇంట్లో అందరూ ముద్దుగా "శశీ" అంటారు. ఇతరులు ఆ ధ్వని వింటే అమ్మాయిని ముచ్చటగా పిలుస్తోంది ఆ తల్లి అనుకుంటారు. "గాజుల చేత్తో కాఫీ అందిస్తుంది ఆ వయారి" అని లొట్టలేస్తూ కూచుంటారు. తీరాచూస్తే అబ్బాయి ! ఆ వేషంలో వచ్చిన అమ్మాయి కాబోలనిపిస్తుంది.

శశి నేత్రాలు చూడగానే ఉద్వేగంతో వాటిని చుంబించాలనిపిస్తుంది. అంత అందమైన కళ్ళకోసం ఆడవాళ్ళు తపించి పోతారు. అతని క్లాసులోని ఆడపిల్లలు నిత్యం అతని కళ్ళకోసం కాచుకొని కూచున్నట్లే ఉండేవారు. వారి తలలు పాపం అతనివైపే తిరిగిపోతూ స్లోమోషన్ తిరుగుడు చక్రంలా వారికి తెలియకుండానే పరిభ్రమించేవి ! అది వారికి తెలియదు. తెలిసినా అణుచుకోలేని కోరిక అది. ఎవ్వరూ ఆపలేనిది! సౌందర్యారాధన అంటే ఇదే కదా !

ఫస్టుక్లాసు వచ్చిందని తెలియగానే శశికుమార్ మనసు ఊహల్లో పల్టీలు కొట్టింది. ఎమ్. యస్సి. పూర్తి చేసేసి పిహెచ్. డి కూడ కానిచ్చి వెళ్ళిపోవాలి విదేశాలకు అన్న ఊహ, గొప్ప గొప్ప శాస్త్రజ్ఞులను మించి పోవాలన్న భావన మనసును మనోహరంగా ఉద్రూత లూగించింది. తండ్రి అభినందించాడు. తల్లి కడుపార గుండెల్లోనే దీవించింది. ఆ దీవెనల ఛాయలు కళ్ళలోంచి వెలుతురుగా బయటపడి, అతని శిరసును ఆప్యాయంగా నిమిరాయి. చెల్లెళ్ళు మురిసిపోతూ నెమిలి పిట్టలై గంతులేశారు. తమ్ముడు అన్నయ్యా అని కాళ్ళకు చుట్టుకొనిపోయాడు.

ఆ రోజున ఇంట్లోనివారంతా కలిసి సినిమాకు వెళ్ళారు. శకుంతల అతని క్లాస్‌మేటే. ఆమెకూడ ప్యాసయింది. కాని థర్డ్‌క్లాసు. అయితే ఏం ఆమె ఆనందం ఆమెది ! స్నేహితులతో వచ్చింది. శశికుమార్‌ను చూసింది.

"హాయ్....మీరు...." అంది.

శశి కళ్ళల్లో చిత్రమైన సొగసు తొణికిసలాడింది. ప్యాసయినట్లు మొగంలో నవ్వు అలవోకగా చిగురించింది.

"ఫస్టుక్లాసులో ప్యాసయ్యాడండీ మా అన్నయ్య" చెల్లి చుక్కలజాబిల్లితో ఆకస మయింది.

శకుంతల కళ్ళల్లో జ్యోతి వెలిగింది.

"కంగ్రాట్యులేషన్స్...."

"థ్యాంక్స్....మరి మీరో" అన్నట్టు శశికుమార్ కళ్ళు మధురంగా ప్రశ్నించాయి.

"ఏం పాస్ లెండి. అట్టడుగుక్లాసు అత్తవారింటికి పనికొస్తుంది."

"ఛా....చదువు మానాలనుకోకండి."

"నిజమే ! నేనూ మానాలనుకోవడం లేదు. కాని ఈ ఏడుపు డిగ్రీకి సీటెవ్వరిస్తారు?"

"అన్నింటికి అప్లై చేయండి. ఏదో ఒకటి రాకపోదు"

"ఛాన్స్ తీసుకోమంటారు. నా మనసలా గంతులేయుదండీ....మరి ఈ జన్మకింతే...."

"ఒరేయ్....రారా....పోదాం...." ఛళ్ళున తండ్రికేక.

ఎవరో పిల్ల కుర్రవాణ్ణి వలలో వేసుకుంటోందన్న అక్కసు. ఇంటి దగ్గర గట్టిగా అన్ని విషయాలు చెప్పాలి. లేకపోతే ప్రేమా....గీమా అంటాడు. మనసులో ఏదో పొలికేక గింగురుమంది. ఎన్నో యుద్ధాలు, బీభత్సాలు ఉంగలు చుట్టుకొని గుండెలో కర్కశంగా గగ్గోలు చేశాయి.

తల్లి గుండెల్లో. ."ఎంతబాగుంది పిల్ల. వాడికిసరైన జోడు. ఎవరి పిల్లో... " మనసులో పెళ్ళి....దాని వెలుతురు

శోభన ముచ్చట్లు వాటి పసి నవ్వులు కన్నులపండువగా తిరిగిపోయాయి.

శశికుమార్.... మాట్లాడకుండా సినిమాహాల్లోకి కదిలి పోయాడు.

వారం రోజుల్లో మార్కులలిస్టు వచ్చింది. చూడగానే గుండె గుభేలుమంది. క్లాసువచ్చింది. కాని కేవలం 68శాతం. ఇంత తక్కువా? 78, 88 వచ్చిన వాళ్ళుంటారు. ఎన్ని కాలేజీలు... ఎన్ని కాలేజీలు.రాష్ట్రంనిండాఅవే....గబగబా పేపరు తీసి చూశాడు. మునుపు వేళ్ళమీద లెక్క పెట్టేవారు. ఇప్పుడు వేలకు వేలు జెల్లకాయ కొట్టారు. ఎన్ని ఫస్టుక్లాసులు! తను వారిలో అట్టడుగువాడు! 'ఈ ఏడుపుక్లాసుకు సీటెవ్వరిస్తారు" శకుంతల ఏదో అంటున్నట్లుంది. చెవుల్లో హోరు! ఏదో ఒక సబ్జక్టుకు తను ఛాన్స్ తీసుకోకూడదు. ఫిజిక్స్‌లోనే సీటు సంపాదించాలి. ఇప్పటినుంచీ యూనివర్శిటీ చుట్టూ తిరగాలి. నాన్నకు తెలిసినవారు చాలమంది ఉన్నారు. వి. సి. గారే తెలుసు. డిపార్ట్‌మెంట్ ఛీఫ్ నాన్నకు డియరెస్టు ఫ్రెండ్. లెటర్స్ తీసుకోవాలి. ఇప్పుడే బయలుదేరి మొదట్నించీ జాగ్రత్త పడాలి. ఆరు నూరైనా నూరు ఆరైనా ఫిజిక్స్‌లోనే సీటు సాధించాలి. అది తప్ప మరొకటి వద్దు. తన కిష్టమైన సబ్జక్ట్ అది. అదంటే తనకు ప్రాణం. మరి మార్కులు అలా ఎందుకొచ్చాయో....ఆ సంగతి తరువాత చూడాలి. ఇప్పుడు వీలు పడదు.

వెంకట్రామయ్యగారు కొడుకును దీవించారు. అంతా మనవాళ్ళేరా ...నీకే భయమూలేదు. ఛీఫ్ ఇంట్లోనే దిగు. ఎందుకివ్వడో చూస్తాను అన్నాడు.

మెదడులో ఆశనిరాశలు తీవ్రంగా పోరాటం సల్పుతున్నాయి. కొత్త వెలుతురు రూపు దిద్దుకోవడంలేదు. చీకటి గుండెల్నిండా అలముకుంటోంది. అయినా ధైర్యమే ఊతకర్రగా నిలబడ్డాడు.

ఫిజిక్స్ ఛీఫ్ డాక్టరు అరవిందం శశికుమార్‌ను చూడగానే సాదరంగా ఇంట్లోనికి తీసుకొనిపోయాడు. వచ్చిన విషయం తెలియగానే గుండెల్లో కూలిపోయాడు. కేండిడేట్సుకు వచ్చిన మార్కుల లిస్టు చూసేసరికి గుండె పీచు పీచుమని పోయింది. మతిపోయింది. యాభై సీట్లకు పది హేనువందల నలభై తొమ్మిది అప్లికేషన్స్ వచ్చాయి 80%, 85% మార్కులు వచ్చినవారే వందకుపైగా ఉన్నారు షెడ్యూల్డ్ కాస్ట్, బేక్‌వర్డ్ కమ్యూనిటీవాళ్ళు కూడ 70%, 68% ల్లోనే ఉన్నారు. ఎటొచ్చీ క్రిపిల్డ్‌స్టూడెంట్స్ ఎవ్వరూ రాలేదు.

ఉన్న పరిస్థితి పూర్తిగా అర్థమయ్యేట్టు శశికి ఆయన చెప్పాడు. శశికి మూర్ఛ వచ్చింది.

ఏదో స్వంత విషయంగా చెప్పి,ఈ ఒక్క సీటు ఒబ్లైజ్ చెయ్యండి అని వి సి. గారికి అరవిందంగారు చెప్పాలనుకున్నారు కాని వి. సి. చాలా స్ట్రిక్ట్. కర్మ....ఎలా.... ఇప్పుడు కాళ్ళుతొక్కు కుంటే లాభంలేదు. పోనీ చిన్న గమ్మత్తు చేస్తేనో....అనుకున్నాడు కాని అదీలాభంలేదనితేలిపోయింది. 68% కదావస్తా. ఆ అంకెను తిరగేసి 86% చూపించి ఎలాగో పైకిలాగేస్తేనో.... పెద్దపులుల్లా స్టూడెంట్ లీడర్స్ ముందే కూర్చుంటున్నారు ఇంపాజిబుల్!

ఇదివరకు అయితే ఛీఫ్‌కు ఆమాత్రం అవకాశం ఉండేది. ఒకరిదర్ని ఎలాగోలా మెంబర్లను మోహాటం పెట్టి తోసేసేవాడు. ఇప్పుడు పేపరువాళ్ళు, స్టూడెంట్‌లీడర్సు, ఆఫీసులో టైపిస్టు, గుమాస్తాల దగ్గరనుంచి అందరూ అలేస్షియన్ డాగ్స్! ప్రాణాలుతోడెయ్యడానికి సిద్ధంగా చుట్టూ ఎటూ కదలడానికి వీలులేకుండా నాలుకలు చూచుకొని కాన్-సెంట్రేటెడ్ కళ్ళతో తోకకూడ కదపకుండ కూచుంటున్నారు.

"ఏమోయ్....మంత్రుల్ని ఇన్‌ఫ్లుయెన్స్ చేసి ఏమైన లెటరు తేగలవేమిటి? వి.సి. గారికిచిన్న లెటరు." అనబోయి నాలుక కొరుక్కొని నుదురు తుడుచుకున్నాడు.

శశికుమార్‌కు పరిస్థితి పూర్తిగా అర్థమైపోయింది. అతనిలోంచి దుఃఖంపెల్లుబికింది.చంటిపిల్లవానిలా వెక్కి వెక్కి ఏడ్చేశాడు. ప్రొఫెసర్ ఎంత సముదాయించినా అతని దుఃఖం కట్టలు తెంచుకుంది. విపరీతమైన తృష్ణ అతనిలో జ్వాలలా గుండెల్లోంచి పైపైకి జ్వలించింది.

"నాకు సీటు వస్తుందండి... వస్తుంది... తప్పదు." అంటూ వీధిలోకి పరుగెత్తుకొని పోయాడు.

"శశీ...శశీ..." అని పిలుస్తున్నా ఆగలేదు. ప్రొఫెసర్ హడిలిపోయాడు.

"ప్రాణాలు కాని తీసుకుంటాడేమో... చాలా ఇంటెలిజెంట్ అండ్ సెన్సిటివ్..." అరవిందంగారు కుర్చీలో నిస్త్రాణగా కూలబడి పోయారు.

శశి వీధిలో నడుస్తున్నాడు వెనుక నుంచి, ముందు నుంచి ఆటోరిక్షాలు, కార్లు, సైకిళ్ళు, విపరీతంగా జనసమూహం బాణాల వర్షంలా దూసుకొని పోతున్నాయి.

సర్రున ఇనప ఊచల లారీ ఒకటి ముందుకు దూసుకొని పోయింది. సడన్ బ్రేక్‌తో; అప్పుడే పడిన రెడ్ సిగ్నల్ చూసి జగదాంబ సెంటర్‌లో చప్పున ఆగిపోయింది. కనబడీ కనబడని చిన్న జెర్క్... వెనక ఉన్న శశి కంటిలో రివ్వున ఊచ... సమాజ కర్కశానికి చిహ్నం...జివ్వున నెత్తురు...చుట్టూ జనం...అయ్యో అయ్యో ధ్వనులు. డ్రైవర్ మీద పోలికేకలు. చంపేస్తారేమో అన్నంత ఉద్ధృతం...

కె. జి. హెచ్.లో ఆపరేట్ చేసి చిదిగిపోయిన కన్ను తీసివేశారు. అంతా విన్న అరవిందంగారు నిర్ఘాంత పోయాడు. విల్‌ఫుల్లా... ఏక్సిడెంటా?

పాపం క్రిపిల్డ్ శశికి సీటు వచ్చింది.

నల్లద్దాల కళ్ళజోడుతో అందాన్ని ఎగదువ్వుకొని ఇంట్లో అడుగుపెట్టాడు శశికుమార్....కాని మొగంలో అదే మిటి పీడకల!

"సీటొచ్చినా ఇన్నిరోజులుండి పోయావేం...." ఇంకా ఏదో అంటున్నాడు తండ్రి.

గుమ్మంలో అడుగుపెడ్తూ శకుంతల "హాయ్....శశీ సీటొచ్చిందటగా.... కంగ్రాట్యులేషన్స్........

శశి అటుతిరిగాడు.

"వచ్చింది"

మెల్లిగా కళ్ళజోడు తీశాడు.

ఒక కంటి వెంట నీరు....రెండవది చూడటానికే భయంకరంగా ఉంది. ఇంకా పచ్చి ఆరలేదు.

తండ్రి నిలువుగుడ్లేశాడు. చెల్లి, తల్లి గొల్లుమని పోయారు.

శకుంతల కొయ్యబారి పోయింది.

"సీటు దొరికింది. కాని మనిషి నిండా అగాధాల లోటు."

మనసులో నలిగి పోతూఉన్న వ్యథ, కళ్ళల్లో వేదనా మిగిలింది!

# కాలే సిగరెట్టు...

శ్రీ దిలావర్

నువ్వు సుతారంగా
వలపును గీసి గియ్యగానే
అంటుకున్న నా మనసు అంచును చూస్తే
నీకు తమాషా!

రింగులు రింగులుగా భారంగా
గాలిలో తేలిపోతున్న
గతకాలపు జ్ఞాపకాల పొగను చూస్తే
నీకు మజాకా!

ఏనాడో పెనవేసిన అనుబంధాల వ్రేళ్లమధ్య
కాలిపోతున్న మనసు సిగరెట్టు నుండి
ఎంత నుసి........
గుండె యాష్‌ట్రేలో రాలిపడుతున్నదో
ఎప్పుడైనా కదిలించి చూశావా డార్లింగ్....?



# "అద్దంలో చూపించు నాముఖం"

### శ్రీ మాదిరాజు రంగారావు

అద్దంలో చూపించు నా ముఖం
ఎందుకిచ్చావీ చీకటి బ్రతుకు!
వినిపిస్తోంది కంఠం దూరం నుండి
చిమ్ముతూ గాలిలో స్ఫులింగాలు!

మధ్య మధ్య బొంగురు పోయే రవంతో
శబ్దం కీచుమనీ సర్దుకుంటూంది అంతలో.
తనలో నుండి లాక్కొని శక్తినంతా
చిమ్ము తున్నాడు పాటగా అంతటా.
వేలికి తగిలించుకొని తీగె
మ్రోగిస్తున్నాడు ఢోలక్ చిత్రగతుల్లో.
ప్రవహిస్తోంది పాటలో ఉరవడిగా ఆర్తి
చిందులు త్రొక్కుతూ గదిలో దైన్యం.

ఒక వరస అయిపోయింది
ముఖం ఎర్ర బడింది.
పక్కనున్న తువ్వాలు తీసుకొని
మెడపై నుండి చుట్టూతిప్పి
తుడుచుకున్నాడు గొంతూ ముఖం,
మరో ఆవర్తానికి సిద్ధమౌ విరామంతో.

ఎదురుగా ఉన్న డబ్బాలో
చిల్లర విసరుతున్నారు జనం
నిష్క్రమిస్తున్నారొకరొకరూ, ఎదలో
వచ్చినపుడు ఎరుగని బరువుతో.

విషాదం కప్పువేసింది వాతావరణం
ఆలోచనా గభీరమైంది మనోవలయం!

వస్తూపోయే జనం అతని ముందు
కదులుతూంది బస్ కోసం చూస్తూనో,
జనం బుజాలపై నుండి సందు చేసుకొని
అతణ్ణి చూడాలనించేను ఆ క్షణం.

కన్పించాయి రెండు కళ్ళు లోతుగా
కాస్త నిదానించి చూస్తే! రెండు లొట్టలు
ముఖంపై మచ్చలు స్ఫోటకం వదలినవి
ఒత్తుగాలోతుగా గంట్లు గంట్లుగా.

అతని ప్రక్కనే ఆడమనిషి
ఆమె దగ్గరగా పిల్లవాడు
ఆడుకుంటూ చుట్టూ , మధ్య మధ్య
ఆమె ఒళ్ళోకి చేరి వాలిపోతూ.

ఎండ తలపైనే ఎగురుతోంది
రెపరెపలాడిస్తూ రెక్కలు.
ముఖంపై చెమట బిందువుల్లో
సూర్యకిరణం స్నానం చేస్తోంది.

ఇంతలో వచ్చేసింది బస్
జనం ఎగబడుతున్నారు.
స్కూలుకు వెళ్ళే పిల్లల నుండి
ఏవో పనులపై వచ్చిన పెద్దల దాకా.

కదలింది ఆశాసమయం
విసరేస్తూ సముద్రంపై స్మృతులు.
మనస్సు గుహలో ప్రతిధ్వనించే
నిశ్శబ్దంలో శబ్ద శకలాలతో
పగిలిన అద్దంలో ప్రతిబింబించే
సాయం సంధ్యాతమో రేఖలతో.

బస్ కదలింది బరువుగా
వినిపిస్తోంది మరోవరస.

పాట అందుకొని వేగంగా
పరుగెత్తుతోంది ఆశాచక్రంపై.

గాలి నుండి ఊహలో
నిలచింది బింబిస్తూ
అద్దంలో చూడని ముఖం
శబ్దంలో నిశ్శబ్ద కళయై!



డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

# ప్రజలు, పత్రికలు, కవితాప్రక్రియలు
# ఒక పరిశీలన

## 1. ఉపోద్ఘాతము

దినదిన ప్రవర్ధమానంగా వెలువడుతున్న పత్రికలను, అందులో దర్శనమిస్తున్న నవ్యసాహితీ ప్రక్రియలను నిర్దిష్టంగా పరిశీలించినట్లయితే సాహిత్యం పట్ల ప్రజలలో ఒక నూతన దృక్పథం ఏర్పడిందేమోనని అనిపిస్తుంది. అయితే ఈ వైఖరి సాహిత్య పరిణామ ప్రక్రియలో పురోగామ భువన విజయ సారస్వత సాక్షాత్కారానికో, కాక తిరోగామ బలహీన రసహీన అభ్యంతరకర కుశాంధానిలయ వైపరీత్యానికో అర్థం కావడంలేదు. క్రొత్తదనం పేరిట పుంఖాను పుంఖాలుగా రూపకల్పనలు చేసుకొంటున్న ఈ ప్రక్రియలకు నిజంగా ప్రజాదరణ లభ్యమవుతోందా? ఆదరణకు నోచుకోనట్లయితే అవి ఏక చత్రాధిపత్యాన్ని కొనసాగించగలవా? ఈ ప్రశ్నలకు సమాధానాలు కావాలి?

ఆశ్చర్యమేమిటంటే పత్రికలు ఎంత త్వరగా వెలువడుతున్నాయో అంత త్వరగా మూత పడుతున్నాయి కూడా! ఒకనాడు ప్రముఖ పత్రికలుగా కొనసాగినవి ఈనాడు దాదాపు మూలబడ్డాయి. వాటి భవిష్యత్తు అగమ్యగోచరంగా ఉంది. అయినా క్రొత్త క్రొత్త పత్రికలు రోజుకొకటిచొప్పున మార్కెట్‌లోకి రావడం చూస్తుంటే సాహిత్యపరంగా మన వాతావరణం ఎంత అనారోగ్య పరిస్థితిలో ఉందో అర్థమవుతుంది. పత్రికల సంఖ్య పెరగడంతో పత్రికలస్థాయి తగ్గడమనేది అయత్నకృతంగా జరిగే ప్రతిచర్యే! అయితే ఈ తగ్గడం అనేది మరీ గిరిదాటిలోపలి కెళ్ళిపోయింది. అందుకే ఇంకొన్నాళ్ళుపోతే సాహిత్యసముద్రం ఎండిపోతుందేమోనని అనిపిస్తుంది. అక్కర్లేదు! ఈ సముద్రం పొంగి పొరలుతోందనేవారూ ఉన్నారు!

మరీ విచిత్రమేమిటంటే ప్రస్తుత సాహిత్య వాతావరణం అత్యంత శుభప్రదంగా ఉందని, సాహితీ చరిత్రలోనే సువర్ణయుగ మనదగిన రాజయోగంలో ఉందని, నవీన సాహితీ రీతులు నవనవోన్మేషంగా భాగ్యోదయానికి దారితీసే స్తోమతను కలిగి ఉన్నాయని భావించేవారు చెప్పుకోదగ్గ సంఖ్యలో ఉన్నారు. ఎలా చెప్పాడన్నది యుక్తం కాదని ఏం చెప్పాడన్నది ముఖ్యమని ఒకవర్గం పలుకుతోంటే, చెప్పేదేమైనా ఆ చెప్పేతీరు కనుక ప్రతిభావంతంగా ప్రభావాన్ని కలిగించేలా ఉంటే సాహిత్యానికి అర్థమంటూ ఉంటుందని ఒక వర్గం అంటోంది. వేటికవే అభ్యుదయం అంటున్నాయి!

నిజానిజాలు తెలుసుకోవలసిన అవసరం సాహితీసుగతులకుందన్న విషయం మరచిపోకూడదు. మానవ ప్రయోజనమే సాహిత్య ప్రయోజనమైనప్పుడు పత్రికల అభిరుచి ప్రజల సంక్షేమానికి అద్దంపట్టేలా ఉండాలికదా! నిజానికి వాటి మనుగడ ప్రజల అభిరుచిపైనే ఆధారపడి ఉంటుంది. మరీనాటి పత్రికలస్థాయిని చూస్తే ప్రజల అభిరుచీ, అవగాహనా ఎగబ్రాకాయో, దిగజారాయో అర్థంకాకుండా వుంది. అందుకోసమే ఈ పరిశీలన అవసరమనిపించింది. రూపొందే నూతన ప్రక్రియకూ ప్రజావగాహనకూ మధ్యగల అతిసున్నితమయిన బహుసుకుమారమయిన సంబంధాన్ని తెలుసుకొనడం కోసం ఈ పరిశోధన ముఖ్యమనిపించింది పత్రికలకూ, సాహిత్య ప్రక్రియలకూ, ప్రజలకూ మధ్యగల బంధాన్ని తెలుసుకోవాలనే ఒకపెద్ద ఆశయానికి అతిచిన్న ప్రయత్నం ఇది! నూతన ప్రక్రియలు సాహిత్యపరంగా కొల్లలుగా ఉన్నా కేవలం కవితా ప్రక్రియలను మాత్రమే దృష్టిలో పెట్టుకోవడం పరిశోధనా సౌలభ్యానికి మాత్రమే. ఈ విషయాన్ని విజ్ఞులు గుర్తించెదరు గాక!

## 2. పరిశోధనారంగము : ప్రమాణాలు

20–25 సంవత్సరాల స్త్రీ పురుషులను విభిన్న వర్గాల నుండి ప్రతివర్గానికి 20 మందిని చొప్పున ఎన్నుకోవడం జరిగింది. మెట్రిక్‌లోపు చదివినవారిని అక్షర జ్ఞానమున్న వారిగా అంచనా వేసాను. బ్యాచలర్ డిగ్రీ చేసేవారు కళాశాలస్థాయి వారుగా, మాస్టర్ డిగ్రీ చేసేవారు విశ్వవిద్యాలయ స్థాయి వారుగా, డాక్టరేట్ చేసేవారు పరిశోధనా స్థాయివారుగా కేటాయించబడినారు. వీరందరూ శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి ప్రాంతానికి చెందినవారు. డేటా కలెక్షన్ 1980 నవంబరునుండి 1981 ఫిబ్రవరి 15 వరకూ కొనసాగింది.

సాహిత్య పత్రికలనగా భారతి, నవభారతి, స్రవంతి వంటి పత్రికలని గుర్తించాలి. సమాఖ్య పత్రికలు అనగా ఒక వర్గానికి లేక ఒక సూత్రానికి కట్టుబడినవని నిర్ణయించుకోవాలి.

## 3. పరిశోధనా ఫలితాలు

ఫలితాలను పట్టికల రూపంలో పొందు పరచడం జరిగింది. వాటిని విలయవారీగా పట్టికల పరంగా చర్చిస్తాను.

### పట్టిక 1

| ప్రజావర్గము | వార్తా పత్రికలు (శాతము) | వార పత్రికలు (శాతము) | మాస పత్రికలు (శాతము) | సినిమా పత్రికలు (శాతము) | సాహిత్య పత్రికలు (శాతము) | సమాఖ్య పత్రికలు (శాతము) |
|---|---|---|---|---|---|---|
| అక్షర జ్ఞానమున్నవారు | 40 | 85 | 60 | 90 | 0 | 0 |
| మెట్రిక్యులేషన్‌స్థాయివారు | 70 | 75 | 85 | 85 | 5 | 0 |
| కళాశాల స్థాయివారు | 85 | 65 | 75 | 90 | 10. | 5 |
| విశ్వవిద్యాలయ స్థాయివారు | 85 | 55 | 40 | 70 | 35 | 25 |
| పరిశోధనాస్థాయివారు | 95 | 35 | 20 | 50 | 45 | 20 |
| ఏకంగా | 75 | 63 | 56 | 77 | 19 | 10 |

అక్షర జ్ఞానమున్న వారు అధికంగా సినిమా పత్రికలను, వారపత్రికలను చదువుతున్నారని తెలిసింది. సాహిత్యపత్రికలు, సమాఖ్య పత్రికలు వంటి వాటి జోలికి వారు పోవడం లేదు. మెట్రిక్యులేషన్ స్థాయివారు అక్షరజ్ఞానమున్న వారి మాదిరే అని అనిపించినా వార్తాపత్రికల విషయంలో కాస్త మెరుగు అని తెలుస్తుంది. సాహిత్య పత్రికలు 5% మాత్రమే పట్టించుకొంటున్నారు. కళాశాలస్థాయివారి పరిస్థితి ఇందుకు భిన్నంగా ఏ మాత్రం లేదు అయితే వార్తాపత్రికల విషయంలో గణనీయమైన ప్రగతి ఈ స్థాయినుంచే ప్రారంభమయినది. ఇకపోతే విశ్వవిద్యాలయ స్థాయిలో సినిమా పత్రికల ఉద్ధృతం తగ్గి సాహిత్య పత్రికలపట్లా, సమాఖ్య పత్రికలపట్లా మోజు పెరిగింది. ఈమోజు పరిశోధనాస్థాయిలో మరింతగా పెరిగినట్లనిపించినా సుసంపన్నమయిన సాహిత్య వికాసానికి అది తగిన మోతాదులో లేదు. అయితే ఈ స్థాయిలో వార్తాపత్రికల స్థానం అద్వితీయ మనిపిస్తుంది. వారపత్రికలు, మాసపత్రికలు, సినిమా పత్రికలు దారుణంగా పడిపోవడం గమనించవలసిన అంశం. మొత్తంమీద 77 % సినిమా పత్రికలను, 75 % వార్తాపత్రికలను, 63 % వార పత్రికలను, 56 % మాసపత్రికలను చదువుతుంటే కేవలం 19 % సాహిత్య పత్రికలను, 10% సమాఖ్య పత్రికలను ఆదరిస్తున్నారు.

## పట్టిక 2

| లింగము | సాహిత్య పత్రికలు (శాతము) | సాధారణ పత్రికలు (శాతము) | రెండూ కలిపి (శాతము) |
|---|---|---|---|
| స్త్రీలు | 35 | 90 | 62.5 |
| పురుషులు | 60 | 55 | 57.5 |

సాధారణ పత్రికలను స్త్రీ లెక్కువగా చదువుతున్నారు. సాహిత్య పత్రికలను పురుషులు ఫర్వాలేదు అనిపించే విధంగా ప్రోత్సహిస్తున్నారు. నిశితంగా విశ్లేషిస్తే స్త్రీలే పురుషులకన్నా ఎక్కువగా పఠనావ్యాసంగం పట్ల ఆసక్తిని కనబరుస్తున్నారు.

## పట్టిక 3

| ప్రజా వర్గము | మినీ కవితలు (శాతము) | పద్య కవితలు (శాతము) | సామాన్య కవితలు: భావ కవితలు (శాతము) | అభ్యుదయ కవితలు (శాతము) | విప్లవ కవితలు (శాతము) |
|---|---|---|---|---|---|
| కళాశాల స్థాయివారు | 60 | 5 | 40 | 30 | 80 |
| విశ్వవిద్యాలయ స్థాయివారు | 45 | 5 | 55 | 40 | 60 |
| పరిశోధనా స్థాయివారు | 20 | 25 | 80 | 60 | 15 |
| ఏకంగా | 41.7 | 11.7 | 58.3 | 43.3 | 51.7 |

కళాశాల స్థాయివారు విప్లవ కవితలను, మినీ కవితలను ఎక్కువగా చేరదీస్తున్నారు. పద్యకవితలు వారి అభిమానానికి నోచుకోవడంలేదు. విశ్వవిద్యాలయ స్థాయిలో పద్య కవితలు మినహా అన్నిరకాల కవితలూ దాదాపు సమానంగానే పోషించబడుతున్నాయి. పరిశోధనాస్థాయిలో భావ కవితలకు, అభ్యుదయ కవితలకు అధిక ప్రాధాన్యం ఇవ్వడం జరుగుతోంది. పద్య కవితలన్నా ఈ స్థాయివారు అరాకొరిగా ఇష్టపడుతున్నారు. మినీ కవితలపట్ల విప్లవ కవితలపట్ల పెద్దగా మోజు చూపించడంలేదు. మొత్తంమీద భావ కవిత్వానికే అగ్రస్థానం లభించింది. విప్లవ కవిత్వానికి రెండవ స్థానం, అభ్యుదయ కవిత్వానికి మూడవ స్థానం, మినీ కవిత్వానికి నాలుగవ స్థానం వచ్చాయి. పద్యకవిత్వానికి ఆఖరి స్థానం రావడమే కాక చాల తక్కువస్థాయిలో ఉండడం చూస్తే కొంతకాలానికి దానికి "స్వస్తి" అంటారేమోనని అనిపిస్తుంది.

## పట్టిక 4

| ప్రజా వర్గము | కవితల స్థాయి | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | చాలా గొప్పవి (శాతము) | | చెప్పుకోదగ్గవి (శాతము) | | ఒక మోస్తరువి (శాతము) | | సులభంగా అర్థమవుతాయి (శాతము) | | తేలికగా అర్థం కావు (శాతము) | | అసలు అర్థం కావు (శాతము) | |
| | ఆ. క | మా. క | ఆ. క | మా. క | ఆ. క | మా. క | ఆ. క | మా. క | ఆ. క | మా. క | ఆ. క | మా. క |
| కళాశాల స్థాయివారు | 25 | 20 | 25 | 20 | 25 | 25 | 60 | 25 | 25 | 50 | 70 | 5 |
| విశ్వవిద్యాలయ స్థాయి వారు | 10 | 15 | 20 | 20 | 20 | 30 | 45 | 60 | 40 | 45 | 65 | 5 |
| పరిశోధనా స్థాయి వారు | 5 | 25 | 20 | 65 | 20 | 85 | 65 | 75 | 20 | 20 | 20 | 0 |
| ఏకంగా | 13. 3 | 20 | 21. 7 | 35 | 21. 7 | 46. 7 | 53. 3 | 53. 3 | 28. 3 | 38. 3 | 51 7 | 3. 3 |

ఆ. క :- ఆధునిక ప్రక్రియలు కల కవితలు

మా. క :- మామూలు ధోరణిలో అల్లిన కవితలు

ఆధునిక కవితలపట్ల కళాశాల స్థాయివారు మెచ్చుకోలుగా చూస్తే పరిశోధనా స్థాయివారు పెద్దగా పట్టించుకొన్నట్లు కనబడలేదు. అయితే కళాశాలస్థాయి వారిలోనే 50% అవి సులభంగా అర్థమవుతాయని, 70% అసలు అర్థం కావని అనడం విస్మయాన్ని కలిగించే అంశం. ఇకపోతే విశ్వవిద్యాలయ స్థాయివారు మధ్యస్థంగా ఉన్నారు. మామూలు కవితలకు పరిశోధనాస్థాయిలోనే ఎక్కువ స్థానం లభించింది. అర్థమయ్యే విషయంలోకూడ వాటికే ఎక్కువ ఓట్లు వచ్చాయి. మొత్తానికి ఆధునిక కవితలకన్నా మామూలు కవితలే ఎక్కువగా మన్ననలందుకొన్నట్లు తెలిస్తుంది. చాల గొప్పవనిపించినా, చెప్పుకోదగ్గవనిపించినా ఒక మోస్తరు వనిపించినా మామూలు ధోరణిలో సాగే కవితలనే ఎక్కువమంది ఇష్టపడుతున్నారు. అసలు అర్థం కానివి ఆధునిక ప్రక్రియలతో రాయబడిన కవితలలోనే ఉన్నాయని 52 % వరకు అభిప్రాయపడడం జాగ్రత్తగా పరిశీలించవలసిన అంశం. కేవలం 3% మామూలు కవితల్లో అర్థంకానివి అనడం ఆ కవితలకొక కిరీటం !

## 4. పరిశోధనా ఫలితాల చర్చ

వార్తాపత్రికలను గణనీయంగా పఠించే ప్రజలఅభిరుచిని అంచనావేసి చూచుకొన్నట్లయితే దేశపరిస్థితుల టా అంతర్జాతీయ సమస్యల పట్లా వారు కనబరుస్తున్న ఉత్సాహం ఎంతశక్తివంతమైనదో స్పష్టంగా తెలిసొస్తుంది ిందులకు వారిని అభినందించాలి! విశిష్టమైన ప్రజాస్వామిక ప్రగతిపథంలో ఇదో ఆరోగ్యదాయకమైన ప్రశంసార్హమైన మార్పు! అయితే ఆ ప్రజలే అంతకంటే ఎక్కువగా సినిమా పత్రికలపట్ల మొగ్గుచూపడం ఆశ్చర్యాన్నేకాదు, ఆందోళనను సైతం కలిగించే విషయం. ఆందోళనని ఎందుకంటున్నానంటే ఆ సినిమాపత్రికలస్థాయి అంతంత మాత్రంగా ఉండడంవల్ల! ఈస్థాయి వ్యక్తిగత వికాసాన్నిబట్టి మారుతూ ఉన్నా ఒకసగటుమనిషి కోరుకొనే సాధారణ స్థాయికన్నా తక్కువగా ఉండడంవల్ల అవి ఉబుసపోకకు పనికొస్తున్నాయేతప్ప ఆలోచనను రేకెత్తింపజేయడం లేదు. ఇది అభివృద్ధికరమయిన చైతన్యవంతమయిన మార్పుకాదని అందరూ ఒప్పుకొంటారు. ఇకపోతే సాహిత్యపత్రికలను అసలు పట్టించుకోకపోవడం దురదృష్టకరం. సాహిత్యనందనవనంగా పేరుగాంచిన మనచరిత్రకిది మాయనిమచ్చ అని అనుకోవడంలోతప్పుధ్వనించదు. అయితే ఈస్థితికికారణమేమిటని ఆలోచించాం. అక్షరాస్యత చెప్పుకోదగినంతగా పెరుగుతున్నా, మనవారి ఆలోచనా సరళి అత్యద్భుతంగా రూపుదిద్దుకొంటున్నా సాహిత్యపిపాస ఎందుకు పడిపోయినట్లో అర్థం కావడంలేదు. మౌలికవ్యవస్థలోనే అంటే ప్రాథమిక స్థాయిలోనే ఎక్కడోలోపముంది. ఆత్మపరిశీలనం చాలవరకు లోపించడం, అనుకరణ, అనుసరణలపై ప్రలోభాన్ని పెంచుకోవడం ముఖ్యకారణాలుగా గుర్తించడంలో ఆలోచించవలసిన అవసరంలేదు. సమాఖ్య పత్రికలు అమితంగా పోషించబడకపోవడం పెద్దగా నష్టాన్ని కలిగించే అంశం కాదు. నిజానికి ఆ పత్రికలు కేవలం ప్రచారసాధనాలుగా ఉపయోగపడుతున్నాయే తప్ప చైతన్యస్ఫూర్తిని కలిగించడం లేదు.

సాహిత్యపత్రికలు చదవడమే తక్కువైతే అందులో మళ్లీ, స్త్రీలు మరింత తక్కువగా చదవడం కొద్దిగాబాధను కలిగించే విషయం. సాధారణ పత్రికలను అధికంగా చూస్తున్న స్త్రీలు మానసికంగా భావగతంగా ఎదగవలసినంత ఎత్తుకు ఎదగలేదేమోనని అనిపిస్తుంది. సాహిత్యపత్రికలు చదవడమే అభ్యున్నతి అనిపించుకొంటుందా?-అనిఎవరైనా అడగవచ్చు. తప్పు లేదు. కాని నేటి సాధారణ పత్రికలలో ద్యోతకమయ్యే కృత్రిమ వాతావరణపు సొగసులలో పడి నిజజీవితంలోని అమూల్యమైన అంశాలెన్నింటినో ఈ మగువలు పోగొట్టుకొంటున్నారని ఇటీవల చాలసందర్భాలలో తెలియజేయడం జరిగింది. ఏమైనా సాహిత్యరంగంలో స్త్రీలు అమితోత్సాహంతో ముందుకురకడం సంతోషించవలసిన విషయం. సాంప్రదాయికంగా తరతరాల నుండి స్త్రీకి ఇస్తూవచ్చిన ఔన్నత్యం సారస్వతపరంగా మరింత ఉన్నతస్థితిని పొందాలని ఆశించడం మరచిపోకూడని కర్తవ్యం.

కవిత్వంపట్ల ప్రజాబాహుళ్యం ఆసక్తిని కనబరుస్తోందని చెప్పడం చాల కష్టం. కవిత్వమే జవసత్వంగా ఉన్న సాహిత్యపత్రికలు ప్రజాభిమానానికి నోచుకోకపోవడం చూస్తే కవిత్వం పడిపోతుందేమోనని అనిపించవచ్చు. అయితే ఈ పడడమన్నది కవిత్వంలో పసలేకనా లేక కవిత్వాన్ని ఆస్వాదించడంలో తగినంత రసస్ఫూర్తి ప్రజలకులేకనా అనేది నిర్ణయించవలసిన అతిముఖ్యమైన అంశం. ఆదరిస్తున్నకాసింత

కవిత్వంలో భావకవిత్వానికి తాంబూలమివ్వడం చూస్తే సాహిత్య ప్రక్రియలలో నేడుకానవస్తున్న వైఖరులవల్లసాహితీ పరులు పెద్దగా సుముఖతను కనబరచడం లేదని తెలుస్తోంది. విప్లవ కవిత్వానికి ఇంకా తగినంత బలముండడం చెప్పుకో దగ్గ విశేషం. అయితే ప్రజాకవిత్వమిదేనని, సామాన్యుల కొరకు రాస్తున్న కవిత్వమంటే ఇదేనని చెప్పడం లేదా చెప్పుకోవడం మాత్రం ఈ పరిశీలన రీత్యా అవివేకమని, అసందర్భమని కూడా అనిపిస్తుంది. అభ్యుదయ కవిత్వం ఇంకా కొనసాగే అవకాశాన్ని కలిగించుకొంది. కానీ అందరూ అహో! ఒహో! అంటున్న మినీ కవితల పట్ల ఊహించినంత ఉత్సాహం లేకపోవడం ఒక ప్రశ్నగా మిగులుతుంది. ఈ మినీ కవితలకు పత్రికలే అనవసరమైన ప్రాధాన్యాన్ని కలిగిస్తున్నాయేమో అని అనిపించే దశలో ఇప్పుడు మన మున్నామని స్పష్టమవుతోంది. ఇక పద్య కవితలను ఆలోచిస్తే వాటి "కాలం" తీరిపోయే రోజులొచ్చాయేమో అనే సందేహమొస్తుంది. పద్య కవితలంటేనే ఛందస్సు గుర్తు కొస్తుంది. అంటే చంధోబద్ధమయిన రచనలు ఇక మీదట నిలవలేవని భావించవచ్చు.

ప్రాచీన ప్రక్రియలకే ఆధునిక ప్రక్రియలకన్నా అధికంగా "రెస్పాన్స్" రావడాన్ని బట్టిచూస్తే రసస్పందన కలిగించే విషయంలో నూతన ప్రక్రియలు ఘోరంగా ఓడిపోతున్నాయేమో నని అనుకోవడానికి ఆస్కారం దొరుకుతుంది. ఇక అర్థమయ్యే విషయంలో ఆధునిక ప్రక్రియలు పైచేయిగా ఉంటుందేమోనని భావిస్తే, ఆ భావన కాస్త సన్నగిల్లిపోవడమే కాకుండా, చాలా మంది, అసలు చాలా వరకు ఆధునిక కవితలు అర్థమే కావు అని అనడంతో తీరని ఆశాభంగం కలుగుతుంది. అర్థమవడం, కాకపోవడం అనే ఈ రెండు విషయాలను చాలా సీరియస్‌గా తీసుకొని ఒక నిర్దిష్టమైన అవగాహనను ఏర్పరచుకొని ఇదమిత్థ మయిన చర్యలు తీసుకోవాలి, ఒకవైపు ఆధునిక ప్రక్రియలు వేలం వెర్రిగా తలలెత్తుతుంటే, మరోవైపు అవి అర్థం కావడం లేదనే రిపోర్ట్ వింటూ ఉంటే స్వారస్యమైన సామరస్యసాధన లోపించిందని, అది చాల అవసరమని తెలుసుకొని అందుకు తగినంత సాహిత్య సంయమనాన్ని, సారస్వత నిగ్రహాన్ని ఏర్పరచుకోవాలి. ఇది ఈనాటి సాహిత్య మూర్తుల ప్రథమ కర్తవ్యంగా గుర్తించాలి!

## 5. కొన్ని విశేషాంశాలు

a) "సమాఖ్య పత్రికలంటే ?" -అనే ప్రశ్న పదే పదే ఎదురైంది.

b) మినీ కవితలు రాసేవారు కవులా ? అని చాలా మంది అడిగారు. నిజానికి వాటిని చదివేవారి కన్నా రాసేవారే ఎక్కువున్నారని కొందరన్నారు (!) ఏ పదింటికో ఒకటి చొప్పున బాగుంటుందని ఇంకొంద రన్నారు. పద్యమంటే తలనొప్పనే మాట చాలాసార్లు ఎదురొచ్చింది. అభ్యుదయ కవిత్వానికి సరైన నిర్వచనం దొరకలేదు. విప్లవ కవిత్వమంటే "బ్లడ్ రెవల్యూషన్" అని సమాధాన మిస్తున్నారు.

c) ఆధునిక కవితలకు తలాతోకా ఉండవని, అర్థం పర్థం తెలియవని సగం మందిదాక అభిప్రాయపడితే స్థాయిలో కాని, అర్థవిశ్లేషణలోకాని ప్రాచీన ధోరణులలో అల్లిన కవితలే అగ్రస్థానంలో ఉన్నాయని సగం మందికి పైగా అభిప్రాయ పడినారు.

## 6. ముగింపు

స్థాలీపులాక న్యాయం ప్రకారం ఈ పరిశీలనకు సార్వత్రిక అవగాహనను ఇచ్చి తగినచర్యలు తీసుకొనవలసిందిగా సాహితీ విజ్ఞులను కోరడం అశాస్త్రీయ మనిపించుకొంటుంది. ఇదే కోవకు చెందిన పరిశీలనలను మరింత క్షుణ్ణంగా పలు ప్రాంతాలలో జరిపి పరిపూర్ణమైన సామాజిక ప్రతిస్పందనను గుర్తించి, దానికి తగినట్లుగా, తగిన సమయంలోగా, వీలైనంతగా చర్యలు తీసుకొనవలసిన బాధ్యత, సామాజికస్పృహ ఉన్న ప్రతి సాహితీ వేత్తకు ఉందన్న విషయాన్ని గుర్తుచేస్తూ, గుర్తుపెట్టుకొంటూ ఈ రంగంలో విశేషమైన పరిశోధనలకు ఉపక్రమిస్తారని ఆశిస్తున్నాను.

[నా మిత్ర బృందానికి కృతజ్ఞతలు తెలుపుకోవలసిన అవసరంలేదు. ఎందుకంటే నాకు నేనే చెప్పుకొన్నట్లవుతుంది. కాని నా అయిడియాకు అనుకోనంత త్వరగా స్కెలెటన్నీ, మజిల్నీ చేకూర్చి, నన్ను రాయడానికి ప్రోత్సహించిన వారి "స్ఫూర్తి"కి మాత్రం జోహారులర్పించకుండా ఉండలేక పోతున్నాను- రమేష్‌బాబు.]



శ్రీ పల్లంపల్లి శరభయ్య

# విస్మృత కవి - కీ. శే. జనమంచి వేంకటరామయ్యగారి కృతులు

"మయి కృపాంకురు దేవ! సదాశివ!
త్వమసి మే శరణం సుఖకారణం
తవ దిదృక్షురహం దురితాపహం
హృది శుభావహ మంఘ్రి సరోరుహం"

"సాఁగెన్ యోగము మంచుఁగొండపయి నిశ్శబ్దంబుగా నీకుఁ, గ
ల్పాగచ్ఛాయ సుఖాసనంబు గిరికన్యా సేవయుం గల్గ, నే
డీ? గన్గొందును ఖానమింకఁ గలహోదధి వ్యాధి దారిద్ర్య సే
వా గర్హ్యంబగు నాదు సంసరణమన్ పంచాగ్ని మధ్యంబునన్"

(నవకుసుమాంజలి)

కీ. శే. జనమంచి వేంకటరామయ్యగారు శివ సాయుజ్యమును పొంది నేటికి ఏఁబది సంవత్సరములు కావచ్చుచున్నది.

ఈ కవి చంద్రునకు ప్రియతమములైన యీ గోదావరీ తీరము ఈ అశ్వత్థ వృక్షము ధ్యేయమైన శ్రీ సూర్యకుండేయు శివలింగము ఈయన శివభావనకు సాక్షులై నేటికిని అట్లే నిలిచియున్నవి.

జ్ఞానాకృతియైన శివ స్వరూపమే యీ కవీంద్రుని కావ్యవస్తువు. ఈయన తత్త్వానుభవము సత్యస్వరూపము. కవితారూపము నందిన ఆ యనుభవ నిష్యందము సౌందర్య స్వరూపము. సన్నని దయ్యును అది ఆంధ్రశారదా మౌళి తలమున అమృత కళయై వెలుఁగుచున్నది.

జహాంతవః ఫలమై యుదయించి అమృత నిష్యంద రూపమైన యీ ఆత్మకళోదయమును స్వానుభవైక సాక్షికముగ అనన్య సాధారణరీతిని ఈయన యిట్లు వివరించియున్నారు.

"ఇంద్రియ గోచరంబయిన యేవిషయంబొ కవీంద్రు డెందమున్
సాంద్ర వికార భాజన మొనర్చుచు నస్తమితాన్యభావని
స్తంద్రముఁ జేసి యవ్వెనుక సర్వము తానయి నిండి, పొంగి స్వ
చ్ఛందగతిన్ రసాకృతిని జాల్గొనఁగా, నదె కావ్యమయ్యెడిన్"

(అమృతకలశి)

ఇంద్రియ గోచరమైన ఒకానొక విషయము జపాకుసుమము వలె శుద్ధస్ఫటిక సంకాశమైన కవిహృదయమును రాగరంజిత మొనర్చుచు ఇతర భావములను అస్తమింపఁజేసి క్రమముగా అంతయును తానై నిండియుండి పొంగి స్వచ్ఛందముగ రసస్వరూపమై జాలువాటి కావ్యముగ మాఱును.

సృష్టిలో సద్యఃకావ్యము అనుపుట్టుట క్రమముట్టిది. నిజమైన కావ్యములిట్లే పుట్టును. ఈ కవి కావ్యములు పుట్టిన క్రమము నిట్టిదియే. విషయము నుండి కవిహృదయవృత్తి, కవిహృదయవృత్తి నుండి విషయము రసముగా రూపాంతరము నొందుట అను అవిరత వ్యాపారమువలన కవి హృదయమే సర్వ రసములకు జన్మభూమి.

హృదయైక ప్రభవమైన రసము హృదయైక వేద్యమే అగును. అది ప్రియురాలి అనురాగమును పోలినది. ఇట్లు

కవిని చదువరిని ఒక్కటిగా కరగించు కవితా స్పందము స్వచ్ఛందములు. అవి-

"రమ్మన్నన్ వెనరావు, రావలదనన్ రాకుండఁగాఁబోవు, రమ్యమ్ముల్ కైతలకున్ గళాకళలు వేళావేళలున్‌గల్లు, సంద్రమ్ముంబొందెడు పాటు పోట్లకుఁబలెన్"

(అమృతకలశి)

ప్రేమ త్రోవ లెట్టివో కవితల త్రోవలును అట్టివి. సముద్రమును ఆవేశించెడి పాటుపోటులవలెనే-అవి రమ్మన్నచో వచ్చునవియును రావలదన్నచో మానునవియును కావు. వానికిని కళాకళలు, వేళావేళలు నుండును.

"వ్యతిషజతి పదార్థానాంతరః కోఽపి హేతుః"

అని-తొల్లి ఆంతర ప్రణయ వృత్తులకు కారణాన్వేషణ మొనర్చిన భవభూతికి- హృదయ ధర్మమునుబట్టి యీ కవి అన్నయో ! తమ్ముడో! అనిపించక మానదు.

ఈయన రచించిన పెక్కు పద్యములిట్లే హృదయామునకుఁదాఁకి కాళిదాస భవభూతి ప్రణీతములైన పద్యములకు వలె చర్వణామృతములై యుండును. మఱికొన్ని శ్రీ పుష్పదంత శంకర భగవత్పాద ప్రణీతములైన పద్యములవలె అను సంధాన యోగ్యములై పావనములై యుండును.

ఈ కవి అవిర్భూతజ్యోతి ! ఒక్కొక్క పద్యము అక్షరరూపమున ఘనీభవించిన ఆ లోపలి వెలుఁగు !

"ఆకాశంబున నొక్కటొక్కటిగ సంధ్యావేళఁ జుక్కల్ బలెన్ పైకిన్ వచ్చెడి వద్దియంబులివి ! సువ్యక్తంబులై, యభ్యసూయాకారాంబుద మాలికావరణతంత్రాపాయముక్తంబులై ప్రాఁకుంగాక భవత్కృపన్ దెసలకున్ బాలేందు చూడామణీ !"

(నవకుసుమాంజలి)

బాలేందు చూడామణీ ! అనుటవలన ఈ పద్యములకు శివునకుఁగల సంబంధము- ఇందు నక్షత్ర సంబంధము వంటిదని సూచితము. అవి దూరమునకు చుక్కలవలెనే కనుపించునుగాని,చేరువకుఁబోఁగలిగినచో ఒక్కొక్కటి ఒక్కొక్క తేజోమయ లోకము !

"హృదయాకాశము మీఁది మీఁదికిని నీ వెక్కంగ నెక్కంగఁ జి
న్నది కాఁజొచ్చెడు నాదు నీడ వలెనే నా చిత్తసంకల్పమున్,
కుదురై నిల్వఁగ నీవునట్టనడుమన్ శూన్యంబగున్ హే విభో !
పొదలున్ వెండియు నీవు దిగ్గిరఁ దమః పుంజాకృతిన్ బొల్చెడున్"

"నడిమింటన్ రవినిల్పి చీఁకటులనానాదిక్కులన్ ద్రోలియున్
వెడలింపంగ నశక్తుఁడౌ నుచుగుహావిశ్రాంత మౌఢ్యాంతమున్
గడుఁజోద్యంబగు నీవు మానవ గుహాగర్భస్థ రత్నంబపై
యడఁగన్ జేయుదు దుస్తమంబఖిల, మౌరా ! శర్వ ! సర్వేశ్వరా !"

(కుసుమాంజలి)

మఱికొన్ని పద్యములను చూచినపుడు కడచిన జన్మలలోని యోగ పథములయందలి అడుగుజాడలు పొడకట్టుచుండును.

"పొడవౌకల్పమునందునిల్చి ఫలముల్ భోగించి భోగించి యా
సుడిగుండంబుఁ గర్మ వాయుపతితన్ శోధ్యంబడన్ వెండియున్
బడితిన్ జీర్ణదళంబు నట్టివడు చీమంబోలి విశ్వేశః నన్
గడఁకన్ జేర్పవె ! యొడ్డునన్ గృపను యోగభ్రష్టు సర్వేశ్వరా !"

"ఎగురన్ జాల, విహంగమార్గమున నీటొత్తే శుకాదుల్ బలెన్
నగు బాటున్ బెనుచేటుఁబాటిలును గ్రిందన్‌బడ్డ; నేనింకఁ బ్రాఁ

కంగనుంజాలను మెల్లఁజీమవలె గంగాయాత్రకై; తీవ్రమం
దగతుల్ గావిఁక నాకునేమిగతి? యార్తత్రాణ! బోధింపవే"
(కుసుమాంజలి)

జీవితములో ఈ కవికి వచ్చిన విపత్పరంపర ఒక్క జీవికి రాఁదగినది కాదు. సోదరవియోగము పుత్రవియోగము నయనావరోధము మొదలైనవి యీ కవి మనోదృష్టిని విక్షిప్త మొనర్చుటకు బదులు ఏకాగ్రగనునే యొనర్చినవి.

ఈయన వ్యక్తిత్వము దొంతరలుగొని అరఁటి పూవు వలె పొడఁగట్టును. ఉపాధ్యాయుడు. గ్రంథవ్యసని. మనన శీలి. కావ్యతత్త్వవేత్త. రసజ్ఞుఁడు. భక్తుఁడు. జ్ఞాని కవియోగి. ద్రష్ట!

"ఆరోగ్యంబు చెడెన్, గుటుంబభరణాయాసంబు హెచ్చెన్, సుదు
ర్వారుల్ పై యధికారులైరి,మఱి సేవాముక్తి భాగ్యంబనన్
"దూరస్థంబగు, జీవితంబు వెగటై తోఁచున్."
(అమృతకలశి)

పరిశీలింపఁగా-ఈవ్యథలన్నియును పైపొరలలోనివే. ఈకవి జీవతత్త్వము లోపల ఒక అమృతపుబుగ్గయున్నది. అదియే యీయనను కవిగా శాశ్వతుగఁజేసినది. సోదర వియోగాదులు, దుఃఖములై యీయనను క్రుంగించుటకు బదులు కావ్యవస్తువులై ఈయనలోఁగల ఆ యమృతపుబుగ్గను పొంగించి అజల్లులో తాము కూడ రసమయకావ్యములుగా రూపాంతరమొందిశాశ్వతములైనవి. మృత్యువులో మృత్యుంజయుని దర్శించి దుఃఖమును ఆనందముగా రూపాంతర మొందించిన యీ కవి దృష్టి నిజముగా స్పర్శవేది. ఒక యమృతకళ, నిత్యానపాయినియై యీయనజీవుని పెన్నంటియున్నది. అదియే అమృతకళయైన యీయనకావ్యకళ!

"ఈశూన్యప్రపంచమందు ఆ దేవికొక్కతెకేనేనుగావలసినవాఁడను. నాకుఁగావలసినదియు ఆ దేవియే. ఏమనఁగా, కవితయే నా జీవిత సర్వస్వము. కవితయే నాకు స్వర్గద్వారము. కవితయే నాకు మోక్ష సాధనము."
(నవకుసుమాంజలి విజ్ఞాపనము)

అని-ఆహార్యనిశ్చయుఁడైన యీ కవీంద్రుఁడు చెప్పికొనఁగలిగినాఁడు ఇట్టి దృఢప్రత్యయము లేనినాఁడు-ఎవ్వఁడును కవిశబ్దవాచ్యుఁడు కాలేఁడు.

మొదటి నుండియు-ఈ గౌతమీ తీరము "కవులకుఁ గాణాచి" అను జనప్రవాదమెట్లున్నను-మఱి-యీ కడచిన నూరేండ్లలో- ఆ కాలప్రభావమెట్టిదో కాని శతాధిక గ్రంథ కర్తలతోఁ గ్రిక్కిరిసియున్నట్లు గోచరించును.

మామిడిపండ్ల కాలములో "కంబాల చెరువుగట్టు" వలె గద్యరచయితలు పద్యరచయితలు కవులు సత్కవులు మహాకవులు - ఎల్ల తెగలును ఒకే కాలములో ఒకేచోట ప్రోఁగులు ప్రోఁగులై పడియున్న యీ యపూర్వ సన్నివేశము ఒక్క యీ నగరమునందే కాననగును.

వాఙ్మయ వైవిధ్యమునకు-ఇదియొక యిరుకైన పెద్ద విపణి! ఎంత సందడి! ఎన్ని యుద్యమములు!ఎన్ని సంస్కరణములు! ఎన్ని పత్రికలు! ఎన్ని వాదములు! ఎన్ని వ్యవహారములు!

వీరేశలింగముగారు వేంకటరత్నముగారుసుబ్బారాయడుగారు లక్ష్మీనరసింహముగారు,కృష్ణమూర్తి శాస్త్రిగారు, వ్యాసమూర్తి శాస్త్రిగారు మఱియును ఎందఱో మహానుభావులు!

వీరిలో ఒక్కొక్కరిది ఒక్కొక్క యుద్యమము, ఒక్కొక్క సంస్కరణముఒక్కొక్కపత్రిక ఒక్కొక్కలోకము! వీరేశలింగముగారివి అనేకోద్యమములు అనేక సంస్కరణములు!

అది ప్రతిభకన్న పరిశ్రమయే పెద్దగా పరిగణింపఁబడినకాలము. అప్పటి వారిలో శతాధిక గ్రంథకర్తలు కాని వారు అరుదు.

యశస్సు-అర్థకరణము వ్యవహారజ్ఞానము శివేతరక్షతి సద్యః పరనిర్వృతి-అను కావ్యప్రయోజనములలో అ నాటి పలువురిదృష్టి పూర్వపూర్వప్రయోజనమునందే నిమగ్నమై యున్నట్లు గోచరించును.

ఇచ్చట - ఒక మాట చెప్పవలసియున్నది. వేంకటరామయ్యగారు నాయకత్వము వహించిన యుద్యమము

గాని చేసిన సంస్కరణము కాని నడపిన వ్రతిక కాని లేవు. స్వభావతః యిట్టి సందడులకు ఆయనది దవ్వుగా తొలఁగి యుండెడి శాలీనమైన మనఃప్రవృత్తి. మతి-సమకాలికులకు వచ్చిన ప్రసిద్ధి యీయనకు రాలేదు.

యశస్సు వేఱు ప్రసిద్ధి వేఱు. కాలాంతరములలో రానైనది యశస్సు. ప్రదికినసాళ్ళలో బహుమార్గములుగావచ్చునది ప్రసిద్ధి. కాలము గడచిన కొలఁది యశస్సు సముజ్జ్వలమగుచుండును. ప్రసిద్ధి మాసిపోవును. కవి భావుకుల పరంపరలలో స్థిరముగా నిలిచి యుండునది యశస్సు. తత్కాలమునందు పామరులలో వ్యాపించునది ప్రసిద్ధి. కవితా గుణ వైభవము చేతనే లభింపవలైనది యశస్సు. ప్రచార బలముచేత సిద్ధించునది ప్రసిద్ధి.

కాళిదాసు మొదలైనవారు కోరుకొన్నది యశస్సు కాని ప్రసిద్ధి కాదు.

"భవేత్ ప్రసిద్ధి ర్బహుమార్గలభ్యా
నానా పథై స్తైః కవయో భవంతి
శైలీచ భాషాచరసోఽధ భావః
శ్రుతేః పథోదూరతరం ప్రయాతాః"

(విశ్వనాథ)

తత్తత్ కాల లక్షణములను బట్టి విలువలు తాఱుమాఱగుచున్నట్లు తోఁచునే కాని అనంతకాలమునందు సారభూతమేనదియే నిలుచుట పరమేశ్వర సంకల్పము. కానిచో మనకు భారత భాగవతాది వాఙ్మయము నిలిచియుండెడిది కాదు.

"ఉత్పత్స్యతేఽస్తి మమకోఽపిసమానధర్మా"

అన్న ఆత్మప్రత్యయమే ఉత్తమ సాహిత్య సృష్టికి జీవనౌషధము.

వేంకటరామయ్యగారిది అట్టి ధీరమైనఆత్మప్రత్యయము.

"మెచ్చి వసుకవీంద్రు, మెచ్చరేని యతండు
మెచ్చు కవిత సరసులిచ్చ నది, య
పూర్వ సరసతయగుఁ, బొరయునే దేవి! నా
ముదము వైపరీత్యమది కతముఁగ."

(అమృత కలశి)

ఆ "అపూర్వసరసతా" స్వరూపమెట్టిదనగా-

"తెలిసి యొకఁడు మెచ్చఁదలఁద్రిప్పునింకొక్కఁ
డద్దిసూచి గంగిరెద్దు వోలె
తాత మృతిని వినుచుఁదల్లి గొల్లనఁ దల్లి
యేడ్పు సూచి బిడ్డఁ డేడ్చినట్లు"

(అమృతకలశి)

భక్తచింతామణి కర్తయైన వసురాయకవి-పరమేశ్వరుని యెదుట-తద్విభూతియైన యీవిశ్వము సెదుట నిలువఁబడిన అద్భుత రసపరిపూర్ణమైన శిశుదృష్టి! అకావ్యమున యెల్ల యెడలగోచరించునది-ఈశిశు మనః ప్రవృత్తియే.

"జననీగర్భములోననుండఁగ విదేశంబేగి పెక్కేండ్లకున్
జనుదేఁదం ద్రినిగాంచుబిడ్డవలెనీసంబంధమున్ముందునేఁ
గన, కీవేళనెఱింగి, స్నేహభయశంకాముత్ప్రతాపాశ్చర్య భా
జనమైనిల్చితిఁజేందిసికొనవే! సద్భక్త చింతామణీ!"

ముగ్ధములైనయిట్టి భావములు వెంటనే సర్వజనులకు హృదయములకు హత్తుకొనును. అందలి ప్రతిపద్యము పరమేశ్వరునిక్షపయను చెట్టు నుండి రాలిన ఒకపండు, ఒక పూవు. అందులో పరమేశ్వరుని కృప దర్శభావించుటకేమి యుండును! ఆయన ముక్త రచనయందు కృతహస్తుఁడైన భక్తుఁడు పరమేశ్వరుడు ముక్తకరచనకుతూఁచినట్లుసరిపోవు కవితాశక్తిని ఆయనకు అనుగ్రహించెను. పద్యములన్నియును ఒకే మూసలో పోసినట్లుండును. వైవిధ్యములేదు భావమువద్యపల రుములో బిగింపఁబడినట్లుండునేకాని-పూవువలె తేకులు విచ్చుకొనుచున్నట్లుగఁదోఁచదు. ఆ బిగింపులో పలుచోట్ల సంధిబంధములు శ్రుతికటువుగా నుండుటయును దోఁచును. పండితులకు గూఢ ధ్యుతి స్ఫూర్తి కలుగదు. అమిడికయున్నంతగా శ్రుతిసుఖము గోచరించదు. స్వచ్ఛంప్రవాహగతి తక్కువ. క్రొత్తభావమురానిదే అయిన కల మెత్తనిమాటనిజమే. జనసామాన్యము ఆ భావముచేతనే ఆకర్షింపఁబడును. శ్రుతిసుఖముచెడని నిర్మాణసౌష్ఠవమును ఆస్వాదించుటకు సాహిత్యరసములోమాఁగిన శ్రవణేంద్రియముతప్పక యుండవలయును. జనసామాన్యమున కది యుండదు.

"పద్యమెంత ప్రౌఢభావమైనను శ్రుతి
కింపుగాక మతికి నింపు గాదు
కంటి కింపుగాక గాదింపునోటికి
నెట్టిమధుర వస్తువేనినిజము"

(అమృతకలశి)

అది యునుగాక - వేంకటరామయ్యగారి కవితలో వాచ్యాంశము కన్న ప్రతీయమానాంశమెక్కువ యుండును. కావున వసు కవీంద్రుని మెచ్చినవారు వసుకవీంద్రుండు మెచ్చిన వేంకటరామయ్యగారి కవితను మెచ్చకపోవుటలో ఆశ్చర్యములేదు. స్వయముగ కవియగుట వలన కవిత్వపు లోతులు తెలియుటచే వసుకవీంద్రులు వేంకటరామయ్యగారి కవిత్వమును మెచ్చుకొనుచుండెడివారు. ఇందువలన వేంకటరామయ్యగారు "కవీనాంకవిః" అనెడి శ్రేణిలోని వారని తేటపడుచున్నది.

"భక్త చింతామణి" సర్వమతములవారికిని సమాదరణీయ మగుటలోఁగలరహస్యము ప్రధానముగ అందలిదైవమునకు నామరూపములులేకుండుటయొకటి-పునఃపునరావృత్తమైన పితాపుత్త్రి సంబంధమొకటి. అందును ఛందః ప్రతిబంధము వలనఁగొన్ని సందర్భములలో "ముకుందా!" అనుట గమనింపఁదగియున్నది. మొత్తముమీఁద ఆ గ్రంథము చదువునప్పుడు శ్రీకాళహస్తీశ్వరశతకమో, దాశరథి శతకమో చదువునప్పటి ఆత్మీయత అనుభవమునకు రాదు. నామరూపముల మాధుర్యమట్టిది! నవకుసుమాంజలిలోఁ గూడ శివానందలహరి మున్నగు సంస్కృత గ్రంథములలో వలెనే మకుటనియమములేదు. అయినను అచ్చటచ్చట "బాలేందుచూడామణీ!" అనియో, "ఖండేందుచూడామణీ!" అనియో విన్నపుడు గుండెఝల్లుమనకమానదు.

మొత్తము మీఁద నాటిరాజమహేంద్రవరకవులలో వసురాయకవియే కవితాగుణమునుబట్టి వేంకటరామయ్యగారికి కొంత సన్నిహితులుగా, వచ్చుచున్నట్లుగోచరింతురు.

"వినతుండై తన విద్దెపేఁడు చెలుతన్ ప్రేల్పట్టి కద్దించుఁగాడనఁడున్, జేయఁడు శక్తి వంచన, మనూయన్ జేసి యట్లొట, నె ట్లొనరించునగురుధర్మకోవిదుఁడెయయ్యన్, వత్స్రపామోదియు

య్యను, ద్రోణుండల సుబ్బరాయకవితో నీప్పారఁగా సఖ్యమున్"

(అమృతకలశి)

వేంకటరామయ్యగారికి వసుకవీంద్రుని యందుఁగల గౌరవభావమును పై పద్యమునందుతేఁటపడుచున్నది.

నవకుసుమాంజలి. భక్తచింతామణికంటె పెక్కు సంవత్సరములు తరువాతిరచన. రెండును భగవత్ పరములే. కాని కుసుమాంజలిరచనకు శ్రీ శివానందలహరి, శివమహిమ్నము ఉద్బోధకములు.

భగవత్పరములైన తలంపులు ఊహలువేఱు. భావములు వేఱు. తలంపులలో ఊహలలో అద్భుతాశ్చర్యముల వైచిత్రి యుండును. భక్తచింతామణిలో ఈ అద్భుతాశ్చర్యములే బహువిధములైన ఉల్లేఖములతోనెల్లయెడలఁగాన నగును. అది అపరిధినిదాటిపోలేదు.

కావ్యరచన మూఁడు విధములు:-

"వస్తువుతోడియైక్యమును భావనసేసిన సుప్రశస్తమౌ
వస్తువుకన్న భిన్నుఁడయి వర్ణనసేసిన మధ్యమంబగున్
వస్తువుతానుగాక మతిపాఠకుఁడున్ దనబుద్ధినిల్పినన్
ధ్వస్తమగున్, గవిత్వమది ప్రజ్ఞనె వెల్లడి సేయఁబూనుటన్"

(అమృతకలశి)

ఇందు - కుసుమాంజలి రచన మొదటిమార్గములో నడచినది. చింతామణి రచన రెండవ మార్గములోఁ బ్రయాణంచుచు మూఁడవ మార్గమునకు మొగ్గుచున్నది.

వస్తువుతో ఐక్యమును భావించినపుడు అస్మితాన్యభావమై యుదయించినదానికే "భావ" మని ప్రసిద్ధి. అట్టి "భావ" మునకే రసస్పర్శయుండును. హృదయము తన్మయమై ద్రవీభావము నందుటకు "భావ" మే ఆలంబనము. అట్టి భావముల స్వరూపము ఇట్లుండను.

"దివిజనదీనతటంబులను దియ్యని పచ్చికమేసి మేసి, తత్
ప్రవిమల వారిఁ గ్రోలి, సురపాదపమూలమునందుఁ గామధే
నువు తొలి చూలిపోలిక మనోజ్ఞతరాకృతినొప్పి నీదు సే
వ వలను జూచుచున్ నెమరువైచుచు వందివలెన్ సుఖంబుమై-
ఁ ఉండక-బండియెద్దునయి యుర్వి, జనించితిఁ గాఁడి మోవఁగాఁ
గండలు రేఁగి పుండులయి కాయలు కాఁచిన మూఁపు గ్రుంగ, ను
ద్దండతఁ బట్టి కొట్టెడును దండధరుండయి కర్మచోదకుం
డండ యొసంగి యీ పశువు నాపదలెప్పుడు నాపెదో! ప్రభూ!"

(నవకుసుమాంజలి)

మఱియును - ఇట్లుండును.

"నేలం బ్రాఁకెడు పూవుదీఁగెవలెనే నేనుందునో దేవ! న
న్నీ లోకంబునకేల తెచ్చితివొ! నాకేచోటు నే మించితో!
పూలాపూవను, మొగ్గలా తొడువనున్, ప్రోడైనఁ గానున్ బసుల్
గాలం ద్రొక్కఁగ స్రుక్కుచుండు, నిది నాకర్మంబె! సర్వేశ్వరా!"

(కుసుమాంజలి)

కుసుమాంజలి యిట్టిభావములకు ఖని!

తన నుండి వెలువడిన భావములలో-తాను కను మఱుఁగై యుండియే వానిలో ప్రాణకళను ప్రతిష్ఠించి మూర్తిమంతములైన అభావములను చదువరులగుండెలో కదలునట్లు చేయుకౌశలము ఈకవికిఁగలదు.

"ఆఁకట నేడ్వనోపునని యారయ వచ్చిన తల్లిఁ జూచి, తా
నేఁకట వాసియేడ్పుడిగి యెత్తు మఱంగిన బిడ్డ వోలె ని
న్నే కనుగొంచు నీశ! సుఖియించెద నెమ్మది గోరకన్య ముమ్!
గైకొని నాదు ప్రార్థనలఁ గ్రచ్చఱ నన్ననరావె! యీశ్వరా!"

"పిదియొచూచి బూఁచియని యెంతయు బెగ్గిలి యాట మాని, య
త్యాదృతి 'నమ్మ! యమ్మ!' యని తల్లియొడిన్ శయనించు బిడ్డకున్
మేదిని మీఁదఁ దాన తన నీడను జూచి కలంగి, మృత్యువం
చాదట నిన్నుఁ జేరెడి భయార్తునకేది విభేదమీశ్వరా!"

(కుసుమాంజలి)

ఇట్లే - మాటలకు అందని యోగానుభవములకుఁ గూడ విస్పష్టమైన రూపమును-ఈ కవి కల్పించును.

"ఒడలన్ దగ్గఱియుండి నట్టులగు, వాయుస్పర్శ మున్ గాదు, నల్
గడలన్ జేర్చెడు నొక్కచోటి, కయినన్ గా దంధకారంబు మున్
గడెయుం గంటయు జాముఁ నుండెలియుపై నన్ నిద్రయుం గాదు బల్
విడిమై వృత్తివిశేషమొండు హృదయావిర్భూతమై యీశ్వరా!"

"మౌనమ! చంచలేంద్రియ సమాజ కవాటపిధానమా! నినున్
ధ్యానము సేతు, నా పయిని నల్లన వ్రాలుము, శాంతిదేవి కిన్"
మానుగ నీవు నాల్కవఁట! నా చెవినూఁదవె! తద్రహస్య మున్
మానిత భావరత్నఖని! మాటలు వేయును నేల? నాకిఁక న్"

"భావమెలోనఁ బాడు కొను పాట విధంబున నింపుసేయు! తద్
భావము పల్కు పల్కొ యిఁక పానకమందలి పుల్లయే యిగన్
గావున మౌనమూని యవికల్ప సమాధిని నిల్పి చిత్తమున్
భావవికారదూరు నినుభావన చేసెదనో మహేశ్వరా!"

"రాగము పాడి పాడి మధురంబగు తత్కృతి వెన్కఁ బాడరో!
బాగుగ ముందుఁ దత్కృతినిఁ బాడుచుఁ దత్కళ వెన్కఁ జూపరో!!

యేగతియైననేమి సుఖమే కద రెంటను నిల్చిపొల్చెదున్!
యోగికి నిర్గుణంబు మఱియున్ సగుణంబునొకండె
యీశ్వరా!"

(కుసుమాంజలి)

ఐహిక జీవితమునందు సుఖదుఃఖ భోక్తగా సంసార బద్ధుడుగాఁ గానవగు జీవుఁడు ధ్యానయోగము వలన గుహాశయమైన శివ స్వరూపముగఁబరిణమించుచున్న స్థితి కుసుమాంజలిలో పెక్కుచోట్ల విస్పష్టముగా గోచరించును.

"ఒంటిసజీఁకటి మౌనమూని యొకటేదో మెల్లఁజింతించు కొం
చుంటి పేడ్కఁగఁదోఁచు నాకెపుడు,నేఁడో!యద్దిరెట్టించె,నే
మంటేనిన్, నిను గూడియుండుటను; దివ్యంబైన నీ వెల్గుఁ గ
న్గొంటిన్, నీ పలుకాలకించుట నెదన్‌యోగీశ!సర్వేశ్వరా!"

"ఛాయారూపములద్ద మందుఁగననౌ చందాన నీమాయచే
నీ యందుండు సమస్త భూతములునుక్, నీ వుండవ వ్యానిలో;
మాయంబైయవి కాలకర్మ వశతన్, మబ్బుల్‌బలెన్ బోవఁగా
నో యీశా! వెలుఁగొందె దంబరమునన్, జ్యోతి స్స్వరూ పంబునన్"

"ఈవున్నే నొక తల్లి బిడ్డల మెసుమ్మీ! యొక్క పెన్‌దివ్వటీ
నే వెల్గించిన జోతు దివ్వెల మె సుమ్మీ! యీశ్వరా! నా కిఁకన్
నీవే పెద్దవు, ముందుపుట్టుక తనన్,నీ క్రిందనేనుందు,నా
హా! ఏంతౌనిఁక, నీవు నేనువొకటే,యా దివ్వటీవెల్గులో"

"మామక హృత్సరోవిహరమాణమరాళ విభుండవైన నా
సామిరి నిన్ను నేమని ప్రశంసయొనర్తును భక్తి పెంపు నన్
రాముఁడ వన్ననున్ బురవి రాముఁడవన్నను మౌని మానసా
రాముఁడ వన్న నెంతొ యభిరాముఁడ వౌదువు నాకు మాధవా!"

(నవకుసుమాంజలి)

ఈయన కేవల కవికాఁడు. కేవల యోగియును కాఁడు. శివత్వము నందుచున్న కవి యోగి!

## అమృతకలశి

పూర్వ కవుల కవితామార్గములకు విజాతీయము కాని త్రోవలలో ఒక క్రొత్త వెలుఁగు వేంకటరామయ్యగారి ప్రతి పద్యమునందును నిండియుండును. అది అంతశ్చక్షుర్వికసనము వలన లోపలినుండి ప్రసరించుచున్న వెలుఁగు కాని వెలుపల నుండి తెచ్చికొన్న వెలుఁగు కాదు.

"క్రొత్త త్రోవఁద్రొక్కి క్రొత్త సీమలఁజూపి
క్రొత్త చవులఁ దేల్చి చిత్తములకుఁ
గ్రొత్తవికసనంబుఁగూర్పని యాకైత
సెప్పిరేమి? యింకఁజెప్పకేమి?"

(అమృతకలశి)

ఒకడు కవియగుటకుఁజేయవలసిన సాధనలను, తపశ్చింతనలను అన్నింటిని ఈ కవి "అమృతకలశి"లో నిక్షేపించెను. కావ్యజగత్తును అడుగిడఁగోరువారు ఆ చింతనలను తప్పక అనుసంధించి తీఱవలయును. కవియగుమాట ఎట్లున్నను, సరియగు రసజ్ఞతయైన అలవడి తీఱును. ఇందులో ఈయన వివేచించి నిగ్గు తేల్చని కవితా మార్గము లేదు. "కావ్యజ్ఞ శిక్షయా అభ్యాసః" అన్న నెట్లుండునో. ఇది చదివినచో తెలియును. సంస్కృతమున రాజశేఖరుని కావ్యమీమాంస యెట్టిదో తెనుఁగునకిది యట్టిది. ఇందులో ఈయన వ్యావహారిక భాషావాదము కావ్య నిర్మాణమునకు పనికిరాదని ఖండించి నవ్యసాహిత్యవాదుల వగకుఁ బాత్రమయ్యెను. ఈయన కృతులకు కలుగవలసినంత వ్యాప్తి కలుగక పోవుటకు అది యొక ప్రబలహేతువు. అది విషయాంతరము.

ఈ కృతియంతయును మనన తపఃఫలము. ఈయన అంతర్మథనమునుండి వెలువడిన కావ్యతత్త్వామృతము!

ఆ యమృతము ప్రాతిభమైన అంతశ్చక్షువును వికసింపఁ జేయును. నిఖిలార్థములను వెలిఁగింపఁజేయు ఆ-లోఁజూపే కవికి మూఁడవ కన్ను!

వేంకటరామయ్యగారి కవితా వ్యాసంగము ఆ కాల లక్షణమును బట్టి అనువాదములతోనే మొదలైనను ఈ అంతశ్చక్షుర్వికసనమువలన ఆయనకు తెలియకయే ఆయన లోని కవితాత్మ రూపుగట్టుచుండెను. కవిత్వమును ఆయన పరమానంద రసానుభూతికి సాధనమైన యోగమునుగా దర్శించెను. ఆయనకు కవిత్వము, యోగము రెండు కాదు. అందువలననే ఆయనది కవితాయోగము.

వ్యుత్పత్త్యభ్యాసశక్తులతో వాణీప్రసాదవిశేషమువలన తొల్లింటి సంస్కారములు పచేళిమములై వసంత శ్రీసమారంభవేళ చివురుగుబురులలో దాఁగియున్న వనప్రియ కంఠ కుహరమునుండి హఠాన్నిర్గతములైన మధురధ్వనులవలె శివమూర్ధోపరిఖేలదంబరధునీదివ్యప్రవాహములవలెబహుతపః ఫలములైన కవితా ప్రవాహములు ఆయన గళము నుండి వెలువడి దాహోపశమములై విబుధులను ఓలలాడించెను.

ఆ కవిత, గాజుకుప్పెలతో కాశినుండి కొనితెచ్చిన గంగాజలముకాదు. అది స్వచ్ఛందమైన దివ్యప్రవాహము.

తత్త్వవేత్త సత్యమును సౌందర్యముగ గానము చేయుటకు కవియై తిరిగి జన్మించును. కవిద్విజుఁడగుట యిందుకే!

"జననీ!నీదు కృపాకటాక్షమున వాక్సామ్రాజ్యధౌరేయుతన్
గనఁగంటిన్, గనఁగల్గి క్రొత్త వెలుఁగున్ గల్యాణి నీ మోమునన్;
జననంబందుచు నేఁడు క్రొత్తగను నీసౌవర్ణగర్భంబునన్
గనెదన్ గ్రొత్త ప్రపంచ మొండిదె! నమస్కారంబు వాగీశ్వరీ!"

(అమృతకలశి)

సరస్వతీస్వర్ణగర్భమునుండి తేజోవలయముతోఁగవి యీపృథివిపై నవతరించును.ఆవెలుఁగులోనుండిచూచినపుడు గాని కావ్యనిర్మాణరహస్యతత్త్వముతేటపడదు.

"చెప్పఁడు కవి, భువి నితరుఁడు
చెప్పెడుక్రియ, ముఱుఁగు విడిచి, చిత్రఁజేదో
గుప్పిటనిడి యూరించును
జెప్పి కొసెడు దాఁక తండ్రి శిశువులను బలెన్"

"పెదవి కదలింప కుండ నవ్వినయ ట్లంత
నగవు కనుదోయి కేవల నిగిడి, మొగము
దమ్మి వికసింపఁజేయు చందమున మెఱసి
ప్రౌఢ కవివాక్కు హృదయంబు సలరఁజేయు"

(అమృతకలశి)

మనకు మానవ భాషలు మాత్రమే తెలియును. మన మెఱుఁగలేని ఒక అపూర్వ భాష కవికిఁదెలియును.

"తెలుఁగున్, సంస్కృత, మాంగివేయ, మని ప్రత్యేకంబుగాఁగొన్ని భా
షలెకా దన్ని యెఱుంగ నేరుతురు ప్రజ్ఞాచక్షులై దక్షులై;
అలలున్ గాలులుమబ్బులున్బలుకఁగానయ్యర్థమూహించుచున్
బలుకన్నేరుతు, రింపుగాఁ బ్రకృతికిన్ భాష్యప్రణేతల్ కవుల్"

(అమృతకలశి)

కవిహృదయము కామధేనువు పొదుగు. అది మధుర రస పూర్ణమై మాటిమాటికిఁ జేపి అమృతధారలు కురియు చుండును.

కవి హృదయమున భావ ముదయించుక్రమమిట్టిది-
"అవి, దఁదృశ్య రూపమున నర్యమతత్తమహార్ణవోద్గతం
బై విను వీధిఁజల్లఁగ నవాంబుదరూపము నొందునట్లుగా
నేవొ యసంగతార్థములనేకముగా హృదిఁదోఁచిభావముల్
వేవిపులత్వ మొందెడు వివేక సమీకృత రమ్యమూర్తులై"

(అమృతకలశి)

నిజముగ రసజ్ఞుఁడైన వాఁడు అవశముగ తన యానందము ప్రకటించును. ఇతరుఁడు-

"మౌనంబున్ భజియించు నన్యసుమనో మాధుర్యదుర్యోక్తిచే
నానందించియు, నభ్యసూయయొ! యసభ్యంబొ దురభ్యాసమో!

ఔనే యిద్ది రసజ్ఞ ధర్మము? మరందాస్వాదనా పాదిత
స్వానందంబు మలీమసాళి యుఁ బొరింజాటుంగదా! ఝుం
కృతిన్"

తెనుంగు పలుకుల మాధుర్య మిట్టిది-

"తియ్యని ద్రాక్షపండ్లకును దీటయి తేనెయురంటి పండ్ల
కున్
వియ్యములై రసాలముల నెయ్యములై మఱి జుంటి
పాలకున్
దియ్యములై యెసంగు మన తెన్గులు వీనుల విందు
సేయు, న
క్షయ్య ముదంబునన్ బ్రదుకఁగల్గుదు మన్నము నీళ్ళు
లేకయే"
(అమృతకలశి)

మంచి కవిత్వము రచింపఁజాలనిచో నిస్పృహనొంద
నవసరములేదు. కుకవిత్వము రచింపకుండుటయే పది
వేలు.

"ప్రతి పద్యంబు రసాస్పదంబుగ రచింపన్ శక్తిలేదేని, పం
డితులున్ బామరులున్ జెలంగి పొగడన్ లేపేని, నెప్పుడే
పురా
కృత మింతేయని చింత నొందఁదగ, దింకేమన్నఁ
బ్రాజ్ఞుండు సం
స్కృత కావ్యామృతపాన మత్తమతియై క్రీడించుచొప్పున్
గదా!"

ఈ హితోపదేశము నూటికి నూర్వురును ఆచరణలో
బెట్టఁదగినది. అప్పుడు దేశములో సరియైన రసజ్ఞత యేర్ప
డుటకు మార్గమేర్పడఁగలదు.

"పద్యం బల్లుటయే కవిత్వమని సంభావించు సాహిత్యసద్
విద్యాగంధ దరిద్రు లెంచనరులే? పెంజీఁకటింగానలో
ఖద్యోతంబులఁ జూచి నిప్పులనుచున్ గ్రాఁగగన్ జలింబ్రీతిమై
నుద్యోగించెడి వెఱ్ఱివానరులె, గా కూహించి చూడంగడున్"

"నిలుకడయె వలయునేనిన్
నిలుకడయే వలయుఁ గృతికి; నిమిషార్థములో
పల నిండి పొంగి పొరలెడి
సెలయే ఱఱఁగెడు; నడఁగునె జీవనది! యింకన్
(అమృతకలశి)

ఇట్లు-పద్యరచయితలకు నుండి మహాకవుల వఱకుఁగల
అంతరువులన్నియు వివేచింపబడి "అమృతకలశి"లో కవితా
స్వరూపము నిర్దేశింపఁబడినది.

కాని-ప్రతిభాది పరికరమున్నంత మాత్రమున నైన
కావ్యము నెరవేరదు.
కవిత్వమునకు అనుభూతియే మూలద్రవ్యము.

## సోదరస్మృతి

ఈ కవికి సోదరవియోగము సంభవించినది. ఈయన
హృదయములో ఆ దుఃఖము కొన్ని నెలలు మాఁగినది.

ఈయన భావన గహనములైన మృత్యు తత్త్వ
కుహరములలో అన్వేషణకు త్రోవలు దీయ మొదలిడెను.

"ప్రాణి చేతిలో జీవిత రహస్యమను అపూర్వ
ఖాద్యము పెట్టి కన్నుమూసి పసివానిని దొంగవలె మృత్యువు
తన వెంటఁదోడ్కొనిపోయి అదృశ్యమగును."

"మృత్యువు-జీవనసముద్రమునంతయును ఆరఁగ్రోలి
యును కుతితీఱక వేఁగుచున్న బడబాగ్ని! సమస్త జీవు
లను నమలకయే మ్రింగెడి ఒకానొక అదృశ్యమహాసర్పము!
ఎల్లశ్రమల నడఁగించి చల్లఁగ ఆక్రమించి కొనెడు ఒక పెద్ద
నిద్దుర!"

అది- "వ్యక్తావ్యక్తములను దృశ్యాదృశ్యములను
కలుపు గోదావరి మీఁది వంతెన! ఆవలి యొడ్డున ఏమున్నదో
తెలియదు. దీనిపై వాసనావశులైన కొందరు జీవులు.
భూమ్యాకాశములమధ్య రాకపోకలు చేయుచుందురు.

"తమ తమతఱిని భువినిదినిని ఆవరించు వెలుఁగు
చీఁకటులే జీవితమరణములు."

"ఈ యింటిలో భుజింతుము ఆ యింటిలో నిద్రింతుము.
జీవితము మరణముకూడ నిట్టివే" అగునేమో!

"ఎక్కడినుండి వచ్చుచున్నావు? ఎక్కడికిపోవుచున్నావు?
ఎందుకిట్లు తిరుగుట?- అని ప్రతిదినము ఉదయాస్త
మయములలో పక్షులు సూర్యుని పెద్ద రొదగా అడిగినదే
అడుగుచు ప్రత్యుత్తరము పొందుటలేదు."

"అణుచున్నదివ్వె కాంతి వలయము క్రమక్రమముగా
తగ్గుచున్నట్లు - పాఱుచున్న ఏటివెల్లిలో నడిమి
చిఱులంక మునిఁగిపోవుచున్నట్లు - తెలివిక్రుంకు
చుండగా నేను మృత్యు స్వరూపమును జూచితిని."

"చెడిపోయిన వీణనుండి స్వరసమ్మేళన శక్తి యుడిగి పోయినట్లు
భూత పరిణామమైన దేహమునుండి చైతన్యము పోవుటయే
మరణమందురు జ్ఞానమంతయును సంస్కార ప్రబుద్ధమైన
స్మృతి వెనుక 'నేను' లేనిచో స్మృతి యెచ్చటిది?"

ఈ విధమైన అన్వేషణలో ఆత్మనిత్యత్వమును కనుగొనిన యీ కవి–సంసృతి బద్ధజీవుల పునరావృత్తి క్రమము దర్శించి మనోహరముగనిట్లు రూపించెను.

"ఇంతన్ గ్రంథసమాప్తియంద్రు తరువాయే మాత్రమున్ లేదటం
డంతర్వేదికిఁ బైన నూళ్ళవల లేవంద్రయ్యయో! ఆత్మకున్
సంతప్తాంబుధిబాష్పమట్లది యదృశ్యంబై దివింజేరి,యా
సంతాపంబు శమింప వెండి చినుకై జాఱున్ భువిన్ దమ్ముఁడా!

-కడుపునఁగొన్ని డిందెడి నకాలపు మృత్యువెబాతకంబుగా;
పుడమినిరాలుఁగొన్ని, తడుపుంబయిపైనటుకొన్ని, కంటి నీళ్
దుడుచునుగొన్ని, నింపుఁబరితుష్టిగఁజిన్కులు కొన్ని, శుక్తిలోఁ
బడినవి ముత్తియంబులయి స్వామికి హారముఁగూర్చుఁ దమ్ముడా!"

మోహపుఁజీఁకటులయందు ముంచవచ్చిన దుఃఖము కవికి అతీంద్రియార్థ దర్శనమునకు అంజనమై శాంతి సమాధానములను అలవరించినది.

ఇష్టవియోగ దుఃఖితులైనజీవులెలరకు ఇట్టియూరటను చేకూర్చెడు కవి దుఃఖముకూడ విశ్వశ్రేయమునందుపర్యవసించి కావ్యప్రయోజనము చరితార్థమగుటయిందుఁగాననగును.

అవిచ్ఛిన్న మహావాహినియైన యీ జీవననదికి జీవిత మరణములు ఉభయ తీరములు!

"ఆవలి యొడ్డుఁజేరి కుతియారఁగఁగ్రోలుము స్వచ్ఛ జీవనం
బీవలి యొడ్డునన్ బసుల యెక్కుడు త్రొక్కుడచే జలంబు పం
కావిలమయ్యె,నైన నది యంబరగంగయటన్న పూర్ణ సం
భావనఁజేసి త్రావుదుము! వాస్తవమిట్టిదెకాదె!తమ్ముడా!

ఇది- ఎంత కరుణభరితమైన హృదయాశ్వాసము!

"ఆకాశంబుననుండి శంభుని శిరోద్వారంబునన్ భూమిపైఁ
బ్రాఁకన్నేర్చిన బడ్డకట్టులు రజస్స్పర్శంబుచే నైనదే
కా, కీ కల్మష మెన్నఁగా సహజమే గంగా మహాదేవికిన్
లోకోజ్జీవని లోకపావని నెటుల్ దూషింపనౌఁ?దమ్ముడా!

గంగవలెనే-ఈ కవితామహాగంగ రజస్సముద్భవములైన సర్వజీవ కాలుష్యములను క్షాళన మొనర్చివైచి పరమ శివస్పర్శానుభవముచే పావన మొనర్చుచున్నది!

"ఒక చన్నిదరి తల్లిగౌతమికి; నీ యున్నట్టియా యొడ్డు వే
రొకచన్నై;యొసఁగన్ సహోదరులమై యుప్పొంగు జీవామృతం
బకలంక స్థితిఁగ్రోలుచుందు, మిఁకదాహంబగ్గలం బౌటనా
సుకృతీ! నీవధికంబుగ్రోలుదువిదే సుమ్మీ! విభేదంబనన్"

సుకృతులైన యీ సోదరు లిరువురును వాగ్దేవత యొక్క ఉభయ స్తనంధయులైన కాళిదాసభవభూతుల వలె రస మయ లోకములలో నిత్యులై క్రీడింతురు!

మఱి యిన-సోదర వియోగ సంతప్తమైన యీ కవి హృదయమునుండి అవిర్భవించిన యీ అఖండ కరుణ గౌతమి -గతాసువులు అగతాసువులునైన సర్వజీవులను ఏక గర్భ జనితులచే యొనర్చి తన స్తన్యామృత క్షీరముంచే అప్యాయితులను అప్లావితులను జేయుచున్నది.

కావ్యముల వలన కలిగెడి పరమోదాత్తమైన అమృతత్వసిద్ధికి ఈ కావ్యము పరమమైన నిదర్శనము.

చిత్రముగ–ఈ వియోగము కవికి సోదరునితో అవియోగ రూపమైన అద్వైతస్థితిని కలిగించి కవితా కైలాస శిఖరమునందు నిత్యునిగ ప్రతిష్ఠించుచున్నది.

"నీకూర్పాసమునేఁబయిన్ దొడుగుదున్, నీ పాగనేఁజుట్టుదున్
నీ కష్టంపడి కట్టినింట నిలుతున్, నిల్తీవు నాయాత్మలో
నీ కన్నట్టి యనుంగు బిడ్డలనిఁకన్నేఁజూతు నీకంటనే
నీకున్ నాకు విభేద మెక్కడిది నేనే నీవుగాఁదమ్ముఁడా!"

"కరుణం బొక్కటియే రసంబనుట నిక్కంబే మొ చూడన్ భవత్
స్మరణంపున్ జెనుబుగ్గఁ బుట్టినదియై జ్వాలాటిచింతాపరం
పరలేశై కలయిన్‌హృదాకృతిముఖద్వారా సద్వ్యోగసా
గర సంగంబు భజించుఁ జిత్రము వియోగంబే మనన్ దమ్ముడా!"

"ఈవే మూల మొ!యా మహేశ్వరుఁడు తానేమూలమో! ప్రేమభ
క్త్యా వేశంబునఁబల్కువల్కులివి సత్యజ్ఞానమూలంబుల్
భావింపన్‌బడు, నీవు నీశ్వరుఁడు నద్వైతస్థితిన్నిల్చి, నా
భావంబందువెలుంగుటన్ సుగుణదీపా! సత్యనారాయణా!

"ఆడ కెయాడుదున్ శ్రుతిరహస్య మెఱింగినవాఁడవోలె, నే
పాడక యుట్లె పాడుదు నపారముగా సుఖపారవశ్యముల్
చూడకె చూతునర్థములసూరిజనంబులు తత్త్వముంబలెన్
నేఁడిదియే మొ నా హృదిని నిల్చివెలుంగ, శివుండు తమ్ముడా!"

ఈ పద్యములయందు రసాకృతియైన పరమశివుఁడు తాండవించుచున్నాడు. కరఁగుటకు ముందు "గుండె" అను పదార్థమొకటి యుండవలయును. అది శిలయైనను కరఁగి తీఱును. ఇంత కాలమునకు పిమ్మట మఱల భవభూతివంటి కవి మన భాషలో పుట్టినాఁడు.

"కాలో హ్యయం నిరవధిర్విపులా చపృథ్వీ"

అని ప్రతీక్షించుచున్నాఁడు. వాస్తవమున నీఁయన అత్మనుండి వెలువడిన-ఈయనస్మృతకళచేత వాఙ్మయమునందు-ఈయనకు సదాశివత్వ పదవి నిత్యమై వెలుఁగుచున్నది.

ఈయన మహాకవియగుటయేకాక గొప్పసాహిత్యాచార్యుఁడు. తాను నిర్దేశించిన కవితా లక్షణములకుఁదానే లక్ష్యమై నిలిచిన పూర్ణకవి. అనఁగాఎవ్వఁడు కవి? అన్నచో "ఇట్టివాఁడని" చూపుటకు సంపూర్ణ లక్ష్యమైనవాఁడు! ఈయన కృతి శకలములు కొన్నియీసంపుటిలో "త్రిదశి" యను పేర సంకలనము చేయఁబడినవి. నవకుసుమాంజలి అమృతకలశి సోదరస్మృతి అను మూఁడు దశలలో త్రికూటమునుండి దిగిన త్రిమార్గగవలె ఈ కవితావాహిని తన మార్గమునకుఁ దగిలిన వివిధ విషయ కేదారములను అమృతా ప్లావితముల నొనరించుచు ఆంధ్ర వాఙ్మయ సీమలయందు "త్రిదశి"యై ప్రవహించుచున్నది.

శిఖరములనుండి దిగునప్పటి వేగము వేఱు. మైదానముల మీఁది సమప్రసారధారా రమణీయ మార్గములు వేఱు. ప్రసన్నతయందలి లోతులలో మిలమిలలాడు భావసౌంద ర్యము త్రామపర్ణి మౌక్తికము వలె చూపులోనుండి డెందమున కందునే కాని ఇదమిత్థమని చూపుటకు చేతి కందునది కాదు.

మాధుర్య రససముద్రమైన శ్రీకృష్ణదైవము "వెన్నదొంగ"యై యీయన యెదలో "దోబూచి" యాడి యీ కవిని మత్త కోకిలమును జేసి క్రొత్త పాటలు పాడించెను. ఆ మధురానుభవములు "కనులఁ బెట్టిన చలువక పపుఁగాటుక" వలె కరఁగిపోవునవి. అవి తమతమ హృదయైక సాక్షికముగ అనుభవింపవలసిన "ఆనందగీతములు!"

"బంగిచక్రము" సృష్టి నిత్యత్వమును గానముచేయు చున్న జనపద వధూహృదయముల నుండి తరంగితమైన ఊడ్పుపాట! వారు పుడమి తల్లికి బిడ్డలు.

"ఎండగాసిన వాన కురిసిన నేళ్ళు కోళ్ళునునేకమై
నిండి పాఱిన నూళ్ళు మ్రగ్గిన బండిచక్రము వోలెనే-"

తిరుగుచున్న తమబ్రదుకులలోని తత్త్వమును వారిట్లు పాడికొనుచున్నారు.

"పట్టినారము మొన్ననే కొడవండ్లు పంటల కోఁతకున్
నుట్టినారము విత్తుఁగట్టుల ముందువంటకు నేఁడిదే
విత్తుచుందుము కోయుచుందుము క్రొత్తయేమియు లేదిఁకన్
క్రొత్త యెప్పుడు బ్రదుక వలెనను కోర్కెయొక్కటియే యగున్-"

కవులకు ధ్యేయమైనసౌందర్యదేవత భువియుఁదివియు ఒక్కటిగా "తూఁగుటూయెల" లో ఊగుచున్నది. ఆమె అందమునందే పుట్టినది. ఆనందమునందే పెరిగినది. ఆమె స్పర్శ వలన అఖిలసృష్టి అందముగ ఆనందముగ మాఱుచున్నది.

"భావగీత"ములో - "ఇదికాదు.....ఇది కాదు" అను వ్యతిరేకమార్గమున భావకవితా తత్త్వము వివేచింపఁబడి తుదినిట్లు నిరూపింపఁబడినది.

ప్రకృతిదేవి యొక్క నిశ్చలసమాధియో, కనులు మూయని యోగనిద్రయో, అనఁదగు నిశీథ సమయమున నీలగగనాంగణమునందు మినుకు మినుకు మను తారకల నిమీలనోన్మీలనములే తాళగతులుగా హృదయతంత్రులు మీటుచు హృదయగతుఁడగు ఒకానొక గాయకుడు పలికించుచున్నాడు. నీ హృదయమునకు అది వినఁగల నేర్పులున్నచో అది విస్పష్టముగ వినిపించును. అది అప్పుడు పుట్టిన నిసువు నూరుపుకన్న సున్నితము. కాని- అ నిశ్వాస గర్భములో విపులజలధి గభీరఘోషలు వినఁబడును. అది విష్ణు నాభీ విమలకమల మిళింద నిస్వనమువలె సర్వతో ముఖమైన నాదము. అది శ్రవణ హృదయ రసాయనము. ఎవ్వఁడు దానిని విని వినిపింపనేర్చునో అదికవనమగును, అతఁడు కవియగును.

ఈ కవితల యందలి వస్తువైవిధ్యమును మొత్తము మీఁద- ఇట్లు తేర్పరించికొనవచ్చును. నిర్వేదగీతము, సంశయాత్ముఁడు, ఆత్మశక్తి, కాలతత్త్వము, కనకమృగము, మృచ్ఛకటి- ఆత్మపరములు.

ముఘల్ సామ్రాజ్యపతనము, సుప్రభాతములు. అమృతభాండము, త్యాగవైభవము-దేశభక్తి పరములు.

ఆటగీతము, అన్నయు-చెల్లెలు, మాయబొమ్మ చందమామ శుక విలాపము - శిశుగీతములు

అమృతకలశి, దొమ్మరి విద్యలు-సాహిత్యవిమర్శ. కరుణగీతము నా దారితోడు మానవతాపరములు.

"నీ సింహాసన మాక్రమించి యవలన్ నీ యాదలన్ బ్రొద్దటుల్
భాసిల్ వజ్రము కోహినూరొడిచి త్వద్వైధవ్య చిహ్నంబుగా
నీ సామ్రాజ్యముఁజేసి యస్తమితమున్, నిన్నేలుచున్నారనా
యాసప్రాప్త మహామహీతల జయప్రారంభ సంరంభులై
(ముఘల్ సామ్రాజ్యపతనము)

ఇదీ బ్రిటిషువారి రాజనీతి!

సుప్రభాతములు : తూర్పుదేశములైన జపాను, చైనా స్వాతంత్ర్యయుద్ధములకు సంబంధించినవి.

ఈ కవి దృక్పథమిది-
"ఒక యీశ్వరు కృపనందఁ బ
మొక యోడనె యెక్కి దాఁటి యొక సంద్రమునే
యొక తీరమె చేరఁగవలె
నిఁక నీ సంశయము లేల యిచ్చట నీకున్"
(నా దారి తోడు)

నాకు ప్రియమిత్రులు కవిపుత్రులు అయిన శ్రీజనమంచి కామేశ్వరరావుగారి అనురోధమువలన ఈకవి కవితా తత్త్వానుశీలనమునకు ఉపక్రమించితిని. కాని-వేంకటరామయ్యగారు చెప్పినట్లుగానే-

"చేరువయ్యె హృదయమునకు ;
జేరఁ జనన్ గనకమృగము చెలువునఁ బైపైఁ
బాఱెడిదయి-"

ఆ కవితాతత్త్వము నా అనుశీలనమున కందక నన్నలయించుచున్నది.

"ఆ కర్ణాంతము నిండలాగి పృథుల జ్యాఘోషమేపారగా
నాకాశంబును జించి చీల్చుకొని లక్ష్యంబుచ్చి పోనేసినన్
దాఁకంజాలక క్రించి దూనమయి మద్బాణంబు నేలం బడున్
నాకెట్లబ్బునో పూర్ణ లక్ష్యశరసంధాన క్రియానైపుణుల్?"
సహృదయులే ప్రమాణము!



శ్రీ సోమసుందర్

# పరిదేవనా పరిష్వంగంలోంచి బైరాగి తృతీయ పరిణామం

శిశిరంలా ముడుచుకుపోయిన నా గదిలో.... చిగిరించని నా కుర్చీలో.... పులకించని ప్రోడు మోడులవంటి మూసిన పుస్తకాల రాశులలో .. వసంతార్భటిని మేలుకొల్పుతున్న చైత్రద్రుమంలా ప్రవేశించాడు బైరాగి!

వెర్రిగాలి- వంకానుంచి నేలవంకకి, నేలమీంచి వేల పుస్తకాల మూతబడిన గుండెలలోనికీ, యథేచ్ఛగా వచార్లు చేస్తోంది ఆలోచనా తరంగాలు ఉత్తుంగమవుతున్నాయి. సుడిగుండాలు త్రిప్పుతున్నాయి.

నేనురాకముందు నిర్జనారణ్యంలా నిలిచింది నా సరస్వతీ నిలయం....రాత్రంతా ఏకాంత స్వప్న లోకంలో కలవరించింది. ప్రత్యూషపవనాంకురాలతో జాగరించింది నా కార్యాలయం కాంతిని గాలిని ప్రసరింప చేసింది. అప్పుడు వచ్చి ఆశీనమైంది, బైరాగి కవితాహృదయం నా ప్రోల! అజరామర వసంతంలా వచ్చి నా గదినీ మదినీ ఆవేశించింది. అగాధాలను స్పర్శిస్తూ ప్రవేశించింది. అంతరాంతరాలను కదిలిస్తూ సందేశించింది.

అప్పుడొక నవ్వు నవ్వాడు బైరాగి! కొండల వెనుక సూర్యోదయంలా గండపాళికి అరుణిమ లందించింది.

మొన్న మొన్న సంక్రాంతి నాటిరాత్రి ఏక్‌తార మీటుకుంటూ, మంద్ర గంభీరంగా పాడుకుంటూ నా స్వప్న వీథిలో సంచరించాడు బైరాగి! జీవన వైరాశ్యాలు ప్రోగించాడు, "మొన్న గడచిన సంకురాత్రికి - ఎడకు కలహం కాల్చె పల్లెను! .... ఏరునిండెను ఎరుపు నెత్తుట- ఊరు ఊరే పోరిలేకాడై!" ఇంకా ఏమేం పాడుదామను కొన్నాడో- అకస్మాత్తుగా ఆపేసి, అదృశ్యమైపోయాడు! అవతలి సరిహద్దు నుంచి అతని పాట మళ్ళీ ఎప్పటికీ తొంగిచూడదని పించింది.

## నైశయాత్ర

తాజ్‌మహల్ పడగొట్టండోయ్!అంటూ ఉన్మత్త కైశికి నాలపిస్తూంటుందని పించింది-చీకటి నీడల ముడిమి చదునులనే స్పర్శిస్తుందని పించింది. విషాదయోగం నుంచి ఎప్పటికీ తెప్పరిల్లని హృదయార్జునమై అతని కవితా కంఠం నిలచిపోతుందని పించింది. అస్త్రసన్యాసం చేస్తూ తిరోగమిస్తుందని పించింది. అధ్వాన్నధ్వాంతాలపడి నూతిలో గొంతుకలనే నిరంతరాయంగా వినిపిస్తూ వుంటుందని పించింది!

అవునా?! ఇంతలోనే ఇన్ని పరిదేవనా పరిష్వంగాలనూ ఒక్క అదటున విదళించి - ఆశారుణ శిఖరాల నధిరోహిస్తూ తృతీయ పరిణామాన్ని ఆవిష్కరించింది. ఈ నవ్య వసంత నిశాంతంలో నా గదిలో నిలచి బైరాగి దుందుభి పూరిస్తున్నట్లు గొంతెత్తాడు:-

"ప్రాప్తగమ్య విహీనము
వాతానీతాప్త గంధ వైదిక గీతా
జ్ఞాత స్రోతము శీత భ
వాతపమీ నైశయాత్ర వాంఛితమిడుతన్!"

అని మంగళా శాసనం వినిపిస్తున్నాడు. తమోనిశాలోకాల కష్టనిష్ఠుర యాత్రలు గడచి వచ్చిన అలుపు సొలుపు లన్నిటినీ బుద్ధిపూర్వకంగా విస్మరిస్తున్నాడు. హృదయం నిండా ఆశానవోషస్సుషమలను సాంద్రతర మొనర్చుకుంటున్నాడు. పాఠకుడనైన నా హృదయాన్ని అనునయింప పూనుకొన్నాడు! ఎంత ఔదార్యశేముషీ రోచిర్నివహమిది!

"ఉదయ కాంతులతో తళతళలాడే గమ్యం ఎక్కడా కనిపించడం లేదు. గాని మోసుకువస్తున్న పరిమళం మాత్రం సుదూర తీరాల వీణాగాన మాధుర్యాలను జ్ఞాతం చేస్తోంది. మధురానుభూతులను జ్ఞప్తికెలయిస్తోంది. చల్లదనం నుంచి పుట్టిన వెన్నెల వెలుగులతో ఈ నిశాయాత్ర మన కోర్కెలను తీర్చుగాత!...." అదీ కవి కనీస కోరిక.

ఈ కోరికను రమ్యంగా అభివ్యక్తం చేయడానికి వినియుక్తమైన ఈ కంద పద్యం నన్నయ్యగారి కాలమంత పాతదే! ఐతేనేం? అదే కొత్త శిల్ప విన్యాణంతో సంసిద్ధమైంది.

## బైరాగి సంవిధానం

ప్రతిభావంతుడైన ఏ కవీ అభివ్యక్త వస్తువును వేరుగానూ - శిల్పసంవిధానాదులను వేరుగానూ ఎన్నడూ భావించడు. వస్తు శిల్పాలు ఓతప్రోతంగా, అవి భాజ్యభాగ్య రేఖలుగా ప్రతిష్టిస్తాడు. సిద్ధాంతం వేరూ ఆచరణవేరూగా భావించేవారే- వస్తువువేరూ సంవిధానం వేరూ అనుకుంటారు. వస్తువు ప్రాణమైతే సంవిధానం శరీరం; ప్రాణంలేని శరీరం శవమైనట్లే - శరీరంలేని ప్రాణం దయ్యమవుతుంది. సిద్ధుడైన కవి హృదయం నుంచి వెలువడిన ప్రతి కవితా వాక్కూ దానిదైన ప్రత్యేక సంవిధానంతోనే ఉద్భూతమవుతుంది.

నిరంతర అధ్యయనమూ, అభ్యసనమూ, సాధకుని కవితా యాత్రకు ఉపాదేయాలు. తన్ను తాను అనిమిష జాగరూకతతో నిర్మించుకుంటూ పురోగమించినపుడే కవితా సిద్ధి! అప్పుడే రచనలోని మెళకువలు కరతలామలకాలవుతాయి. క్లిష్టగ్రంథులు విడిపోతూంటాయి. సహజోన్మీలనంగా సంవిధానం సంతరింప బడుతుంది. ఆ కృషిలో దర్శనా నైశిత్యమూ పెంపొందుతుంది.

కవి వ్యక్తిత్వం చరమనిర్ణాయక శక్తిగా స్వీయ కవితా తేజస్సును ప్రకాశింప చేస్తుంది. వ్యక్తిత్వం అంటే ఆలోచనా విధానమూ, ధారణారీతీ, జీవిత దృక్పథమూ, వ్యుత్పన్నత, నైజ లక్షణమూ వంటివన్నీ కలసిన సమగ్ర రూపమే. అట్టివ్యక్తిత్వమే (పెర్సనాలిటీ) కవితా వస్తువును ఎన్నుకోవడంలోనూ, దానిని అభివ్యక్తం చేయడంలోనూ విశిష్ట ముద్రను సంధానిస్తుంది. ఐతే ఈ వ్యక్తిత్వం స్థాణువుకాదు; సంచలనశీలమే! నిత్యం పురోభివృద్ధి చెందుతూంటుంది. జ్ఞానార్జన కవితా సాధనాదులు కవి చైతన్యాన్ని సంస్కరిస్తూంటాయి. అందువల్లనే ఏ కవిన్నీ నిన్న తాను రాసినట్లే నేడున్నూ రాసుకుంటూ పోవడం సాధ్యంకాదు. అథవా అలా వ్రాసుకుంటూ పోయేవాడు ప్రతిభావంతుడైన కవిగా గుర్తింప బడడు. నమూనాలననుసరించి వస్తూత్పత్తి చేసుకుంటూ పోవడం యంత్రానికే సాధ్యం.

ఒక కవితకి వేరొక కవితకి ప్రధానవిభేదంగా గుర్తించ కలిగిన లక్షణం సాధారణంగా సంవిధానం పైనే ఆధారపడుతుంది. సంవిధానంలోని భాగమే అభివ్యక్తి. మార్పును సాధించుకోగలిగేదీ, కవిత్వ సంపద విషయంలో వృద్ధి క్షయాలు ద్యోతకం చేసేదీ సంవిధానమే! కనుకనే కవులు సంవిధానం గురించి ఉదాసీనత వహించడం దోషమే!

అంత మాత్రంలో సంవిధానానికి విపరీత ప్రాధాన్యత కలిగించడమూ అంతే దోషం. మేస్సింజర్ అనే కవి, సంవిధానానికి అతి ప్రాధాన్యత నిచ్చేవారిని యిలాగేలిచేసాడు. "బలహీనంగా నిర్మించిన భవనానికి ఎంత గొప్ప రంగులు పూస్తే మాత్రం బలం ఏర్పడుతుంది?" *

సంవిధానంగురించిన విపరీత జాగరూకులు యిలాంటి అభిశంసలకు గురవుతూంటారని బైరాగికి తెలుసు. అందుకే అతను చెప్పదలచుకొన్న విషయాన్ని సాధ్యమైనంత అందంగానూ, అభినవంగానూ, ఆర్ద్రదాయకంగానూ చెప్పి-మన హృదయాలలో చెరగని ముద్రవేస్తాడు. శిల్పవిన్యాణానికి అతి వేల ప్రాముఖ్యమీయడు.

## జీవిత కుసుమానికి చింతాక్రిములు

"ఊహన, వాస్తవం చేసి
వాస్తవాన్ని సుందర స్వప్నం చేసి
మేధకూ క్రియకూ మధ్య
ఆశయానికీ సంశయానికీ మధ్య
సాధనకూ సాధ్యానికీ మధ్య పడిన నీడలు తుడిచి..."

వేస్తాడు బైరాగి. ఈ మహత్కార్యాన్ని సాధించడానికేకవిగా అతని వ్యక్తిత్వం తృతీయ పరిణామం పొందింది. తత్ఫలితంగానే తొలి రోజుల అరాజకత్వపు పితూరీలను పటాపంచలు

* "నో ఫెర్ కలర్స్ కేన్ ఫార్టిఫయి ఎ బిల్డింగ్ ఫెయింట్‌లీ జాయిన్‌డ్" మాసింగర్.

చేసుకుంది. తనకు విశేషప్రఖ్యాతి చేకూర్చిన "నూతిలో గొంతుకలు" నాటి నైరాశ్య తిమిరలోకాలకు తెరవాల్చింది. సామాజిక శ్రేయఃకరధాతువుల సమకూర్చుకుంది. ఆగమ గీతాన్ని ఆయత్త పరచుకొంది.

"కుళ్ళిన సంఘనీతుల చెత్త తోలి-నెత్తుటి చెమట వాకలు పార-సాగుచేసిన బీడు నేడు పండుతున్నది బంగరు పంట!" అంటూ వాగ్గత్త వసుంధరాగాత్రంతో పులకించి పోతాడు. మన తరంలోని క్రాంతికర్షకులింట పండుగ జరుపు కోవడం త్రికరణశుద్ధిగా ఆకాంక్షిస్తాడు. "ఇకపై చింతాక్రిముల బారి పడదు జీవిత కుసుమం!" అనే భరోసా అందిస్తాడు "భావనలో సంశయభయదాకృతులు కలచలేవు!" అనీ నమ్మకమిస్తాడు.

## సహజీవన పావన హర్షం

బైరాగి కవితలలో "వాగ్దాత్త వసుంధర" కావ్యస్థాయి నందుకున్న ఉత్తమ రచన. ఆశావహ సుందర జీవనాహ్వానం ప్రతిపద హృదయంలోనూ సాంద్రంగా నిక్షిప్తంచేశాడు కవి. రేపు బూచి కాదనీ, అనురాగార్ద్రమైన అతిథి అనీ గాఢ విశ్వాసం కలిగిస్తూ సుందర భవిష్యత్తు నాశ్లేషిస్తాడు. అట్టి రేపులో-

"మనిషికీ మనిషికీ మధ్య సంఘర్షం ఉండదింక-
సహజీవన పావన హర్షం తప్ప!
మనిషికీ మనిషికీ మధ్య అమర్షం ఉండదింక-
సహజ సులభ స్నేహాకర్షణ తప్ప!"

అని వజ్ర కంఠంతో గర్జిస్తాడు. మిట్టపల్లా లేకంచేసి మకిలిగుంటలు పూడ్చేసే శాస్త్రీయ సామ్యవాద విప్లవమనే బుల్‌డోజర్ పురోగమనాన్ని కీర్తిస్తాడు. గాలిలాగ, నీరు లాగ నేలకూడా అందరికీ చెందే వ్యవస్థకోసం ఆహ్వానమం దిస్తాడు. సొంత ఆస్తుల కుచ్ఛితాలనూ, బొక్కసాల పీడ కలలనూ, పరిమార్చే వ్యవస్థకోసం-తన తృతీయ పరిణామంలో సిద్ధ సంకల్పుడవుతాడు బైరాగి.

అందమూ ఆనందమూ కొద్ది మందికే హక్కు భుక్తమైన పురాణ వ్యాధిగ్రస్త వ్యవస్థ అంతరించాలనీ, అన్నీ అందరివిగా పరివర్తించే శుభదినం రావాలనీ, అనంత చరమ స్వప్నంతోనే జీవనయాత్రను తుదిమజిలీకి చేర్చాడు. ఆకలీ, చీకటీ అకాల మరణాలు జాతి జీవితం నుంచి శాశ్వతంగా నిష్క్రమించాలన్న అక్షయవాంఛతో అనుశ్వాసించిన కవి, ఆ కవిలో చీకటిలో అకాలమరణంతో చరమశ్వాస విడిచాడు ఇదే దారుణ విషాద సన్నివేశం!

కవి వ్యక్తిని అనారోగ్యం తినివేస్తున్నా హృదయంలో నిండివున్న ఆశావాదం చెక్కుచెదరలేదు. అందుకే-

"ఉదయ సూర్యుని ఉద్యోగాన్ని ఖాయపరిచాం
ఆకాశాన్ని అటకచేసి ఆనందపు నిచ్చెన వేశాం.
సంద్రాలను స్నానాలకొట్లు చేశాం!"

అని ధీమాగా అనుశాశించగలుగుతాడు. ఆకాశం యిప్పుడు అందుకోజాలని భయంకర శూన్యంకాదు. గ్రహచారాదుల బీభత్స సంకీర్ణమూకాదు. స్వర్గనరకాల సంక్లిష్ట భీషణోగ్రమూ కాదు. అది భూమికి అటక వంటిది మాత్రమే! ఆధునిక విజ్ఞానశాస్త్రం సాధించిన వ్యోమనౌకల ద్వారా అది అచుంబిత స్థితిని కోల్పోయింది. ఊహ వాస్తవంగా మారింది. అదే కవి స్పృహ!

## నిశా శ్మశానం

మానవ సమాజం ఇంతవరకూ సాధించిన సకలవ్యవస్థా స్వరూపాలలోనూ మానవవానుబంధాలు కేవల ధనపాశ బంధాలుగానే కలుషితమై పోయాయి. అందుకే వివేకానందుని వంటి మహనీయ తత్త్వవేత్త సైతం-"మానవ జాతి సర్వ వ్యవస్థలనూ ప్రయోగించి విఫలమైంది. సామ

వాద వ్యవస్థలోనైనా చిరంతన శాంతి లభిస్తుందేమో ప్రయోగించి చూడడంలో తప్పులేదు." అని ఉద్ఘాటించాడు.

బైరాగి కవిగా ఎంత కళాత్మక స్రష్టో, అంతగాఢ ప్రతిభుడైన ద్రష్ట -అందుకే "మనిషి మనసులో మమతా సస్యానికి పట్టదులే చీడ!" అంటూ భవిష్యత్తు గురించి ధైర్యంగా ప్రకటిస్తాడు. స్త్రీ శీలాన్నీ, పురుషుని పరువునీ, పసిపాపల ప్రాణాలనూ అమ్మే అంగుడులన్నీ రేపు మూసి వేయబడతాయని నమ్మకం కలిగిస్తాడు. పైగా, "భీషణ శోషణ యంత్రపు పండ్ల చక్రాల ముండ్లకంచెలు.... అంకెల గారడీలతో పేదవాని కడుపు కొట్టే లంకాసురుల రహస్య సొరంగాలూ, మాయా సింహాసనాలూ" వగైరా కాపట్యాల నన్నిటినీ కూల ద్రోస్తుంది భవిష్యత్తు! ఆ వసుంధరా వాగ్దానాన్ని కవితా కంఠస్ఫూర్తితో వినిపిస్తాడు బైరాగి.

ప్రస్తుతం పూంజీకృతమై వున్న బూర్జువా వ్యవస్థ "దౌర్భాగ్య నాగరికతల నిశాశ్మశానం" లా తయారైంది. దానినిండా తోడేళ్ళూ గుంట నక్కలూను! రాజ వీధుల గగన మార్గాలలో నిస్సంకోచంగా ఎగిరే రాబందులు. ఈ జీవన బీభత్సం తప్పక అంతరిస్తుంది. ధనాశా వ్యవస్థ సామ్రాజ్యవాదుల్నీ, యుద్ధోన్మాదుల్నీ, అమానుషనేరస్థుల్నీ పరిపోషిస్తుంది. మానవుని ఆయుర్దాయంపై పగబట్టేవిషాయుధాల అధికోత్పత్తిపై ఆధారపడుతుంది. జీవితంపై మరణాన్ని ని గా నిలుపుతోంది. అలా విపరీతంగాగుట్టలువడ్డ ఆయుధాలన్నీ "కరుగబోసి పలుగులుగా పారలుగా రూపొందిస్తుంది భవిష్యత్తు. సృజనాత్మక కృషికి సహకరిస్తుంది." టేంకులు ట్రాక్టర్లుగా రూపుమార్చుకుంటాయి. విజ్ఞానానికీ జ్ఞానానికీ స్వార్థపరులు కల్పించిన చెర విరగడవుతుంది.

## ఒకే గానం, ఒకే ధ్యానం

మానవుల చిరవాంఛితాన్ని కవిగా బైరాగి తన చరమ స్వప్నంగా మార్చుకున్నాడా అనిపిస్తుంది. స్వీయ స్వప్నాన్నే "హృద్గత వసుంధర"గా పరివర్తింప చేశాడు. ఐతే ఈ స్వప్నం కేవలం ఊహపై, ఉత్త ఆశపై ఆధారపడ్డదికాదు. సామాజిక పరివర్తనాన్ని శాస్త్రీయంగా సాధించ గలిగినదే. అందుకే అతనంటాడు:

"మనజాతి ఒకే ప్రాణం, ఒకే గానం, ఒకే ధ్యానం,
మానవులంతా సమానం!"

అదే అతని స్వాప్నిక ప్రసవంలో ప్రధాన పరిమళం!
న్యాయం తూచే తరాజు తప్ప వేరే రాజు లేడు
యథాశక్తి శ్రమ చేస్తాం యథాభుక్తి అనుభవిస్తాం
పృథాకాదు చేసిన శ్రమ ...చెలిమిలోనే జనులకలిమి!

అంటూ తన స్వప్నహృదయాన్ని విప్పుతాడు. కవిత్వమంటే ఏమిటి? పూర్ణ జాగృతిలో స్వప్నించడం తప్ప! బైరాగి స్వయంగా యిలా చెప్పుకున్నాడు: "స్వయంగా ఏకృతైనా దానికదే భాష్యం. కావ్యం తనంతట తాను వెలువరచలేని అర్థాన్ని ఏ భాష్య కారుడూ వెలువర్చలేడు. కావ్యం స్వతస్సిద్ధం. దానికి భాష్య కారుని చేయూత అనవసరం. పోతే భాష్యకారుడు అపరిణత బుద్ధులైన పాఠకులకు సహాయకారి కావచ్చు. సాధారణార్థాలను బోధించవచ్చు." అంటూ తననూతిలోగొంతుకలుకు తొలిపలుకు రాసుకున్నాడు. ఆ కావ్యమే సంశయకావ్యం. దాని తొలి పలుకులోనూ సంశయం లేకపోలేదు.

తనంత తానుగా కావ్యం అంతస్సారాన్ని అభివ్యక్తం చేయలేక పోతే నిజంగా వ్యర్థ ప్రయత్నమే. ఐతే కావ్యగత మస్పృణార్థాలు సహృదయ భాష్యాకారునకు అందినంత సమగ్రంగా అపరిణత పాఠకులందరికీ అందక పోవడమూ సత్యమే. పాఠకుల భావుక కౌశలాన్ని పెంపొందింపచేసి, హార్దిక సునిశితత్వాన్ని మేల్కొల్పగల వ్యాఖ్యాతే ఉత్తమ విమర్శకుడు. అలాంటి ఉత్తమ విమర్శకుడి కోసం ప్రతి ఉత్తమ కావ్యమూ నిరీక్షిస్తుంది.

కవితా వ్యాఖ్యానం కవిత్వంలాగే కళాసంపన్నంగా ఉండాలా? అనే అధిక్షేపం ఇటీవల కొందరు అధికార విమర్శకుల నోళ్ళనుంచి బిగ్గరగా వెలువడుతోంది. నువ్వుచెప్పే దెంత సత్యమైనా, పాఠకుడ్ని రోగిగా భావించి పథ్యంలాగా అందిస్తావో తప్పక వికటిస్తుంది. సగ్గుజావను పరమాన్నంగా మారిస్తే తప్ప రోగిసైతం దరికి చేరనివ్వడు. నువ్వందించే దేదైనా మాధుర్య గుణంతో సాధ్యం కాకపోతే ఖాద్యం కాబోదు. ఆ తర్వాత నీకు తప్ప ఎవరికీ కొరగాదు! అని అలాంటి అధికార విమర్శకులకు గట్టిగానే చెప్పక తప్పదు.

ఆస్వాదయోగ్యం కానిది ఎంత సత్యమైనా పైత్యం గానే పరిగణింప బడుతుంది. ఆ సత్యం తెలిసినవారు కనకనే మార్క్స్,ఏంగెల్సు మహాశయులు కమ్యూనిస్టు మేనిఫెస్టోను సైతం అంత కళామయంగా రసావేశ సంసిద్ధం చేశారు. దబాయింపుల డమరుకనాదాలు విడిచి, ఇప్పటికైనా ఈ యథార్థం గుర్తించడం మంచిది.

## కాంచన యుగం ఉదయిస్తోంది

"బానిసల నెత్తుట దోగి విరియ బూసిన విభుత ఉండదు
మునులు మోసే ఆసనమెక్కి శాసించదు బలిసిన బ్రహ్మ
మదం
బక్కచిక్కిన డొక్కలను వెక్కిరించదు బకాసురుని బొర్ర
మదం
సైరంధ్రి జోలికిరాడు పీచమడగిన కీచకుడు.
చారిత్రక రాత్రిలోన కలలుగన్న కాంచనయుగం ఉద
యిస్తోంది!"

రానున్న యుగం కాంచన యుగంగా ఎందువల్ల పేర్కొన బడుతోంది? మునులపై స్వారీచేసే రాక్షసులుండరు గనక! సాధు జనులకు పరిత్రాణ మందించే వ్యవస్థ ఆగమిస్తుంది కనక! బకాసురులూ కీచకులూ నశిస్తారు కనక! చిరదినాల ఇరుల పొరల నిరాశలకు మరణ శాసనం లిఖించ బడుతుంది కనక! నరుడు కోరుకొన్న విడమరకు చేరుకోగలడు కనక! ద్రష్టలు, యుగస్రష్టలు సూచించినమేరకు ఆగామిలో వాగ్దత్త వసుంధర దర్శనమిస్తుంది కనక!

బైరాగి స్వయంగా ద్రష్టయై, వాగ్దత్త వసుంధరా స్వరూపాన్ని మనకనుల ముందు నిలుపుతున్నాడు, సర్వ సమగ్రంగా....సహృదయ హృదయ నివేదనంగా!....

## బైరాగికి మరణం లేదు

ఉజ్జ్వల కవి బైరాగి. కవిత్వం కోసం జన్మించినవాడు; కవిత్వంలోనే జీవించాడు. కవితా దాహంతోనే మరణించాడు. కవితానంద రోచిస్సులతో-రసహృదయ తమిస్రలను దూరీకరించాడు. అందుకే అతని పెదవులపై కవితల ఉదయకాంతులు. నిండు మనస్సుతో....నవనీత మంజుల భావ వీచికలతో.... దారుణాఖండల వాగ్ధారతో....తానే ఒక వాగ్దత్త వసుంధరగా మారిపోయినవాడు ...నితాంతశ్యామల మూర్తిగా నవ నవలాడినవాడు....కదిపితే చాలు పరిమళాలు కురిసే పూచిన కదంబంలా జీవించాడు!

అందుకే మళ్ళీ చెబుతున్నాను, బైరాగికి మరణం లేదు. అతని కవితా హృదయం అక్షరామ్నాయం! అది నిదుర ఎరుగని జలపాతం! సెలవడిగి వెళిపోదామనుకున్నా వీడలేని అమృత మందస్మితం....

అతని కన్నుల వెనుక బాష్పజలధుల నీరవఘోషలు! విషాదమయ దరస్మేరాల ఆదరపూర్వక ఆహ్వానాలు....జగన్మంగళనీరాజనాలు! అందుకే చెబుతున్నాను, బైరాగికి మరణం రాదు. అతని కవితాగానం ఆగిపోదు. అతని విశాలహృదయం-భాగీరథీ గోదావరీ కావేరీ నదుల సంగమ స్థానం. అతని విరాగహృదయం నదీమాతృకల సమార్ద్ర పులినకేదారం!

అతడుత్త తెలుగు కవి! అకదుత్తాల భారత కవి తెందురేఖ! అతని తీవ్రోజ్జ్వల హృదయం తంద్రాలస బాడబాగ్ని! .... జాగృత స్వప్నదావాగ్ని...! అతని కవిత్వం జాతి జీవితంలో సంలీనమయ్యే కాంతికళిక.... జాతిని మేలుకొలిపే క్రాంతిరేఖ!....

అవును, బైరాగి కెన్నడూ మరణం లేదు.



# చైతన్య ధార

## డా॥ పోచిరాజు శేషగిరిరావు

భావుకుని ప్రజ్ఞవలె ప్రభా భాసురమ్ము
ఋషి ఉపజ్ఞయుంబోలె అతీంద్రియమ్ము
మౌనిమనసునుబోలె నిర్మల తరమ్ము
హృద్విపంచికా నిక్వాణ మెసక మెసంగె ౧

సన్నిహితమైన ఆనందఝరియ్యుంబోలె
పరిమళోదరమైన పుష్పమ్మువోలె
తేటగాపాఱు సెలయేటి నీటివోలె
చతుర యామిని కామన సాగివచ్చె ౨

వేదనాదమ్ము మదిలోన విస్తరిల్లి
అమృత వర్షిణియయ్యె సంభ్రమ మెలర్ప:
మెరపు మెరసెను లోలోన - విరిసె జ్ఞాన
తోరణమ్ములు - భావదుందుభులు మొరసె ౩

అది స్వరమేళ-దాని గమకాంచిత నాదములెల్ల హృద్యమై
ఎద ద్రవియింపంజేయ, శ్రవణేంద్రియతర్పణమై
యొసంగు, నిం
పొదవగ మానసాన యనుభూతిసుఖ మ్మొదవించు,
రాగ సం
పదలిటు మూసపోసినటు భావము,
ముగ్ధమనోహరమ్ముగన్ ౪

ఎండలో నుండి నీడకు నేగినట్లు
చీకటుల ద్రోసి, వెలుతురుల్ చిమ్మినట్లు
ఎటుకలోనుండి ప్రజ్ఞ భాసించినట్లు
ఒక అలౌకికసంస్పర్శ నన్నూంది నిల్పె. ౫

అంత హృదయమెల్ల ఆనందరసభాండ
మయ్యె - మెరసె నొక్క హర్షరేఖ -
దూరతీరములను దోబూచు లాడిన
అమృత కలశ మందినట్ల యయ్యె. ౬

దివ్య గీతికాలాపన తెరలి రాగ
సాగరమ్మంత ఆకాంక్ష వీగిపోవు:
దివ్యశిఖరాలపై నుండి దిగిన ప్రజ్ఞ
ప్రకృతి కాధారమైన దైవతమహస్సు: ౭

జాగృతమ్మైన కాలమ్ము, శక్తి భరిత
మని యెఱింగినవాఁడు, సత్యమ్ముకొఱకు
సలుపు యత్నమే "యోగమై" నిలుచు జగతి
ఈశ్వరీయ సౌందర్య మిట్లెసగు గాదె: ౮

అంత రవలోకనమునకై అహరహమ్ము
యత్న మొనరించుటే జన్మకర్మమయిన,
ఒక వివేక దీపిక వెల్గి, చకిత జగతి
జాగృత మొనర్చు శుభవేళ యేగుదెంచు. ౯

చారు సుస్మిత ధవళ కాసారమట్లు
యోగి హృదయమ్ము కనుపట్టు నుజ్జ్వలించి,
తత్ పరీమళలహరి తత్త్వమును విప్పు
విశ్వ వేదన మలగించు వెలుగురవ్వ ౧౦

భువన శిల్పమ్ములోని యద్భుతము సృష్టి
విశ్వభావ వీచికలకు వెలుగు పుష్టి:
విశ్వ సంగీతశ్రుతికి నవీనదృష్టి
పూర్ణ సౌందర్య మాధుర్యములకు వృష్టి: ౧౧

ఒక అశరీరవాణిచే నుల్ల మలరి
మనసు రసమయ మందిరమై తనర్చు:
మధుర మధుర సంస్పందనల్ మలసియాడి
హృదయ వీణనుమీటి విన్పించు గీతి. ౧౨



# కేఎస్వీ

# ఎన్నిక

పూర్ణాయ్‌తో కాస్త పనుండి వెళ్ళాను, ఆ ఊరు.

(ఆంధ్ర దేశంలో ఒక ఊరు. పేరు- ఏదైతేనేం ?)

చీకటిపడే వేళ బస్సు దిగాను. రిక్షాను పిలవబోతూ, కాస్త సందేహించాను.

సంవత్సరం క్రితం ఇలాగే బస్సు దిగి, పూర్ణాయ్ ఇంటికి రిక్షాలో వెళ్ళి, కిరాయి విషయమై రిక్షావాడితో గొడవ పడాల్సివచ్చిన సంఘటన గుర్తొచ్చింది.

అప్పుడైనా - రిక్షావాడిదీ పూర్తిగా తప్పు కాదు.

బస్‌స్టాండు - ఊరికి ఒక చివరుంటే - పూర్ణాయ్ ఇల్లు మరో చివరన ఉంది. ట్రంక్ రోడ్‌మీద దాదాపు మైలు దూరం వెళ్ళాలి. అక్కడ ఎడంవేపు మలుపు తిరిగితే కంకర రోడ్డు వస్తుంది. అది తిన్నగా వెళ్ళదు. ఘోరమైన ఎగుడు దిగుళ్ళతో ఆ రోడ్డమ్మట అరమైలు వెళ్తే 'లేబర్ కాలనీ' వస్తుంది. ట్రంక్‌రోడ్‌కీ లేబర్ కాలనీకీ మధ్య వైకుంఠ నగర్ అని ఒక కాలనీ ఉంది. 'అల వైకుంఠ పురంబులో నగరిలో' అన్న ముక్క సార్థకమయేట్టు — అదిగో - ఆ వైకుంఠ నగర్‌లో - మావాకి ఇల్లు !

ట్రంక్‌రోడ్డు ఆ మైలు పొడవూ కాస్త ఎక్కువే! ఇక ఆ కంకరరోడ్డుమీద రిక్షాతొక్కటమంటే వళ్ళుమాలిన ప్రయాసే ! మరీ - పొద్దుపోయాక అయితే- ఇక అక్కణ్ణుంచి వచ్చేకిరాయిలు' కూడా ఏమీ తగలవు. అందుచేత - రిక్షావాళ్ళతో పేచీ వస్తుందంటే ఆశ్చర్యం లేదు !

పిలవకున్నా ఎదుటికొచ్చి నిలుచున్నాడు ఒక రిక్షావాడు. "ఎక్కండి సార్ !" అన్నాడు, ఎక్కడికైనా సరేనన్నట్టు, బాడుగ ఎంతైనా సరే న్నట్టు.

"వైకుంఠనగర్ !" అన్నాను. ఆ రెండు ముక్కల్లోనూ చాతనైనంత మెత్తటి బెదిరింపును ధ్వనింపజేస్తూ.

"అంటే-లేబర్ కాలనీ దగ్గరా సార్ ?—"

"అవును - అక్కడే —"

"ఎక్కండి —"

"ఏమివ్వను ? —"

"మీకు తెలవన్దేముంది సార్....అంతా మిట్ట - రాత్రిపూట - వొచ్చేప్పుడు ఖాళీగా రావాలి....రెండ్రూపాయలిప్పించండి—"

ఆశ్చర్యపోయాను. క్రితంసారి రిక్షావాడు నాలుగు అడిగినట్టు గుర్తు. మూడు అంటే వాడు మూడున్నర అని - చచ్చినా౦ ఇవ్వనంటే వాడు సరేనని ఎక్కించుకుని - తీరా ఇల్లు చేరాక - మూడున్నర ఇవ్వాల్సిందేనని వాడు పట్టుబట్టటం ....

"ఎక్కండ్సార్ వెళ్ళిపోదాం — వైకుంఠనగరేనా- ఇంకా పైకిపోవాలా ?—"

వైకుంఠానికి వెళ్ళినవాడు ఇంకేం పైకిపోతాడు — అని స్వగతంలో జోకేసుకున్నాను, వీడు పొరపాటుగా వినలేదు. రెండు రూపాయలకే ఒప్పుకోవటం చాలా అదృష్టం, అనుకుంటూ ఎక్కి కూచున్నాను - "అక్కడికే-ఇంకేం పైకి పోనక్కర్లేదు -" అంటూ.

ఊరంతా దాటి, మళ్ళీ ట్రంకురోడ్డెక్కి, ట్రంకురోడ్డుమీద మైలుదూరమూ వెళ్ళి, ఎడమవేపు మలుపుతిరిగి - రిక్షా లేబర్ కాలనీ రోడ్డుమీద వెళ్తుండగా — అప్పుడనిపించింది — ఈ ప్రయాణంలో ఏదో మార్పుందని.

చప్పున తెలిసింది. కుదుపులు లేవు. రిక్షా గుంతల్లో పడటం లేదు. రిక్షావైను కటకటమస్తూ కష్టపడటం లేదు. ఆశ్చర్యం ! దారి పొడవునా ట్యూబ్‌లైట్లు వెలుగుతున్నాయి ! ఆ పాల వెలుతురులో మెరుస్తోంది - నున్నటి నల్లటి తారురోడ్డు !!

"అరె-తార్రోడ్డు ! -" అనేశాను పైకే.

"అవున్సార్-కొత్తగా వేశారు-" అన్నాడు రిక్షావాడు.

'ఓహ్హో' అనుకున్నాను. బస్‌స్టాండునుంచి వైకుంఠనగర్‌కి రిక్షావాడు కేవలం రెండు రూపాయలే అడగటం ఎందుకో ఇప్పుడర్థమైంది.

"అదేనయ్యా చూస్తున్నాను....పోయిన్సంవత్సరంవొచ్చాగా అప్పుడు లేదు తార్రోడ్డు —"

"లేదు సార్-ఈమధ్యన్నే — అంతా- నెలయ్యుంటుంది ఈ రోడ్డువేసి-లేబర్ కాలనీ దాకా వేశారు సార్ -" అన్నాడు. బండిని వైకుంఠనగర్ వేపు మలుపు తిప్పుతూ.

మళ్ళీ-వైకుంఠనగర్ రోడ్డుకి తారులేదు. అయినా మును పటంత అధ్వాన్నంగా లేదు. పట్టీ కంకరాపోసి చదును చేసినట్టు - కొంచెం మంచి స్థితిలోనే ఉంది.

రెండ్రూపాయలు పుచ్చుకుని చక్కా వెళ్లాడు రిక్షావాడు. మా పూర్ణాయ్ లక్షణంగా ఇంట్లోనే దొరికాడు.

మనిషిని చూడగానే కావలించుకోటమూ, కుశల ప్రశ్నల్తో చంపకుండా కులాసాగా జోకు లెయ్యటమూ, వొచ్చిన పనే(విటని అడక్కుండా అతిథ్యపు ఏర్పాట్లు చెయ్యటమూ - ఇవి పూర్ణాయ్ వ్యక్తిత్వంలో ప్రత్యేక లక్షణాలు ;

భోజనాలు ముగిశాక, డాబామీద ఏర్పాటయిన పడకలు చేరుకున్నాం.

ఊరికి దూరమనే మాట నిజమేగాని, పూర్ణాయ్ ఉంటున్న ప్రాంతం చాలా ప్రశాంతంగా ఉంటుంది. దూరాన కొండను అందుకోటానికి వంగిన ఆకాశం, దేవతల సౌందర్య భిక్షలాగా నక్షత్రాలు, లేటుగా ఉదయిస్తున్న బహుళ పంచమి చంద్రుడి లేత ఎరుపు వెలుగులూ ...అంతా ఎంతో రమ్యంగా ఉంది.

ట్రంకురోడ్డుమీద అప్పుడప్పుడూ వెళ్ళే వాహనాల హెడ్ లైట్లు కనిపిస్తున్నాయి.

(లేబర్ కాలనీ తారురోడ్డు — తెల్లటి ట్యూబ్‌లైట్ల కాంతి పడినచోటల్లా - నల్లగామెరుస్తోంది.)

"చాలా బాగుందోయ్ -" అన్నాను నేను, సౌందర్యారాధన నుంచి కాస్త తేరుకుని.

"మరే"- అన్నట్ట చూసి, నవ్వుతూ సిగరెట్టు వెలిగించాడు పూర్ణాయ్. "ఏం బావుందోయ్ ;-" అన్నాడు అంతలోనే. మాట వరసకి అన్నమాటకంచైనా మాటపెంచటం మావాడి దుర్లక్షణాల్లో నాకు నచ్చిన గుణం ;

"ఈ పరిసరాలూ....ఈ వాతావరణమూ-చాలా బాగున్నాయి. కొత్తగా వేసిన ఆ తార్రోడ్డుందే — చాలా నీటుగా ఉంది. వీధిదీపాలు కూడా వెలుగుతూండటం - చాలా బాగుంది. అందం మాటేకాదోయ్ - నా ఉద్దేశం - చాలా సౌకర్యంగాకూడా ఉందని-"

"రోడ్డు కొత్తగా వేసిందని - నీ కెలా తెలుసు ?—"

"సంవత్సరమైందనుకో నేను ఇటు వచ్చి .... అప్పుడు లేదిది ... వేసి నెలయిందని — ఇందాకా నేనొచ్చిన రిక్షావాడు చెప్పాళ్ళే...."

"ఈ రోడ్డుకో కథుంది -" అన్నాడు పూర్ణాయ్. అన్నవాడు ఊరుకోక నా చెవులవేపు సాభిప్రాయంగా మార్చిమార్చి చూశాడు.

నేను వాడి డొక్కలో చూపుడు వేలితో పొడిచాను. "జోకులు మానవోయ్ - కథలంటే నేను చెవికోసుకునే మాట నిజమేగాని - తెలిసిన కథ చెప్పకుంటే నువ్వు నాలిక్కోసుకునే మాట అంతకన్న నిజం .... కానివ్వు మరి -" అన్నాను.

"చెప్తా - చెప్తా -" అంటూ, మూడ్ కోసమున్నట్టు సిగిరెట్టు నుంచి ఒక 'దీర్ఘ దమ్ము' లాగి, మొదలెట్టాడు పూర్ణాయ్ ....

* * *

కథా, కమామీషూ అంటారు చూశావా ? నువ్వు చూస్తున్న ఆ రోడ్డు - ఒక కమామీషు మాత్రమే ; అసలు కథ వేరే ఉంది. ఆ కథేమిటో తెలుసా ? ఎలెక్షన్లు ; మొన్నటికి మొన్న జరిగాయే- మునిసిపల్ ఎలెక్షన్లు .... అవ్వీ ....

లెక్కకి ఈ వార్డు ఇరవై రెండో వార్డు. ఊరు చివరగా ఉన్నప్పటికీ - చాలా ముఖ్యమైన వార్డు. రాజకీయంగా చూస్తే ఈ వార్డు చాలా కష్టమైన వార్డు ; ఎలాగంటావా ? చూడు - ఆ ట్రంకు రోడ్డు మీదను చి ఇటు తిన్నగా ఎడం వేపంతా ఇరవై రెండోవార్డే ; ఎంతవరకూ ? ఈ వైకుంఠనగర్‌తో ఆగలేదు — ఈ దిగువ నున్న నంది కాలనీ, ఆ ప్రక్కనున్న గుడిసెల సేవాసంఘం, ఆ పైన మిట్ట మీద కొత్త ఇళ్ళు, ఇందాకా ఊళ్ళోంచి ట్రంకురోడ్డు మీదికి నువ్వు మలుపు తిరిగావే - ఆ మలుపునుంచి సరాసరి లేబర్ కాలనీకి ఐమూలగా ఉన్న ఇళ్ళన్నీ, అన్నిటికన్నా ముఖ్యం — ఈ లేబర్ కాలనీ .... కలిసి మొరశి ఇరవై రెండో వార్డు ; చాలా పెద్ద వార్డే నన్నమాట ....

దేశమంతా ఒక న్యూసు పాకింది - నువ్వు విన్నావో లేదోగాని, ఈసారి మునిసిపాలిటీ ఎలెక్షన్లు కొత్త పద్ధతిలో జరుగుతాయని.

అమెరికా ప్రెశిడెంటు ఎన్నికలాగా - మునిసిపల్ ఛెయిర్ మెన్ని పురప్రజలంతా డైరెక్టుగా ఎన్నుకుంటారని....

ఈ పద్ధతి చాలా మంచిదన్నారు కొందరు. ఏం బావుండదు- అన్నారు మరి కొందరు. అసలీ డైరెక్టు ఛెయిర్మను ఎన్నిక ప్రపో జలుండే - ఇదో పెద్ద కుట్రకి చిన్న శాంపిలన్నారు. మునిసి పాలిటీతో మొదలు పెట్టి, జిల్లా పరిషత్తు ఛెయిర్మను, తర్వాత రాష్ట్ర ముఖ్యమంత్రి, ఆఖరుగా దేశప్రధాని ఎన్నికకూడా - అంతా డైరెక్టు పద్ధతే అయిపోతుందని....దానివల్ల మన ప్రజాస్వామ్యానికి చాలా నష్టాలున్నాయనీ ....

సరేలే — అదంతా ఒక పెద్ద డిబేటు.

మన రోడ్డు కథకి - డైరెక్టు ఎలక్షను గురించిన న్యూసుతో డైరెక్టుగా అయితే సంబంధం లేదు. కాని, ఈసారి ఎన్నికలలో ఏయే శక్తులు పనిచేశాయో తెలియటం ముఖ్యం కదా - అందుకని చెప్పాను ....

న్యూసు న్యూసుగానే వెనక్కి వెళ్ళిపోయింది. ఈ సారికి మామూలు పాతపద్ధతి ఇండైరెక్టు ఎన్నికే ఉంటుందన్నారు.

అసలికే ప్రచారం మొదలు పెట్టేసిన - అధికారంలో ఉన్న ఛెయిర్మనూ; అతగాణ్ణి పడగొట్టాలని మూడు ఎన్నికలనుంచీ విఫల కృషి చేస్తూ వొచ్చిన బలమైన ఒక ప్రత్యర్థీ కూడా—

ప్రచారం పద్ధతి మార్చుకున్నారు.

ఏ వార్డులో ఎవర్ని తమ కాండిడేట్లుగా పెట్టాలా అని లజుగుజలు మొదలు పెట్టారు.

(కథ వినాలనుకుంటావుగాని, నా ధోరణి నీ క్కాస్త విసుగని తెలుసు. సంగతి మొదలెడితే సాధ్యమైనన్ని వివరాల్చెప్పటంనా వీక్నెసు — నీకు తెలుసుగా —)

ఈ సారి ఎన్నికల్లో ఒక ప్రత్యేకమైన లక్షణం కనబడింది. అదేంటో తెలుసా ! డబ్బు ....

నువ్వేం నవ్వక్కర్లేదు. నాదేం పెద్ద డిస్కవరీ కాదు గాని - సందర్భం - విను —

ఇండియాలో ఎలెక్షనంటే - కులమూ, డబ్బూ - అని నాదో చిరకాలపు థీసిస్సుంది.

అసలు బ్రిటిషు వాళ్ళు ఈ పవిత్ర దేశాన్ని కైవసం చేసు కోవటానికి ఉపయోగించిన ముఖ్యమైన ఎత్తుగడల్లో - మన కుల వ్యవస్థను వాళ్ళ ప్రయోజనాలకి వాడుకోవట మొకటి.

ఇప్పటికీ — మన రాజకీయ పార్టీల అగ్రనాయకులు — ఎమ్మెల్లే — ఎంపీ సీట్లకి టిక్కెట్లిచ్చేప్పుడూ — ముందుగా ఏం చూస్తారనుకున్నావు ? ఆ కాండిడేటు కులం ! మరియూ - ఆ కులానికి ఆ నియోజకవర్గంలో ఏమాత్రం పలుకుబడి ఉందీ అని —

ముందు కులం, తర్వాత డబ్బూ - మునిసిపల్ ఎన్నికల మేరకైనా - ఈ సూత్రం ముమ్మాటికీ నిజం - అనేవారు రాజకీయ నిపుణులు.

చెప్పొచ్చిం దేవిటంటే — ఈసారి ఎన్నికల్లో డబ్బు — కులాన్ని త్రోసి కౌన్సిలరంది !—(త్రోసి రాజంది - పాత ఇడియం— ఏమంటావ్ ?)

అలాగని కులంచూసి ఎవ్వరూ ఓట్లే వెయ్యలేదనీ కాదు....

నీ చిరచిర నాకర్థం — కాదుటోయ్ ? — వొస్తున్నా ....

మా ఇరవై రెండో వార్డు కౌన్సిలర్ పదవికి — మొత్తం పంథొమ్మిదిమంది అభ్యర్థులు పోటీ చేశారు. ఈ పూర్తిసంఖ్య — ఎన్నికలు దగ్గరపడిన నాలుగు రోజులదాకా ఎవరికీ అట్టే తెలియ దనుకో ....

పంథొమ్మిది మందిలో పదిహేను మందిదాకా — లోకల్ కాండిడేట్లు. అనగా - ఇరవై రెండో వార్డులోనే నివసిస్తున్నవారు. మిగత నలుగురూ నాన్‌లోకల్.... ఊళ్ళో ఇంకెక్కడో ఉంటున్న వాళ్ళు.

ఏ వార్డు వాళ్ళు ఏ వార్డులోనైనా నిలబడవచ్చు — మనది స్వేచ్ఛాయుత సమగ్ర ప్రజాస్వామ్యం కదా !....

ప్రపంచ ప్రజాస్వామ్య దేశాలన్నిటిలోనూ మనదేశం విలక్షణమైనది ! ఒక్క రాజకీయ రంగంలోనే కాదు — అన్ని రంగాల్లోనూ....

అందునా — ఈ యుగధర్మం ఉందే - బహువిచిత్రమైనదీ-

అంతర్జాతీయ ం గా ఇదే యుగం ?— "అంతర్‌గ్రహ" యుగం. అవునా ?

ఇండియాకు మాత్రం ఇది "కొడుకుల యుగం" నవ్వకు. చాలా సీరియస్‌గానే చెప్తున్నాను.

రాజకీయ నాయకుల్ని తీసుకో, వ్యాపారవేత్తల్ని తీసుకో, సినిమా స్టార్లని తీసుకో, కవులూ కళాకారుల్నీ తీసుకో —

తమ అధికారం, తమ డబ్బు, తమ గ్లామర్, తమకీర్తి -

అన్నిటికీ తమ సుపుత్రుల్ని వారసులుగా నిలబెట్టాలని - అబ్బో - ఎంత తాపత్రయ మంటావు!

వెళ్ళిపోయే తరం, స్వంత మనుషుల్ని - వొచ్చే తరానికి ప్రతినిధులుగా పెడుతున్నారు - యుగధర్మం - 'మనఖర్మత' అంటాడొక మిత్రుడు - ఏదైతేనేం?

ఈ యుగధర్మం ప్రభావం - ఆంధ్రా అంతా జరిగిన ఎన్నికలమీద ఎలా ఉందో తెలియదుగాని — మా మునిసిపాలిటీ ఎన్నికలమీద బాగా పడింది. కళ్ళజూసినంతవరకూ మా వార్డు ఎన్నికల్లో స్పష్టంగా కనిపించింది.

నందీ కాలనీలో ఓ పెద్ద కంట్రాక్టరున్నాడు. ఆయన కొడుకు సైకిలు గుర్తుతో నిలబడ్డాడు. మా వైకుంఠనగర్ నుంచి మరో కంట్రాక్టర్ కొడుకు - కుర్చీ గుర్తుతో నిలబడ్డాడు. అటు ఎగువనున్న హోటలు ప్రొప్రయిటర్ అల్లుడు (ఆయనకు కొడుకుల్లేరు!) టంబ్లర్ గుర్తుతో పోటీ చేశాడు. మరో లక్షాధికారి చిన్నకొడుకు కారు గుర్తుతో తలపడ్డాడు.

లిస్టింకా చాలా పెద్దదే ఉందిగాని, మొత్తానికి ధోరణి ఏమిటో తెలిసిందనుకుంటా, 'నిలబడ్డారు' అంటే — సదరు కుర్ర కాండేట్లని - వాళ్ళ పెద్దలు వెనకుండి - నిలబెట్టారు.

ఎన్నికల్లో నెగ్గితేగిగ్గితే - స్థానిక రాజకీయాల్లోనే అగుగాక బాగా నిలబడి ఇంకా పైకి ఎగబ్రాక వచ్చనుకున్నారు కుర్ర అభ్యర్థులు, మొన్న మొన్నటి దాకా కాలేజీ ఎగ్గొట్టి మందు పార్టీలు చేసుకుంటూనో, కోకలవెంటా సోకులవెంటా తిరుగుతూ యావజ్ఞక్తినీ సార్థకపరచుకుంటూనో — ఉండిన 'వెల్లుడూ' శ్రీమంతుల వారసులే వీళ్ళంతా. ఒక్కసారిగా ఎన్నికలలో 'నిలబెట్టబడేసరి'- చేతులు జోడించి నమస్కారాలు చెయ్యటాలూ, వినయంగా గంభీరంగా నవ్వటా లూ.... ప్రజాస్వామ్యంవల్ల పక్కాజులాయీలు కూడా ఎంత మర్యాదస్థులుగా మారిపోతారో ....

కుర్చీ పొజిషన్ గట్టిదన్నారు. కారు ప్రచారం జోరుగా ఉందన్నారు. ఈసారి ఛాన్సు గ్లాసే కొట్టేస్తుందన్నారు. ఎలెక్షన్ రేసును సైకిలే గెలుస్తుందన్నారు. లోకల్ అభ్యర్థుల గురించి ఇలా ఊహాగానాలు బయలుదేరీ బయలుదేరకనే - విచిత్రమైన వేగంతో ప్రచారం మొదలెట్టారు ఇద్దరు నాన్‌లోకల్ అభ్యర్థులు. ఒకరిది కంచం గుర్తు! ఒకరిది మంచం గుర్తు! (నాన్‌లోకల్ వాళ్ళే మరో ఇద్దరు నిలబడ్డారు గాని — వాళ్ళ గుర్తులైనా గుర్తులేవునాకు. ప్రచారంకూడా వాళ్ళు బొత్తిగా చెయ్యలేదు. నామ్‌కేవాస్తే — డిక్లరేషన్లు ఆ రెండూ!)

కంచం అభ్యర్థి - ఊళ్ళో ప్రముఖ వ్యాపారవేత్త కొడుకు, రాజకీయాలకు కొత్తవాడేగాని, బిజినెస్ వ్యవహారాల్లో తండ్రికి కుడిచెయ్యిగా మెలగటం చేత — పుష్కలమైన వ్యవహార జ్ఞానం గడించినవాడు. అతని పూర్తిపేరు ఆది వీరవరాహ .... ఏదో చాలా పొడుగు. సౌకర్యానికి — కంచాలావు — అందాం.

మంచం కాండిడేటు తండ్రి ఎక్సు మునిసిపల్ కౌన్సిలరు. ఆ రకంగా - అంతో ఇంతో రాజకీయ పరిజ్ఞానం ఉన్నవాడు. స్థితిమంతుడు కలిసిరాకపోవటం వల్ల తండ్రి రంగనిష్క్రమణ చేసినా — తను ఎన్నటికైనా తండ్రిపేరు నిలబెట్టి పైకి రావాలను కుంటున్న ఆశయం ఉన్నవాడు. ఇతనిది.. గుర్తుండి చావనిపేరు. సరే — మంచాలావు — అందాం.

కంచం — మంచం .... రెండూ పోటీపడుతూ దిగాయి .... ఇరవై రెండో వార్డు ఎన్నికల రంగంలోకి.

గోడలమీద రాతలతో మొదలయింది. బానర్లూ, తోరణాలూ, ఏజెంట్ల నియామకాలూ, కరపత్రాలూ, మోడల్ బాలట్ పేపర్లూ, ఓటర్ల జాబితా సేకరణలూ.... ముమ్మరంగా సాగింది ప్రచారం. ఖర్చుకు వెనుకాడలేదు ఇద్దరూ. ఇంటింటికీ ప్రచారం ఉధృత స్థాయినందుకుంది.

నాన్‌లోకల్ అభ్యర్థులు వచ్చిపడి వార్డునంతా ఇలామంత్రించి వెయ్యటం లోకల్ అభ్యర్థులకు ములుగర్రతో పొడిచినట్టయింది.

కంట్రాక్టర్ల కొడుకులిద్దరూ — సైకిలూ, కుర్చీ — అదనపు బలాన్నూ సమకూర్చుకున్నారు. హోటల్ యజమాని అల్లుడు-గ్లాసు అభ్యర్థి — ఎన్నిక ముగిసేదాకా - కార్యకర్తలకూ - అభిమానులకూ, ఫ్రీబోర్డింగ్-ఉచిత కాఫీ, టీ, టిఫిన్, భోజన వసతి-ప్రకటించేశాడు.

లక్షాధికారి ముద్దుల కొడుకు, తన గుర్తు సార్థక మనిపించేలా- ముప్ఫై నల్లఫైకార్లు ఎలాగో అద్దెకి వచ్చేలా చేసి - పొడుగుపాటి ఊరేగింపు జరిపి — అదరగొట్టేశాడు.

ఈ పటాటోపమూ ప్రచారాలధాటీ చూసి - గుండెదెక్కలై ఒక అభ్యర్థి - నామినేషన్ విత్‌డ్రా చేసుకున్నాడు. మరో అభ్యర్థి -

ఆ పని చెయ్యకున్నా –"ఎందుకూ ఖర్చు దండగ" అనుకున్నట్టు – చేపట్టబోయిన ప్రచారం మానేసి హాయిగా ఇంట్లో కూచునేశాడు.

ఎన్నిక వారం రోజులుందనగా – వార్డు వార్డంతా – స్పీకర్ల గోలతో, రిక్షాలతో, గ్రూప్ చర్చలతో, కార్యకర్తల హడావుడితో – హోరెత్తిపోయింది.

కాండిడేట్లు రోజుకో ట్రిప్పు ఇంటింటికీ తిరగటంతో — వార్డు పౌరులకి ఊపిరి తిరక్కుండా పోయింది.

రాజకీయంగా ఈ వార్డు కష్టమైనదన్నాను కదూ ? .... దిగి చూస్తేగాని లోతు తెలీదు .... ఈ వార్డు కిందకొచ్చే ఓటర్లు నానా రకాల వాళ్ళు .... ఎవరి సింపతీ ఎటువేస్తుంటుందో తెలియదు .... ఈ వైకుంఠనగర్‌లో అంతా మధ్య తరగతి ఉద్యోగస్థులు — అబు నందీ కాలనీ అంతా కాస్త పై తరగతి సంపన్నులు .... అటుపైని గుడిసెల సేవాసంఘం వాళ్ళు — అట్టడుగు ప్రజ ! ట్రంకురోడ్డు పైనుంచి అటువొచ్చే రెండు వీధులూ అగ్రకుల పక్షపాతులు .... ఇక ఈ లేబర్ కాలనీ .... చాలా పెద్ద కాలనీ .... అటుపైన ఫ్యాక్టరీ ఉందిగాని అది మునిసిపల్ లిమిట్సులోకింకా చేరలేదు. లేబర్ కాలనీ — సంఖ్యా దృష్టితో చాలా ముఖ్యమైన ఆయువుపట్టు. వాళ్ళకో యూనియన్ ఉంది. యూనియన్ కార్యకలాపాలతో అంటీ ముట్టనట్టు—మరో అసమ్మతి వర్గం ఉంది —

ఏతావాతా— ఏ ఒక్క అభ్యర్థీ ఈ వార్డు ఓటర్ల మెజారిటీ అభిమానాన్ని చూరగొనడం అంటే — మాటలు కాదు !

లోకల్ అభ్యర్థులు ఎంతగా గింజుకున్నా — నాన్ లోకల్ అభ్యర్థుల ప్రచారాన్ని మరిపించలేక పోయారు. ప్రచారం అంతా పైపై పటాటోపమే – రోసునుంచి 'బిల్డప్' చేసుకురావటం ఉత్తమం అనుకు – తగుమనుషుల్ని వ్యవహారంలోకి లాగబోయారుగాని – అట్టి లాయాచీ పనులక్కూడా ఆలస్యం బాగా అయి[illegible] గ్రహించక తప్పలేదు.

అభ్యర్థుల తరపున ఇంటింటికీ మహిళా కార్యకర్తలు తిరగటం అయింది. పసుపూ కుంకాలూ తాంబూలాలూ పంచి పెట్టడం అయింది. ఎన్నిక మూడో రోజుందనగా గుడిసెల సేవా సంఘంవారి పేటలో ఆడంగులందరికీ రవికె గుడ్డలు అందించాడొక సైకిలు అభ్యర్థి. రవికెలేమిటి చీరలే ఇప్పిస్తానని—అంతపనీ చేశాడు గ్లాసు కాండిడేటు.

డబ్బు ఖర్చూ, ప్రయాసా అనే కాదుగాని — ఇదంతా మామూలు ప్రచారమే కదా — ఇందులో ప్రత్యేకత ఏముందీ — అనే అభిప్రాయం కలిగింది కాబోలు మంచాలావుకి —

మరునటి రోజునుంచి మనిషి కనిపించకుండా పోయాడు.

అతని అనుచరులూ కార్యకర్తలూ అంతా 'లాంగ్ డ్రాన్ ఫేసెస్'—నిలువునా వ్రేళ్ళాడేసిన ముఖాలతో—ఇంటింటికీ తిరుగుతూ కరపత్రాలు పంచిపెట్టారు.

మీ అభ్యర్థి ఏడీ – అని అడిగిన వాళ్ళకీ – అడగని వాళ్ళకీ కూడా —

"ఎలెక్షనుకని తిరిగి తిరిగి ఆరోగ్యమూ దెబ్బతింది— ఏదో దిగులూ పట్టుకుంది. ఇక బ్రతకనేమో అంటున్నాడు. రాయ వెల్లూర్‌లో స్పెషల్ వార్డులో ఉన్నాడిప్పుడు — డాక్టర్లకేమీ అంతుబట్టకుండా ఉంది –" అన్నారు.

ఇదంతా హంబగ్. ఓటర్ల సింపతీ సంపాయించటానికి అనారోగ్యంతో దిగులుతో మంచమెక్కినట్టు ట్రిక్ ప్లే చేస్తున్నాడు మంచాలావు – అని కంచం వాళ్ళు పసిగట్టేశారు.

ట్రిక్కో లక్కో తెలియదు. మంచాలావుకు మాత్రం ఆ రోజునుంచే అధిక సింపతీ లభించటం మొదలయింది. "అయ్యో పాపం" అన్నారు. "ఓడిపోతానని దిగులా ?" అని ఆడంగులు బుగ్గలు నొక్కుకున్నారు. తొంభై శాతం ఓట్లు— ఇదుగో – ఇట్లాంటి సింపతీతో ఈజీగా పడిపోవూ ?

ఎలెక్షనుకి రెండేరోజులుంది.

కంచాలావు కార్యకర్తలకి ముచ్చెమట్లు పోసేశాయి. వాళ్ళ పొజిషనంతా విడమర్చి చెప్పేసరికి కంచాలావుకి దిక్కుతోచలేదు.

'సార్థక చిహ్నధరుడు' మంచాలావు ఎక్కడో రాయ వెల్లూరులో మంచమెక్కినట్టు – ట్రిక్ ప్లే చేస్తున్నాడు.

తనదీ సార్థక చిహ్నం కావాలంటే – కంచం ముందేసుకుని నడివీధిలో కుచోవాలా తను ? లేక – ఇంటింటికీ ఓ కంచం పంచి పెట్టాలా ? ఒక ఇంటికి ఒక కంచం ఇస్తే సరిపోతుందా? సరిపోవే! ఇస్తే – ఏం కంచాలివ్వాలి ? స్టీలువా ? పింగాణీవా ? పేపర్ ప్లేట్స్ ఇస్తే సరిపోతుందా ?

ఛాన్సు పోయింది. ఆ కంచం ఎక్కడపు పనేమిటో—ముందు తనే చేసుంటే పోయేది. ఇప్పుడాపని చేసినా – హాస్యాస్పదమై పోతుంది.

ఎవరున్నారు తననిప్పుడు బ్రోచేవారు?— అని అంగలార్చాడు కంచాలావు.

"నేనున్నాను గదా—" అంటూ సమాలోచనలో జోక్యం చేసుకున్నాడు అతని తండ్రి.

"సమాచారమంతా నేనూ సేకరిస్తున్నాను. మంచాలావు మంచం ఎక్కితే ఎక్కాడుగాని - నువ్వేమీ ఎక్కలేవు....ఎలా చేసయినా సీటెక్కాలి నువ్వు — కౌన్సిలర్ సీటు — అంతే....."

"అదెలా బాబాయ్ ?—" అని దూరాడు ప్రక్కనే ఉన్న అప్తకుర్ర కార్యకర్త— "మంచమెక్కిన ట్రిక్కుతో మంచాలావు బోల్డు సింపతీ గెయిన్ చేసేశాడు —"

"అబ్బాయిలూ — " అన్నాడు కంచాలావు తండ్రి — "సింపతీ సంపాదించాడతను. సరే? బాగానే ఉంది. సింపతీ చూపటంవల్ల ఓటర్ల కేమొస్తుందీ ?

"ఏమిరాదు — సానుభూతితో ఓట్లు — అతనికి వేసేస్తారు."

"అలా వెయ్యొద్దని చెప్తాం —"

"అదెలాగ ?"

"మీ సింపతీవల్ల అతనికి లాభం — కాని మీకేం లాభం ? ఏమీ లాభం లేదని చెప్తాం —"

"వింటారా ?"

"వాళ్ళందరికీ లాభం కలిగే మార్గం చెప్తే — తప్పక వింటారు...."

"లాభం అంటే-ఓటుకింత అని- డబ్బు పంచటమేనా-?"

నవ్వాడు కాండిడేటు పిత — "పావుగంట క్రితం నాకు అందిన సమాచారం బట్టి — ఈ రాత్రే ప్రారంభమవుతోంది — ఓట్ల కొనుగోలు కార్యక్రమం. లోకల్ అభ్యర్థులు సైకిలూ — కారూ....ఆ వ్యాపారం చెయ్యబోతున్నారు...."

"మరి — మనమేం చేద్దాం డాడీ?—" అన్నాడు కంచాలావు, గొంతు తడారిపోతూండగా.

భయపడకన్నట్టు సుపుత్రుడి వీపుతట్టి, అతని అనుచరులతో అన్నాడు తండ్రి — "ఎలెక్షనంటే బిగ్ బిజినెస్. కాస్త సైకాలజీ— కాస్త జూదమూ ఉందిగాని — మిగతంతా ప్యూర్ వ్యాపారం .... ఖాళీ చేసిన ఇళ్ళ కాపురస్తుల ఓట్లూ, ప్రస్తుతం ఊళ్ళోలేనివాళ్ళ ఓట్లూ....వాటి మాటేం చేస్తారు ?...."

చాణక్యుడి ముని ముని మనవడిలాంటి ఒక కార్యకర్త గుంభనంగా నవ్వాడు — "రెండువందల ఓట్లదాకా ఉంటాయవి.. వాటి గురించి బెంగ ఏమీ పడనవసరంలేదు...."

"బాబాయ్ — అట్లాంటి సంగతులు మాకొదిలెయ్యండి — మధ్యాహ్నం దాకా చూస్తాం. ఊళ్ళో ఉండీ బూత్ దగ్గరకు రాని ఓటర్లుంటారు. ఆ ఓట్లన్నీ ఖచ్చితంగా కంచానికే ముద్ర పడిపోతాయ్ —" అన్నారు మరో యువ కార్యకర్త.

"వెరీ గుడ్ — ఎలెక్షన్‌రోజు ఉదయం అడునుంచి వ్యాన్లూ కార్లూ సరిపడేన్ని — రెడీలో ఉంచుతున్నారు కద — మరింక ఎవరి డ్యూటీమీద వాళ్ళు వెళ్ళండి —" అని నలుగురైదుగురు ముఖ్య కార్యకర్తల్ని తప్ప మిగత అందర్నీ పంపించేశాడు కంచాలావు తండ్రి.

"డాడీ — మరి — మంచాలావు సింపతీని పడగొట్టి.... ఓటర్ల కేదో లాభం...." అనబోయాడు.

"ష్!" అని అతణ్ణి వారించి; ముఖ్యకార్యకర్తల్ని వారగా పిలిచి వాళ్ళకేవో ఆదేశాలిచ్చి వాళ్ళని పంపేశాడు తండ్రి.

"ఏమిటి డాడీ — నాకేం అర్థం కావటం లేదు -" అన్నాడు సుపుత్రుడు.

"పిచ్చినాయనా....హడావుడిలోపడి —ఇరవై రెండో వార్డుకి అయువుపట్టయిన లేబర్ కాలనీని తగినంత ప్రత్యేకంగా పట్టించుకోవటం మరిచి పోయావు నువ్వు. మనమిప్పుడు అక్కడికే వెళ్తున్నాం .. "

"కారు రెడీ చేయించనా ...."

"వొద్దు — మనం కాలినడకనే వెళ్తున్నాం —"

కంచాలావు అతని తండ్రీ కాలినడకన ఆ రాత్రి లేబర్ కాలనీకి వెళ్ళిన విషయం చాలా మందికి తెలుసు. వెళ్ళి అక్కడ వాళ్ళు ఏం చేశారో, ఎవర్తో ఏం మాట్లాడారో — బయటికి రాలేదు.

మరునటి రోజుకి కంచమా మంచమా అంటే — ఎవరూ చెప్పేస్థితిలోలేరు.

చెప్తా - చెప్తా నోయ్ .... మరీ తొందర పడిపోకు,

ప్రచారం పర్వం ముగిసింది.

పోలింగు పర్వం మొదలైంది.

ఆ రోజు - ప్రతి వార్డు లాగా — మావార్డూ తిరణాలే అయిపోయింది.

బ్యాడ్జీలు ధరించి వాలెంటీర్లు తిరిగారు, కార్లూ - వ్యాన్లూ తిరిగాయి, బూత్‌లముందు పోలీసు నిలుచుండి, కాండిడేట్లు వంగి వంగి దండాలు పెట్టారు —అంతా షరా మామూలే.

లోకల్ కాండిడేట్లు — ప్రతివాడూ - గెలుపు నాదంటే నాదేనన్నాడు.

ఓట్ల లెక్కింపు రోజు - అప్పుడిక గొప్పలు చెప్పటాలు లేవుగాని - అంతా దైవాధీనం అనేవారే.

లెక్కింపు ముగిసింది.

మావార్డుకి — కంచర్లావు గెలిచాడు। రెండున్నర వేల థంపింగ్ మెజారిటీతో ....

సైకిలన్నారే —కారన్నారే — మంచం తప్పదన్నారే — కంచం ఎలా వచ్చిందనుకున్న వాళ్ళకి —

మెల్లగా తెలిసింది సమాచారం ....

వొచ్చేశాగా — ఇంకా తొందరెందుకూ —

కష్టపడి నేను సేకరించిన వివరాలబట్టి — పూర్తి భోగట్టా ఇదీ ..

కంచర్లావూ అతని తండ్రీ లేబర్ కాలనీకి వెళ్ళారు గత-ఆరాత్రి —

అంత పెద్ద బిజినెస్‌మాను తమ దగ్గరికి స్వయానా కాలి నడకన రావడంతో కొంతమంది లేబర్ జనం చాలా పొంగి పోయారు —

"ఈ మాత్రం దానికి మీరు రావాలా సార్ .... అబ్బాయి గారి గెలుపే — మా గెలుపు కదా ...." అన్నారు.

"మీరు అంతపని చెయ్యలేరని కాదు ... ఏదో నా ఆత్మతృప్తి కొద్దీ వొచ్చాను-భరోసా ఇచ్చినంత మాత్రాన చాలదు - నిర్మొహమాటంగా చెప్తున్నాను — ఏమనుకోకండి — ఎందుకంటే — ఇవి ఎన్నికలు ..." అని ఆయన అంటూ ఉండగానే ....

ఇదివరకు ఇంటినుంచి బయలుదేరేముందు ఆయన పంపిన కార్యకర్తలు వచ్చారక్కడికి-వాళ్ళతోబాటు - లేబర్ యూనియన్ నాయకుడూ, కొంత దూరంగా — అసమ్మతి వర్గ నాయకుడూ — మరికొత్త ఎకంగా కాలనీలో ప్రముఖులనదగిన కొందరు తల నెరవబోతున్న వాళ్లూ — ఉన్నారు.

అందరికీ తండ్రీ కొడుకులిద్దరూ ప్రత్యేకంగా నమస్కారాలు చేశారు.

"మనంకొత్త ప్రయివేటుగా మాట్లాడుకుంటే బాగుంటుంది- ఎందుకంటే — ఎన్నికలు ...." అన్నాడు తండ్రి.

"మాఇంటికి వెళ్దాం రండి —" అన్నాడు యూనియన్ నాయకుడు, తన అనుచరుల్తో గుసగుసలాడాడు.

కంచర్లావు అనుచరులు అసమ్మతివర్గ నాయకుడితోనూ, తలనెరవబోతున్న పెద్దలతోనూ సంప్రదించారు.

యూనియన్ నాయకుడి ఇంట్లో సమావేశం కావటానికి ఎవరూ అభ్యంతర పెట్టలేదు.

సమావేశాన్ని అతి నేర్పుగా నిర్వహించాడు కంచర్లావు తండ్రి— "తెలిసో తెలీకో....మావాడీ ఎలెక్షన్‌లో దిగేశాడు. వాడి ఉత్సాహం చూసి కాదన్లేక పోయానుగాని ఇప్పుడిది నాకు ప్రెస్టిజ్ ఇష్యూ అయి కూచుంది. అయినా మీరంతా ఉన్నారని నాధైర్యం"—

"మరేం ఫర్వాలేదు. మా సపోర్టుంది — ప్రామిస్‌సార్— మనబ్బాయి గెలిచి తీరతాడు" వగైరా భరోసాలు వినిపించాయి.

"చాలాసంతోషం. కాని నా భయాలు నావి. జయాపజయాలు దైవాధీనంఅంటారు. ఆ దైవాధీనం నాకొద్దు. అవునూ రైనా-మావాడు గెలవాలి — నేను తిన్నగా మీ దగ్గరికే ఎందుకొచ్చానో గ్రహించే ఉంటారు....ఈ కాలనీవి మూకుమ్మడి ఓట్లు. కాలనీ అంతా ఎవరికి ఓటుచేస్తే — వాడే గెలుస్తాడు — మిగత కాలనీలవీ గుడిసెలవీ కొంచెం అటూ ఇటూ అయినా; డబ్బు పంచే వాళ్ళమాటా ఓట్లుకొనే వాళ్ళమాట వొద్దు. మావాడు గెలవాలి-మీరు గెలిపించాలి. చెప్పండి- ఏం చెయ్యమంటారు? మీలో మీకు అభిప్రాయభేదాలున్నా - నా మీద అభిమానంతో - ఇక్కడ సమావేశమయ్యారు - ఇదే సంతోషంగా ఉంది - ఇక మావాణ్ణి గెలిపించటానికి - ఏం చెయ్యమన్నా — సంతోషంగా చేస్తాను -" అన్నాడు కంచర్లావు తండ్రి.

సీరియస్ ముఖంతో లేచాడు అసమ్మతి వర్గీయుడొకడు - "సరేలెండి సార్- ఎలెక్షను కాబట్టి - ఎవరైనా ఇలాగే చెప్తారు."

"యస్-" అన్నాడు కంచర్లావు పిత. "అవును! స్వార్థమేనయ్యా — ఒప్పుకుంటాను !— మీకేం కావాలో చెప్పండి అంటున్నాను — నా కొడుకు కౌన్సిలర్ కావటంవల్ల మీకేం ప్రయోజనం ఉండదా ? ఏం కావాలో అడగండంటున్నాను-"

క్షణం ఆలోచించి యూనియన్ నాయకుడన్నాడు "నరేసార్ అంతెందుకు ? ట్రంకు రోడ్డు నుంచి మా లేబర్ కాలనీకి సరయిన రోడ్డు లేదు. రాత్రిళ్ల దీపాలుండవు. ఇంతవరకు ప్రతికౌన్సిలర్‌కూ చెప్పినా - పట్టించుకున్నవాడు లేడు -"

"నేను వేయిస్తాను. రోడ్డు వేయిస్తాను - లైట్లువేయిస్తాను- ఎన్నికయితే -" అన్నారు కంచాల్రావు.

యూనియన్ నాయకుడు చిన్నగా నవ్వాడు- "ఎలెక్షన్ ప్రామిస్సుల్లో ఎవరికీనమ్మకం ఉండదుసార్. క్రితంసారి కౌన్సిలరూ ఇలాగే అన్నాడు - ఎన్నిక ముందు - తర్వాత - వార్డువేపే చూడ లేదు. ఈ కంకర గుంతల రోడ్డుమీద మేమూ మా లేడీసూ పిల్లలూ పడే అవస్థ అంతా ఇంతాకాదు - రాత్రిళ్లూ - వానకురిసిన రాత్రిళ్ళయితే - మరీ ఘోరంగా ఉంటుంది .... మా ఫ్యాక్టరీ యజమాన్లకి ఎన్నిసార్లు చెప్పినా ప్రయోజనంలేదు. ఫండ్సు లేవంటారు. కాలనీ మునిసిపల్ లిమిట్సులో ఉందిగనుక, ట్రంకు రోడ్డునుంచి రోడ్డువెయ్యాల్సిన బాధ్యత - మునిసిపాలిటీదేనంటారు. మాకు మాత్రం దురవస్థ తప్పటంలేదు. నోటిమాటల్తో ఏమవుతుంది ?.."

అసమ్మతి వర్గనాయకుడు అందుకున్నాడు- "ఎన్నికయిన వాళ్ళకీ - చెయ్యాలనే ఉంటుంది. కాని - పదవీ బాధ్యతల్లోపడి - వార్డు విషయాలే మరిచిపోతారు !-" అతని మాటల్లో వ్యంగ్యం ధ్వనించింది.

పరిస్థితినంతా క్షణంలో ఆకళింపు చేసుకున్నాడు కంచాల్రావు తండ్రి. సమావేశమైన వాళ్ళందరివంకా, మార్చి మార్చి చూశాడు. "వెరీగుడ్" అన్నాడు నవ్వకుండా.

ఆయన కనుసన్న గ్రహించి, అనుచరుడు లెదర్ బ్యాగ్ అందించాడు. అందులోంచి కొన్ని నోట్లకట్టలు లెక్కపెట్టి తీసి, అందరికీ కనిపించేలా బల్లమీద పరిచి ప్రదర్శించాడు కంచల్రావు కన్నతండ్రి. "ఇదుగోండి - పాతికవేలు !-" అన్నాడు.

అంతడబ్బు ఒక్కసారిగా ఎందుకు ముందుకొచ్చిందో - 'కాలనీయు'లకు వెంటనే అర్థం కాలేదు.

విడమరిచి చెప్పాడు పిత -

"లంచం కాదు ! ఓట్లు కొనటం కాదు ! డిపాజిట్, మావాడు మీదగ్గిరుంచుతున్న డిపాజిట్ ! నాకు తెలుసు - మీరు నలుగురు పెద్దలూ ఏ కాండిడేట్ను కావాలనుకుంటే ఆ కాండిడేట్ని గెలిపించగలరు. మీ మాట విలువ అలాంటిది ! ఏం ? మావాణ్ణి గెలిపించండి. ఎన్నికయిన వెంటనే - సాధ్యమైనంత తొందరలో- రోడ్డు వేయిస్తాడు మీ కాలనీకి - లైట్లు వేయిస్తాడు. రోడ్డూలైట్లూ మావాడు వేయిస్తేనే - ఈ డిపాజిట్ డబ్బు పాతికవేలు వెనక్కి ఇవ్వండి. లేదూ - డబ్బుని మీరేం చేసుకున్నా - మీ యిష్టం. మీరే రోడ్డు వేయించుకుంటారో, లైట్లే వేయించుకుంటారో - ఇంటింటికీ ఇంత అని పంచుకుంటారో - మీ యిష్టం. మీరు తలుచుకుంటే మావాడు గెలుస్తాడు. గెలవకపోయే ప్రశ్నేలేదు - ఒకవేళ ఖర్మకాలి గెలవలేదనుకోండి -"

"రైట్ - అంతపనే జరిగితే - మేమే డబ్బువాపసిచ్చేస్తాం- మీరడిగేదాకాకూడా ఉంచుకోం -" అన్నాడు యూనియన్ నాయకుడు.

బాగుందంటే బాగుందన్నారందరూ.

సమావేశం నుంచి బైటికొచ్చేస్తూ "బరువు తీరింది." అన్నాడు కాండిడేటు పితృపాదుడు.

"డాడీ - మరి - నేను గెలిచాక - రోడ్డు వేయించాక - వాళ్ళు డబ్బు తిరిగి ఇవ్వకపోతే ?-" అనే అశర్యసందేహం వెలిబుచ్చాడు కంచాల్రావు.

"అలా ఒక్కనాటికీ జరగదు. గెలిచిన కాండిడేట్‌తో విరోధమనేది రాజకీయాల్లో అసంభవమైన విషయం! చూస్తూండు.."

అలా చూస్తూనే ఉండిపోయిన కొడుకు, అత్యధిక మెజారిటీతో ఎన్నిక గెలిచేశాడు. ఆ తర్వాత తండ్రి ఆదేశం మేరకు లేబర్ కాలనీకి ఒక నెలరోజుల్లోనే రోడ్డు వేయించేసి పాతికవేలు డిపాజిట్టూ వెనక్కి తెచ్చుకున్నాడు. మంచి కౌన్సిలర్‌గా పేరు సంపాదించుకున్నాడు.

అదీ ఈ రోడ్డు కథ —

* * *

అని మరో సిగిరెట్టు వెలిగించాడు పూర్ణాయ్.

"బాగుంది -" అన్నాన్నేను.

"ఏది బాగుంది ?" అని రెట్టించాడు మా వాడు - "కంచాల్రావు గెలవటమా ? కాలనీకి రోడ్డు వేయించటమా ?"

"రెండూను. లేబర్ కాలనీ వాళ్ళు మాటప్రకారం కంచాల్రావును గెలిపించారూ - రోడ్డూ లైట్లూకూడా వేయించుకున్నారు ! కంచాల్రావు ఎన్నికలో గొప్ప మెజారిటీతో గెలిచాడూ - రోడ్డు

వేయించి మాట నిలుపు కోవటమేగాక డిపాజిట్ సొమ్మూ వెనక్కి రప్పించుకున్నాడు? కాని .... రోడ్డు వేయించింది మునిసిపాలిటీ డబ్బుతోనే కదా .... డిపాజిట్ తతంగం లేకుండా అసలు జరిగి ఉండదా ? —"

"జరిగి ఉండదు! స్వార్థం చూసుకోకుండా ఏ రాజకీయజీవీ ప్రజాసేవ చెయ్యడు! పాతికవేల డిపాజిట్ లేకుంటే - ఈ రోడ్డు వేయించేమాటా - అన్ని ఎలెక్షన్ ప్రామిస్సుకలాగే — కంచాల్రావు గెలిచిన మరుసటి క్షణమే గాలిలో కలిసిపోయుండేది .... గివ్ అండ్ టేక్ — అదే వ్యాపారం కిటుకు. ఆ కిటుకు ఉపయోగించే కంచాల్రావు తండ్రి కొడుకును కౌన్సిలర్ సీటులో కూచో బెట్టాడు. ఈ లావాదేవీలో ఎవరూ నష్టపోలేదు. ఇక మునిసిపాలిటీ సంగతా ? చెయ్యాలనుకుంటే మార్గాలెప్పుడూ ఉంటాయి. మా మునిసిపాలిటీకి — బోలెడు ఫండ్సున్నాయి. ఆ ఫండ్సు ఎలా చితికి ఏ జేబుల్లోకి జీర్ణమౌతుంటాయో మరి .... మందీ మార్బలానికీ లోటు లేదు — కాని వాళ్ళ పనిగంటలు వాళ్ళకి నిద్ర గంటలుగానో స్వంతపని గంటలుగానో ఉపయోగ పడుతుంటాయి. ఫండ్సులో కొస్త శాతమూ, సిబ్బంది డ్యూటీలో కొంతకాలమూ ప్రజలకు ఉపయోగపడేలా చూట్టమే కౌన్సిలర్ బాధ్యత. పాతికవేలకి వడ్డీ ఎక్కడ నష్టపోతానో అని — నెలతిరక్కుండానే రోడ్డేయించాడు. కంచాల్రావు. లేకుంటే — అంత తొందరగా కూడా పూనుకోక పోవును —" అని ఆగాడు పూర్ణాయ్.

"బాగుంది" అన్నాను, ఈసారి — స్వగతంలా,

"ఈ సందర్భంగా నాదో ఫ్లేషిస్తుంది —" అన్నాడు మావాడు.

"ఏమిటది ?" అని నేను అడిగేలోపలే చెప్పాడు —

"ఇటీవల జాతీయస్థాయిలో ప్రతిపక్షాలంతా చేరి — ఎన్నికల సంస్కరణలు జరగాలని చర్చలు మొదలెట్టారు. పాలకపక్షం కూడా అప్పుడప్పుడూ ఈ ముక్క అంటూనే ఉంది. ఓటర్లందరికీ — ఐడెంటిటీ కార్డు లివ్వాలి .... అభ్యర్థి ప్రతివాడూ ఎన్నికల ఎకౌంట్లు తయారు చెయ్యాలి - ఎకౌంట్సుని బహిరంగంగా ప్రకటించాలి .... .... వగైరా, వగైరా. చర్చలదాకా రంజుగా ఉంటుందిగాని ప్రతిపక్షమూ పాలకవర్గమూ ఈ సంస్కరణలకి పూర్తిగా ముందుకు రావటంలేదు. ఎన్నికలు ఎలాజరిగితే వాళ్ళకేం? వాళ్ళకి — ఎన్నికల్లో నెగ్గటం కావాలి — సీటులో కూచోవటం కావాలి :. ఆ రకంగా ఎన్నికల సంస్కరణలు జరిగినా మానినా — ఓటర్ల కేం ఒరుగుతుందీ ? ఎన్నికలు ముగిశాక పాతపాటే ! డబ్బున్నవాడు సీటెక్కుతాడు — ఓటిచ్చినవాడు దరిద్రంలోనే ఉంటాడు....అందుచేత—" అని నాటకీయంగా ఆగాడు పూర్ణాయ్....

"చెప్పు మరి —" అన్నాను.

"ఈ డిపాజిట్ పద్ధతి బెస్టు — ఇకనుంచి ఓటర్లంతా పంచాయితీ నుంచీ పార్లమెంటు ఎన్నికదాకా — ఈ పద్ధతే ఫాలో కావాలి. కాండిడేట్ని నిలదీసి డిపాజిట్ కట్టించుకుని అతణ్ణి గెలిపించటం .... గెలిచాక అతను చెప్పిన పని చెయ్యకుంటే — డిపాజిట్ డబ్బుతో పదిమందికీ పనికొచ్చే పనేదో ఓటర్లే చేయించుకోవటం .... అనగా ఎన్నికల సంస్కరణ అనేది ఈ రకంగా ప్రజలే చేస్తారన్నమాట .... ఇలా చేస్తే మన ప్రజాస్వామ్యం ప్రత్యేక పద్ధతిలో ప్రపంచానికే మార్గదర్శకమౌతుంది — ఏమంటావ్ ?—"

"ఆలోచించాల్సిందే !—" అన్నాను నేను.

అవునా ?



# గోపాల గోస్వామి

## జమదగ్ని

[పద్యాలు చదవండి. నేను ఈ శ్రీకాళహస్తికి 1968 లో వచ్చాను. వచ్చిన కొత్తల్లో ఏమోకాని తర్వాత శ్రీ గోపాల గోస్వామి సిద్ధిపొందే వరకూ నిత్యమూ కనిపిస్తూనే వచ్చారు. ఇంచు మించు ప్రతిరోజూ ఒకరి నొకరం పలకరించుకునే వాళ్ళం కూడాను; నేనేదో మనసులో అనుకుంటూ అతన్ని గమనింపక పోయినా చేలా అనీ బేటా అనీ రకరకాలుగా అతడే పిలిచి పలకరించేవాడు. ఏదైనా ఇమ్మనేవాడు అప్పుడప్పుడు. ఒకప్పుడు ఇంతిమ్మని గూడా అడిగేవాడు. ఎంత ఇస్తే అంతా నవ్వుతూ పుచ్చుకునేవాడు. అంతకంటే మాటలు ఎంత ప్రయత్నించినా జరిగేవికావు. కొన్నాళ్లతను ప్రాకారనంది దగ్గర ఉన్నాడు; పాతాళ విఘ్నేశ్వరుడు దగ్గర కొన్నాళ్లున్నాడు. అతడెక్కడుంటే అక్కడ అసహ్యమవుతుందని ఆలయాధికారులే పొమ్మంటే వెళ్లాడో లేక తనంతట తానే వెళ్లాడోగాని ఆ తర్వాత ఆలయంలోపల ఎప్పుడూ కనిపించలేదు. అక్కడ ఉండే రోజుల్లో నంది ఉన్న తిన్నెమీద దిసమొలతో నిలిచి సాక్షాత్ భైరవుడిలా తోస్తూ ఏదేదో ధోరణిలో అతడంటూ ఉంటే ఎన్నో ఉపనిషద్వాక్యాలు దొర్లుకు వచ్చేవి. అప్పటి నుంచీ అతడంటే గౌరవం పెరిగింది. అయినా అతని బాహ్యవర్తనం ఒక్కొక్కప్పుడు పరమ జుగుప్సావహంగా ఉండి అవధూత కావడం ఎంతగొప్ప విషయమైనా ఇట్టి అవధూత అవడంకంటే ఘోరశిక్ష ఇంకేముంటుందనిపించేది. అతడవధూత కాదేమో, మతి చెడ్డ బిచ్చగాడేనేమో అనికూడా అనిపించక పోలేదు. అయుక్క నాలో నేను అనుకున్నా ఎవరైనా అతన్ని అవధూతకాదని అన్నప్పుడు నాకుతెలిసిన పురాణాల్లోని అవధూతల వర్తనలు జ్ఞాపకం చేసి వాళ్ళందరూకాగాలేంది ఇతడెందుకు కాగూడదని వాదించేవాణ్ణి. నిజంకూడా అదే. బాహ్యవర్తనమనేది ప్రారబ్ధాధీనం. అది శరీరానికి సంబంధించిందే. జీవుడు ముక్తుడై ఎట్టి యుపాధిలోనైనా ఉండవచ్చు. రాయలవారి మంటపంలో ఆనందనామ సంవత్సరం నుండి (1974) పరమేశ్వరానుగ్రహంవల్ల నిర్విరామంగా సాగుతున్న నిత్య ప్రవచనంలో అవధూతల ప్రసంగం వచ్చినప్పుడల్లా ఇతని స్మృతి రాకుండా ఉండేది కాదు.

పింగళ కార్తికం. నవంబరులో శృంగేరీ జగద్గురువులు అభినవ విద్యాతీర్థ మహాస్వామివారు శిష్యస్వామి సహితులై ఈ ఊరు వచ్చారు. అప్పటి కతడు రెండు రోజులుగా అంత్యదశల్లోనే ఉంటున్నాడు. ఆ రోజున హోరుమని వానకురుస్తోంది. జగద్గురువులు రాయల వారి మంటపంలో శారదా చంద్రమౌళీశ్వరులకు అర్చన చేస్తున్నారు. నేనా పూజలో యథాశక్తి పాల్గొంటున్నాను. అప్పుడుండగానో అయ్యాకనో ఈవార్త వచ్చింది. 'శివశివా' అనుకున్నాను. అతనల్లా సిద్ధిపొందాడు. అది నవంబరు 17వ తేదీ - నవంబరు 19-1977 సర్వ ప్రపంచాన్నీ కదిలించి వేసిన దివిసీమ ప్రళయం ఆ రోజునే వచ్చింది. శ్రీ గోపాల గోస్వామి ఈ తెలుగుగడ్డ మీదనే సజీవుడై ఉండి ఉంటే అది వచ్చేదికాదనే నా నమ్మకం. అది వస్తుందని తెలిసీ ఈ ఘోరవార్త మనం విననే కూడదని అనుకునే అతడు ఉపసంహరించుకున్నాడో లేక ఆ ఉపాధి ఇక్కడ ఉండగా ఆ ప్రళయం రావడానికి వీల్లేదని భగవంతుడే ఆ ఉపాధి నుపసంహరించి తర్వాతనే ప్రళయం తెచ్చాడో అది వారికే తెలియాలి. గౌరవార్థం బహువచనం కాని వారిద్దరైతే కదా, ఒక్కరే!

ఏమైతేనేం ఇప్పుడు వ్యష్టిగా మనందరికీ కళ్ళకు కనిపించిన మానవోపాధి తాల్చిన గోపాల గోస్వామి లేడు. సమష్టి స్వరూపుడై ఉండకపోవడం ఎప్పుడూ లేదు. ఆయన దివ్య స్మృతికి ఇదొక సాధనం!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

....రచయిత]

అతఁ డొక పిచ్చివాఁడు తల
యంతయు నట్టులు కట్టియుండు, ను
న్నతమగు విగ్రహం, బురము
నన్ గదలాడెడి వ్రేలు గడ్డమై
సతతము నగ్న మూర్తిగనె
సంచరణం బొనరించు చుండు, వి
స్మృతమగు దేనికో వెదకు
చేతలు, పొంతన లేని మాటలున్॥ ౧

ఎక్కడ పుట్టెనో? యెపుడు
నిట్టులె యుండెనో? మధ్య మధ్య తా
నక్కజ మౌనటుల్ శ్రుతి ర
హస్యము లేనియొ పల్కుచుండు, నీ
నిక్క మెఱుంగఁ జెప్పుమన
నిర్మల మౌ మొగ మప్పుఁజెప్పి తా
నక్కడ నుండి లేచి చను
నంతె! సుమంతయుఁ జెప్పఁ డెన్నడున్॥ ౨

వచ్చెనుఁ గాళహస్తి పురి
వాలెను, మత్తగజేంద్ర మన్నచో
నచ్చెరు వేమి ? స్నానమయి
నంతనె హాయిగ దుమ్ము నొంటిపై
ముచ్చటగాగఁ జల్లుకొను,
మున్గియ యుండు ముదబ్ధియందుఁ, గా
ర్చిచ్చగు వేసఁగిన్ గలవ
రింపఁడు నీటికిఁ బట్టునట్టులే ! ౩

స్నానము చేసినట్లె కనఁ
జాలము, శుభ్రత లేదు, భూరజ
స్నాన విశుద్ధమై తనువు
సాగునొ యేమొ యసహ్యమన్న మా
త్రైనను తోఁప, దాతని క్రి
యల్ విపరీతములై యిదేమి యీ
మానవుఁ డెవ్వఁడన్న విను
మానము కల్గఁగఁజేయు నెప్పుడున్॥ ౪

అడుగకయే జనంబు లెవి
యైన నొసంగిన స్వీకరించుఁ, దా
నడుగు నొకప్పు, డాఁ డడుగు
టన్న దదృష్టమటంచు నెంచి యే
మడిగిన నిత్తు, రే మడుగు
నాతఁడు ! కృత్తున కద్దియిద్ది, నీ
విడినది మట్టికద్ద మటే
యేమియుఁ గానటె యారగించెడిన్॥ ౫

ఎండకు వానకుం జడియ
కెప్పుడు వీథులయందె యుండు, వాఁ
డుండినచోట నే మనక
యుండును కుక్కలు పందు లెన్నియేన్
బొండనఁ డవ్వియున్ జనవు
పొత్తున నుందు, రటయ్యు వాని కె
న్నండును జబ్బుచేయ దని
నన్, నిజ, మాతఁ డెవండు? యోగియా? ౬

ఉబ్బస మున్న దాతనికి
నుద్ధృతమైనపు డాతఁ డేదియో
జబ్బపయిన్ స్వయమ్ముగనె
సన్నగ గ్రుచ్చును సూదిమందు, లే
దబ్బుర మింత, వాని కది
హాయిగ మానును, మందులేక త
బ్బిబ్బగుచుండు వేదనను
స్వీయ రుజన్ గణియింపఁ డెన్నఁడున్॥ ౭

ప్రారబ్ధాగత దీర్ఘరోగ మిది చం
పంబోదుగానీ యమ
ద్వారంబున్ గనిపింపఁజేసి చను, తీ
వ్రం బౌను శీతర్తువం,
దేరున్ వానిని జేరఁదీయ రకటా
యెందుండునో యేమి యా
నో రాత్రించరసార్వ భౌముఁడయి యె
ట్లో తగ్గినన్ దోఁచెడిన్॥ ౮

గోపాలుండని పిల్తు రాతనిని, భి
క్షూ ! యన్ననున్ బల్కుఁ, దా
నై పేరిద్ది యటంచుఁ జెప్పికొనెనా ?
యట్లేల చెప్పున్ ? మనీ
షాపారీణుఁ డెవండొ పెట్టె, నదియే
సార్థంబుగా నున్న, దీ
గోపాలుండు హృషీక గోగణము నా
గున్ హద్దు నందుంచుచున్॥ ౯

జపమేదైన నొనర్చునో యెఱుఁగ, మి
చ్చంచోవు దదిదయో
యపలాపంబుగఁ బల్కుచుండు నెపుడున్
యత్నించియున్ వాని ని
ష్ప్రపతస్ గూర్చిన మర్మమున్ దెలియ నా
ధ్యం బెవ్వడున్గాడు ని
ర్లసనుం డొటగనుఁ దోఁచు దాపులకు లాం
ఛ్రంబైన కా వింతకున్॥ ౧౦

ఏమియు లేదు పిచ్చి యని
యెంతురు కొందరు; కాదు సాధు గో
స్వామి యెవండొ సిద్ధుఁడయి
వచ్చెను క్షేత్రము గొప్ప దిందు ది
వ్యామృత సంస్కృతిన్ మనుచు
నాయువు తీర్పఁదలంచి కాక తా
నీమెయి యెట్టులుండు నని
యెంతురు కొందరు – సత్య మేదియో! ౧౧

నమ్మోడి వారి యందును క
నందగు భేదము లెన్నియైన వాఁ
డెమ్మోయి నున్న వానికడ
నే పడియుండి యెదేదియో యనం
దమ్మొ గుఱించి యే యని య
థార్థమె యౌనని మ్రొక్కిపోదు రా
యిమ్మది వారిడెందముల
యిమ్మొయటుల్ భ్రమియింపఁ జేసెడిన్॥ ౧

వాఁడెదియేని తోఁచినది
పట్టి యొసంగిన మేలటంచు వెం
టాడుదు రెంతొ యాశపడి
యాతఁడొసంగఁడు మట్టికూడ, నీ
వేడకొ పోవుచుండ నినుఁ
బిల్చి యొసంగును పూవొ పండొ నీ
వాడిన దాట నాడు విజ
యంబగు నెల్లెడలన్ నిజంబుగన్॥ ౧౩

ఐదును రెండు నొక్కటియు
నా రని యంకెలు పల్కినంత నం
దేదియొ మర్మమున్నదని
యెంచి ధనంబిడి పందెమాడి యా
హా! దయఁబూని చెప్ప గలు
పందిలి ముందుదు జూదగాండ్రు వాఁ
డేది వచించె వీరెది వ
రించిరి దైవ మెఱుంగఁగాఁవలెన్॥ ౧౪

దేహము వేఱు లోనగల
దివ్యుఁడు జీవుఁడు వేఱు, వానికిన్
దేహము పై మఱుంగగు, వి
ధింబడి వచ్చిన దద్ది, భుక్తమై
దాహమునంది వేఱయిన
దానికిఁ దావిడి పోవుచుండు; ప్ర
త్యూహము లేక యెల్లపుడు
నుండెడి వాఁడతఁడే శివుండగున్॥ ౧౫

బొందిని పీడి బొందిని శి
వుండను నేనని యుండు వాని కా
నందమె యిందునందు నెపు
డందును బొందికిఁగల్గు భోగముల్
చెందవు వాని, సంగమును
చెందని లోకురిడీయతండు, రా
పొందునె? బొందమున్ విరియ,
నూడియ యుండెను లోన స్వాత్ముఁడై॥ ౧౬

అది సచ్చిత్సుఖమౌట దాని కది దే
హంబున్న లేకున్న న
య్యది తానై యఖిలంబు స్వాన్యరహితం
బై పూర్ణమై యుంటఁ దోఁ
పదుగానీ పరమార్థమయ్యదియె శ
శ్వత్సౌఖ్య మా భద్రమౌ
పదవిం బొందిన బొంది యట్లయినఁ దోఁ
పం బోదు ముమ్మాటికిన్॥ ౧౭

పండిన జీవుం డటు దే
వుండయి లోన వెలుఁగు తనువును పరిశిష్టం
బుండినఁ బూనుచు భుక్తిన్
బండిన పండగుచు రాలఁ బట్టక యుండున్॥ ౧౮

శేషముఁబట్టి దేహమయి
చెందును భోగము పాపపుణ్య శై
లుషక నెట్టిదైన నగు
లుష్ట సమస్త సుఖా సుఖంబుగా
వేషమునంగ కించిగను
వెట్టిగ శుద్ధ మశుద్ధ మౌచు గం
దూషితమై వెలుంగు నెపు
డున్ బరికింపఁడు దాని నాత్ముఁడున్॥ ౧౯

యదు నవధూత సొక్కనిని
అద్భుత వర్తను గాంచెవాని మే
నని సికతన్ మునింగి మొగ
మన్నది యొక్కఁడె కానిపించె నే
మిది యని చూడ మానవుఁడె
యెట్లిటులుంటి రనంగఁ జెప్పె ని
ర్వది పయి నల్వురట్లు తన
వర్తనమున్ సరిదిద్దు వారలన్॥ ౨౦

అజగర మట్లె యొక్క యెడ
నన్య మెఱుంగక యుండు నెప్పుడో
యజ మొకఁడందు దానిగొని
యట్లె పడుండును చోటు మార్చ ద

క్కజముగ జీవయాత్ర కడ
గాంచును; దేహము నిల్చుటెల్ల క
ర్మజమగు భోగ ముండుటనె
మానదు నీ వెది చేయకుండినన్॥ ౨౧

అత్రికి ననసూయకు హరి
పుత్రుండయి దత్తుఁ డనగ పుట్టెను తచ్చా
రిత్ర మదెంతో విచిత్రము
గాత్ర స్థితిఁ జిత్ర చిత్ర గతులఁ జరించెన్॥ ౨౨

బాలోన్మత్త పిశాచ వత్తనుచుఁ జె
ప్పంజాలు యోగీశు లే
వేళన్ బొల్తురు భారతంబున, బహి
ర్వేషంబు మాత్రంబె యా
లీలన్ దోఁపఁ జరించు వ్యర్థులును పె
ల్లే యౌదు, రెవ్వారు దే
హాలంబంబున ముక్తులై మనెదరో
యంతై యఱుంగన్ వలెన్॥ ౨౩

గోపాలుం డెటువంటివాఁడొ యిటు నాం
కుం దోడుగా నుండె దా
దాపొక్కన్నిది వత్సరమ్ము లతఁ డే
దారిం జనన్ దోఁచి 'భూ
త్రీ పైసా' యనుఁ దోఁచినం తొసఁగ నెం
తే సంతసంబుం దు ౘా
వై పాతం డొక చూపు నిచ్చెనని చె
ప్పన్ వచ్చు ముమ్మాటికిన్॥ ౨౪

ఇట్టులె యెల్లవారు మది
నెన్నగవచ్చు, సముండతండు కా
బట్టి యదే నిజంబగును;
వానికి భేద మదేల యుండు? చూ
పట్టికి దేహముండు టొక
పట్టున దోఁచుటగాని యన్నిటన్
బట్టక పట్టు నాకసమె
వాఁడన వచ్చును స్వాత్మరూపతన్॥ ౨౫

దేవళమందు నందికడ,
తేకువ గుజ్జుపుసాని మంటపం
బావల, తేరు పీఠిపయి,
నంతట స్వామి పదంబు లెప్డు తో

డై వెలుఁగొందు రావికడ
నక్కడ నిక్కడ నేమి యొక్కఁడై
యేవెవియో వచించుచునె
యెప్పుడు తోఁచె మరన్ని నాళ్లులున్॥ ౨౬

అచ్చపు బ్రహ్మవేత్తయయి
యట్టి ప్రవర్తన మొప్పునా యటం
చిచ్చనిఁ కొక్క రీతిఁ బరి
కించుట మంచిదిగాదు బ్రహ్మ మం
దుచ్చము నీచమంట యెటు
లుండునుగా సమమౌచు నంతటన్
మచ్చగునే మణిన్ ముడిచి
మాసిన గుడ్డను దాచి పెట్టినన్॥ ౨౭

...కి విరుద్ధ వర్తనము
పల్వుర యందగుపించు దత్తుఁడే
సాకిరి త్రాగుబోతుగ ని
జప్రియ వీడని భోగిగాగ తా
నై కనవచ్చి యేమడుగ
నైనను రాళ్ళను వైచి తిట్టుచున్
బోకలు పోవువాఁడు విడు
పుం గస కంటిన కాచుచుండెడిన్॥ ౨౮

దేనికి దానికే సిజము
తెల్పుట మంచిద తానసహ్య వే
షానఁ జరించెగాని యొక
సారియు నెవ్వనికేని హాని నె
ద్దాని నొనర్పలే దతఁడు
దాగిన యోగి యటంచు నెందఱో
వానినె బాధపెట్టి రన
వచ్చును చిత్ర విచిత్ర రీతులన్॥ ౨౯

ఒకని మహత్త్వ మున్నపు డ
హో పరికింపక, పోయినంత వా
నికి నెనలేని భక్తి నతి
నిర్మల వృత్తి ననంత వైభవం
బొక భువినేమి యెల్లెడల
నుజ్జ్వలమౌ నటు సేయుచుంట యీ
చకిత మనస్కమైన నర
జాతికి నైజమయౌను నేటికిన్॥ 30

పింగళ కార్తికాన ప్రభ
  వించిన యుప్పెన దారుణంబు వా
ర్ధింగల బాడబంబె ప్రస
  రించి హరించెను ప్రాణికోటి యా
పొంగెడి సంద్రమున్ వినుట
  పోలదు నాకని యెంచెనేమొ ని
ర్లింగత నందె ధీరుఁడయి
  లేఁడన వచ్చునె యుండి యంతటన్॥ ౩౦

ఎంత విచిత్రమో యెఱుఁగ
  మీ పురి నాఁడు జగద్గురూత్తముల్
శాంతులు శారదా భజన
  సంగత చిత్తులు దేవళాన సు
స్వాంతత పూజసల్పు తటి
  సాధు శిరోమణి దేహమూడ్చె నూ
రంతయు నట్టివాని మహి
  తాత్మత నెంచి తపించె నాత్మలన్॥ ౩౨

సుఖమో దుఃఖమొ తీవ్రమైనపుడు చ
  క్షుస్సుల్ సరస్తుల్యమై
ముఖమున్ మూయుట సాజమిల్లె నభమే
  మూసెన్ మహాంభోదముల్ ;
మఖమన్నట్లుగ వాని దేహమున కం
  భస్స్నాన పూజా మహ
స్సుఖమై యంతిమ యాత్రసాగెను ప్రజా
  సందోహముల్ వెంటరాన్॥ ౩౩

నభమెల్లన్ బెను మేఘమై కరియుచుం
  డన్ దత్తితిక్షా సమా
రభ మాణాఖిల జీవ జాలమయి యా
  త్రంజేసె సద్వ్రజ స
న్నిభమౌ నాతని కాయ మా విభవ మ
  న్నింటన్ సముచ్చాయమై
రభసంచార మహోత్సవంబనగఁ దీ
  ర్థంబయ్యె పౌరాళికిన్॥ ౩౪

ఎవరున్ లేని బికారి ప్రేతమున కి
  ట్లే యింద్ర సౌభాగ్య వై
భవ సంయుక్త మహోత్సవం బగుటయే
  స్పష్టమ్ముగా తెల్పు న
య్యవధూతోన్నతి జీవమున్నపుడు లో
  యన్ నిల్చెనో యేమొ వా
రెవరో భక్తులు మాస్థలం బిడుదు మం
  దే యుంత మన్నన్ ప్రజల్॥ ౩౧

జయహో యంచు వచించికొంచుఁ జని శ
  శ్వన్ముక్తి సంధాయకా
క్షయ పుణ్యస్థలమై పురాణముని వా
  సంబైన లోబావిలో
జయ రామయ్య మహత్వ మెంచి యిడు దే
  శంబందు యోగీంద్రు ని
శ్చయ మొప్పన్ శయనింపఁ జేసిరట గో
  స్వామీ ! నమోవాకముల్॥ ౩౬

మనుజుల జీవితంబు లోక
  మాఁగిరి నుండవు హెచ్చు తగ్గులై
కనును సుఖా సుఖంబులను
  గర్భదరిద్రులు రాజు లౌటయున్
కనకమయాన్న పాత్రముల
  కాంచన గర్భులు బిచ్చమెత్తుటల్
కనెదము భోగ మెప్పుడెది
  కల్గునొ చెప్పగలేరు భూజనుల్॥ ౩౫

జనన మదేదనో ! బ్రదుకు
  సాగిన దెట్టులొ ? వచ్చి యిచ్చటన్
మనియెను మానవుండు
  విసు మానముగా తను విప్పుడెంతయో
ఘనత వహించి కట్టడము
  కాంచి సమస్త జనాళి పూజలన్
గొనుచుఁ బ్రశస్తమయ్యె నది
  గో యదె గొప్ప మనుష్య జాతికిన్॥ ౩౭

గోపాల గోస్వామి

బ్రదుకది యెట్లు సాగినను
ప్రాణము పోయిన యంత కీర్తిపై
బ్రదుకుటె గొప్ప దాని కిఁక
ప్రాణము పోవుట యుండ దెన్నడున్
ప్రిదిలెడి ప్రాణమున్ నిలుపఁ
బ్రీతిబడిన్ జరియించి శ్రేయమున్
వదలుటెగాని ప్రాణములు
వాయక నిల్చునె యెంతవారికిన్॥ ౩౯

పోయెడి ప్రాణ ముండగనె
ముక్తికి నై ప్రయతించి సాధులై
స్వీయ తనూస్థితిన్ జగము
శేషము శాంతిని సౌఖ్యమంద న
య్యో! యిఁక దోడుగా నిలువఁ
డో యని నిల్చిన వారలెంచు న
ట్లే యతి యుండు వాఁడె ఘనుఁ
డెల్లరకున్ బరమార్థ భూతుఁడౌ॥ ౪౦



# "స్త్రీ"

## శ్రీ ఎస్. హన్మంత్రావ్

స్త్రీ
నిన్ను కామినీ అనను
నా కళ్ళ పడికట్టు రాళ్ళతో
నీ సొగసుల్ని తూచను!....
స్త్రీ
నిన్ను రాణీ అనను
నా కన్రెప్పల మైదానాలపై
బారులు తీరిన
నల్ల యూనిఫాం ఆర్మీచే
నీకు సైనిక వందనం సమర్పించను!....
స్త్రీ
నిన్ను దేవతా అనను
నా కన్రెప్పల హస్తాల్ని
ముకుళించి నిన్ను గౌరవించను!....

స్త్రీ
నెచ్చెలి!....
ఈ ప్రపంచం
నాలుగు దిక్కుల్నించీ
వెలుతురు
అవతలకి పారిపోకుండా కాచేందుకు
నా రెండు కళ్ళకి
తోడుగా
నీ కళ్ళని
తోడు రమ్మంటున్నాను!

[చెలానికీ, స్త్రీకి - ప్రేమతో....]



## శ్రీ పి. సత్యనారాయణ

# భారతదేశ ఎన్నికల వ్యవస్థ

సమకాలీన ప్రపంచంలో ప్రజాస్వామిక వ్యవస్థ లేని రాజ్యాలు అతి స్వల్పం. రాజకీయ ప్రజాస్వామ్యం ఆధునిక రాజ్య లక్షణాలలో అత్యంత ప్రధానమయింది. మతం, కులం, వంశం, సంపదలు పాలకులకు ప్రాతిపదికలయ్యే రోజులు అంతరించాయి. ప్రజలందరి ఇష్టాయిష్టాలమీద పాలన జరుగుతున్న రోజులివి. ప్రజల కోర్కెల కనుగుణంగా ఏర్పడే రాజకీయ వ్యవస్థ ప్రజాస్వామ్యం. ప్రజాస్వామ్యం రెండు రకాలు : 1. ప్రత్యక్ష ప్రజాస్వామ్యం. 2. పరోక్ష ప్రజాస్వామ్యం. ప్రత్యక్ష ప్రజాస్వామిక వ్యవస్థ ప్రజానిర్ణయ సేకరణ (రిఫరెండం), అభిప్రాయ నివేదన (ఇనిషియేటివ్) పునరాయనం (రీకాల్) పద్ధతుల ద్వారా పని చేస్తుంది. ప్రత్యక్ష ప్రజాస్వామిక రూపం విస్తృత జనాభా, వైశాల్యం గల దేశాల్లో ఆచరణ సాధ్యంకాదు. ప్రత్యక్ష ప్రజాస్వామికం ఉన్న రాజ్యాలు నేటి ప్రపంచంలో లేవు. పరోక్ష ప్రజాస్వామ్యాన్ని ఆచరిస్తున్న కమ్యూనిస్టేతర దేశాల్లో పెద్దది భారతదేశం. పరోక్షప్రజాస్వామ్యపు కార్యసాధకత్వతకు సరయిన పార్లమెంటరీ పద్ధతిని ఆచరించింది. పార్లమెంటరీ పద్ధతిలో ప్రజలచే ప్రత్యక్షంగా ఎన్నిక కాబడే ప్రతినిధులు ప్రభుత్వాన్ని ఏర్పరుస్తారు, నడుపుతారు. ప్రాతినిధ్య విధానం (రిప్రెజెంటేషన్ సిస్టమ్) ప్రజాస్వామిక జీవనానికి మూలనాడి. ప్రజాస్వామ్యం నిజకడ ప్రాతినిధ్య విధాన సలక్షణం, సమ్రపత్వం మీద ఆధార పడుతుంది. స్వేచ్ఛాయుత వయోజన ఓటింగ్ పద్ధతి ప్రాతినిధ్య ప్రజాస్వామ్యానికి మూలాధారం. సార్వత్రిక వయోజన ఓటింగ్ హక్కు ప్రజలందరికి రాజకీయ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కలిగిస్తుంది. ఓటు హక్కును ప్రజలు సక్రమంగా ఉపయోగించుకొని నచ్చిన రాజకీయ శక్తులను పాలకులుగా చెయ్యొచ్చు. పాలకుల ప్రవర్తన సరిగ్గా లేకపోతే వారిని మార్చవచ్చు.

భారతదేశంలో స్వాతంత్ర్యానంతరం ఏడుసార్లు లోక్‌సభకు ఎన్నికలు జరిగాయి. రాష్ట్ర శాసనసభలకు అంతకంటె ఎక్కువ సార్లు ఎన్నికలు జరిగాయి. రాష్ట్రాల్లో రాజ్యాంగ యంత్రాంగం సరిగ్గా నడపనపుడు రాష్ట్రపతి పాలన ప్రవేశపెట్టే అవకాశం వల్ల, లోక్‌సభకు, శాసనసభలకు అన్నిసార్లు ఒకేసారి ఎన్నికలు జరగలేదు. పైగా రాజ్యసభకు, శాసనమండలులకు నిర్దేశితకాలాల్లో ఎన్నికలు జరుగుతున్నాయి. భారతదేశంలో 1952 నుండి ప్రశాంతంగా ఎన్నికలు జరగడం ప్రపంచ రాజకీయ చరిత్రలో అపూర్వ ఘట్టం. భారతదేశం చుట్టుఉన్న దేశాల్లో పెక్కింటిలో ఎన్నికలు సక్రమంగా జరగకపోవటం, ప్రాతినిధ్య విధానం విఫలం కావటం ప్రాతినిధ్య ప్రజాస్వామ్యస్థానే రకరకాల నియంతృత్వాలు ఏర్పడటం మనకు తెలిసిందే. భారతదేశంలో కేంద్రంలో, రాష్ట్రాల్లో రాజకీయాధికారం ఒకరి చేతులనుండి మరొకరి చేతుల్లోకి శాంతియుతంగా మారటం ప్రాతినిధ్య విధాన కార్యసాధకత్వాన్ని చాటుతుంది.

కేంద్ర, రాష్ట్ర శాసనసభలకు ఎన్నికలను నిర్వహించటానికి భారతరాజ్యాంగం స్వతంత్ర ప్రతిపత్తిగల ఎన్నికల సంఘాన్ని ఏర్పాటు చేసింది. కార్య నిర్వాహకశాఖ పెత్తనానికి గురికాకుండా ఉండేలా ఎన్నికల సంఘం ఏర్పాటు చేయబడింది. ఎన్నికలసంఘం 1950 ప్రజాప్రాతినిధ్య చట్టం ప్రకారం ఎన్నికలు నిర్వహిస్తుంది. విస్తృత, విశాల దేశంలో నిష్పక్షపాతంగా ఎన్నికలు జరిపించటం ఎంతో వ్యయప్రయాసలతో కూడినపని. ఇంతవరకు జరిగిన ఎన్నికల కొన్ని వివరాలు చూస్తే మనదేశ ఎన్నికల వ్యవస్థ విస్తృత రూపం తేటతెల్లమవుతుంది. పట్టిక-1లో లోక్‌సభకు ఇంతవరకు జరిగిన ఎన్నికల సమాచారం కొంత ఇవ్వబడింది. పట్టిక-2 లోక్‌సభ ఎన్నికల మీద అయిన ఖర్చు తెలుపుతుంది.

గత 30 సంవత్సరాలుగా ఎన్నికలు సక్రమంగా జరుగుతూ, ప్రాతినిధ్యం విధానం నిరాటంకంగా కొనసాగుతున్నా, ప్రజాస్వామిక దృక్పథానికి దేశంలో గట్టి పునాదులు ఏర్పడలేదు. రాజకీయంగా ప్రజాస్వామ్య రూపం ఉన్నా, ఆర్థికంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా ప్రజాస్వామ్యం నెలకొనలేదు. దీనికి కొంత కారణం మన ఎన్నికల వ్యవస్థ అని భావించక తప్పదు. ఎన్నికల వ్యవస్థ ప్రజల్లో చైతన్యస్థాయిని పెంచటానికి దోహదకంకాలేదని పెక్కురి అభిప్రాయం. ఎన్నికల వ్యవస్థలో అంతర్గతమైన కొన్ని ప్రధాన అసంగతాలను, వాటి ఫలితాలను పరిశీలిద్దాం.

సలక్షణ ప్రాతినిధ్య విధానంలో ఓటుహక్కు వున్న వారందరు ఎన్నికల్లో ఓటు వేయాలి. అంటే మన ఓటుహక్కు

ద్వారా తమ ప్రతినిధులను ఎన్నుకోవాలి. మన దేశంలో ఇంత వరకు జరిగిన సాధారణ ఎన్నికల్లో ఇలా జరగలేదు.

పట్టిక-3 ద్వారా ఇంతవరకు జరిగిన లోక్‌సభ ఎన్నికల్లో సగటున 45.68 శాతం ఓటర్లు తమ ఓటును వినియోగించుకోలేదని తెలుస్తుంది. అంటే లోక్‌సభలో ఓటర్లలో సగం మందికి ప్రాతినిధ్యం లేదన్నమాట. 1952, 1957 ఎన్నికల్లో ఓటుచేసినవారికంటే ఓటు చెయ్యని వారికే సంఖ్య ఎక్కువగా ఉండటం ఆశ్చర్యకర విషయం.

ఓటుచేసిన వారందరి ఓట్లు చెల్లకపోవచ్చు. నిరక్షరాస్యత, నిరుత్సాహంవల్ల ఓట్లు నిష్ప్రయోజనం అవుతాయి. మనఎన్నికల్లో చెల్లని ఓట్ల సంఖ్య తక్కువ ఏమీకాదు. 1957 లోక్‌సభ ఎన్నికల్లో 30 లక్షల ఓట్లు చెల్లలేదు. ఈ సంఖ్య అప్పటి అస్సాంరాష్ట్ర మొత్తం ఓటర్ల సంఖ్య కంటే ఎక్కువ. 1977 లోక్‌సభఎన్నికల్లో చెల్లని ఓట్ల సంఖ్య 5,307,617. ఈ సంఖ్య ఒరిస్సా రాష్ట్రపు మొత్తం చెల్లిన ఓట్లసంఖ్యకు సమానం. గత లోక్‌సభ ఎన్నికల్లో చెల్లని ఓట్ల సంఖ్య ఎలా ఉన్నదో పట్టిక-4 ద్వారా తెలుస్తుంది.

దేశమంతా ఓటింగ్ ఒకే రకంగా లేకపోవటం కూడా విశేషం. రాష్ట్రాల మధ్య తేడాలు రాజకీయ అసమానతకు దారి తీయవచ్చు. గరిష్ట, కనిష్ట ఓటింగ్ సమాచారం పట్టిక-5 లో ఇవ్వబడింది.

ఓటర్లు తమ ప్రతినిధులను ప్రత్యక్షంగా ఎన్నుకోవాలి. కాని వాస్తవంగా జరిగేది ఓటర్లు ఎన్నుకొనేది, పార్టీలు నుంచో పెట్టే అభ్యర్థులను మాత్రమే. పార్టీలకు చెందని, పార్టీలు నుంచో బెట్టని అభ్యర్థులు చాలా తక్కువ. ఒక రకంగా లోక్‌సభ, శాసన సభలు పార్టీల సభలుగా పేర్కొనవచ్చు. పార్టీ వ్యవస్థ మూలంగా ఏ పార్టీ అభ్యర్థికి ఎక్కువ వస్తాయో, ఆ పార్టీ గెలిచి అధికారం లోకి వస్తుంది. గతంలో పెక్కు సంవత్సరాలు అధికారం చెలాయించిన కాంగ్రెస్ పార్టీకి వచ్చిన ఓట్లశాతం. అది పొందిన స్థానాలు శాతం మధ్య ఉన్న అసమతౌల్యాన్ని పట్టిక-6లో చూడవచ్చు.

సగటున కాంగ్రెస్ పార్టీ మొత్తం ఓట్లలో 25.38 శాతం ఓట్లు పొందింది. చెల్లిన ఓట్లలో పొందిన ఓట్ల శాతం 44.38, పొందిన స్థానాలశాతం 69. ఓటర్లు సంఖ్యలో నాల్గవవంతు బలంతో కాంగ్రెస్‌పార్టీ కేంద్రంలో పాతిక సంవత్సరాలు పాలన సాగించిందన్న మాట. 1977 ఎన్నికల్లో అంతవరకు కాంగ్రెస్‌పార్టీ అనుభవించిన లాభాన్ని జనతాపార్టీ అనుభవించింది. జనతాపార్టీ మొత్తం ఓట్లలో పొందిన ఓట్ల శాతం 43.17. పొందిన స్థానాల శాతం 54.93. ప్రస్తుత ఎన్నికల విధానంవల్ల మొత్తం ఓట్లలో తక్కువ ఓట్లు పొందిన పార్టీకి అధికార పార్టీ కావటం, ఓట్ల నిష్పత్తిలో పార్టీలకు స్థానాలు రాకపోవటం జరుగుతుంది. 1952 నుండి 1971 వరకు జరిగిన లోక్‌సభ ఎన్నికల్లో కాంగ్రెసేతర పార్టీలకు సగటున 26.40 శాతం ఓట్లతో వచ్చిన స్థానాల శాతం 15.62 కాగా, కాంగ్రెస్‌కు 44.38 శాతం ఓట్లతో 69 శాతం స్థానాలు లభించాయి. 1977 ఎన్నికల్లో జనతా + కాంగ్రెస్ ఫర్ డెమోక్రసీ కాక ఇతర పార్టీలు 50.81 శాతం ఓట్లు సంపాదించి 43.04 శాతం స్థానాలను సంపాదించగలిగాయి. అంటే ఓట్లు ఎక్కువ వచ్చినా స్థానాల విషయంలో దానికి సమానమైన స్థానాలను పొందలేదు.

ఎన్నికల్లో మొత్తం ఓట్లలో ఎక్కువ భాగం పొందినవారు లేక చెల్లిన ఓట్లలో ఎక్కువ భాగం పొందినవారు ఎన్నికయినట్లు ప్రకటించబడరు. పోటీచేసిన వారందరిలో ఎవరికి ఎక్కువ ఓట్లు వస్తే వారే ఎన్నికయినట్లు ప్రకటించబడును. మొత్తం ఓట్లలో ఎక్కువ భాగం పొందనివారుకూడా శాసనసభల్లో ప్రవేశించే అవకాశం ఉన్నది. 1971 లోక్‌సభ ఎన్నికల తర్వాత ఏర్పడిన లోక్‌సభలోని 518 స్థానాలు అలంకరించిన వారిలో 354 మందికి మాత్రమే చెల్లిన ఓట్లలో 50 శాతం ఓట్లుపైన వచ్చినవారు. 164 మంది సభ్యులు 50 శాతంకన్నా తక్కువ ఓట్లు సంపాదించారు.

## ఎన్నికల వ్యవస్థలోని లోపాల సమస్యలు

పై వివరణ ద్వారా మన ప్రస్తుత ఎన్నికల విధానంలో పెక్కు లోపాలున్నాయని తెలుస్తుంది. పైన పేర్కొన్నట్లు ముఖ్యమయిన లోపాలు : 1. ఓటుహక్కు ఉన్న వారందరూ ఓటు హక్కును వినియోగించుకోవటం, 2. వేసే ఓటు నిష్ప్రయోజనం కావటం, 3. ఓటింగ్ మధ్య ప్రాంతాల మధ్య తేడా ఉండటం, 4. మొత్తం ఓట్లలో తక్కువ ఓట్లువచ్చినా గెలవటం, 5. మొత్తం ఓట్లలో సగంకన్నా ఎక్కువ పొందని పార్టీలు అధికారానికి రావటం. ఈ లోపాలతోపాటు ఇంకెన్నో లోపాలున్నాయి, గత కొన్ని సంవత్సరాలుగా లోపాల నివారణకు తీసుకోవలసిన చర్యలపై చర్చ జరుగుతుంది. ఈ లోపాలలో కొన్ని మనం అనుసరించే ప్రాతినిధ్య పద్ధతి నుండి సంక్రమించేవి. ప్రస్తుత పద్ధతి స్థానే దామాషా ప్రాతినిధ్య పద్ధతి ప్రవేశపెట్టాలని కొందరు భావిస్తున్నారు. దామాషా పద్ధతి వలన తమ కొచ్చే ఓట్ల నిష్పత్తిలో స్థానాలు కొన్ని వస్తాయని రాజకీయ పార్టీలు నమ్మటంవల్ల దామాషా పద్ధతే కావాలని కొన్ని పార్టీలు కూడా కోరుతున్నాయి.

దామాషా పద్ధతిలో పలురకాలున్నాయి. ఏ రకం ఎలా పని చేస్తుందో, ఏ ప్రయోజనం చేకూరుతుందే ఎవరికీ స్పష్టంగా తెలియకపోయినా, దామాషా పద్ధతి కావాలనే పెక్కురు కోరటం విశేషం. ఏ ఎన్నికల విధానమయినా స్వతహాగా పూర్తిగా లోపభూయిష్టమయింది కాజాలదు. ఒక దేశంలో సక్రమంగా పనిచేసిన విధానం మరొక దేశంలో అదే రీతిలో పనిచేయకపోవచ్చు. ఒకదేశ రాజకీయ, సాంఘిక, ఆర్థిక పరిస్థితులు, ప్రభావాలు ఆధారంగా ఎన్నికల పద్ధతి ఆచరింపబడుతుంది. దేశాలన్నింటిలో పరిస్థితులు ఒకే రకంగా ఉండవుగాన ఒక ఎన్నికల పద్ధతి అన్నిదేశాల్లో ఒకే రకమైన ఫలితాలను ఇస్తుందని భావించరాదు. ప్రస్తుత పద్ధతికి మన ఓటర్లు మొదటి ఎన్నికలనుండి అలవాటు పడ్డారు. స్వాతంత్ర్యానికి పూర్వం కూడా పరిమిత ఓటింగ్‌హక్కు ఉన్నా, ఈ పద్ధతినే అవలంబించారు. దామాషా పద్ధతి ఏ పెద్ద ప్రజాస్వామిక దేశంలోనూ అమలులోలేదు. 1958లో ఫ్రాన్సులో అయిదవ రిపబ్లిక్ పతనానికి హిట్లర్ పార్టీ ఆవిర్భవానికి, దారి తీసిన ముఖ్య కారణాలలో ఒకటి పేర్కొంటారు. చిన్న చిన్న ఐరోపా రాజ్యాలలో దామాషా పద్ధతి పలురకాల్లో అమలులో ఉన్నా వాస్తవంలో ఆ దేశాల ఎన్నిక విధానం ఇతర దేశాల ఎన్నికల విధానంకన్నా ఉన్నతమయినదని చెప్పడానికి ఆధారాలులేవు. కాంగ్రెస్‌పార్టీ అధికారంలో ఉన్నప్పుడు ఆ పార్టీ ఆధిపత్యాన్ని తగ్గించాలనే దృష్టితో ప్రతిపక్షాలు తమకూ కొంత అధికారం కావాలనే వాంఛతోనే దామాషా పద్ధతిని కోరడం జరిగింది. దేశరాజకీయ వ్యవస్థ స్థిరత్వానికి ఇది ఎంతవరకు తోడ్పడుతుంది అనే విషయంపై కూలంకషంగా చర్చ జరగవలసి ఉంది. మనదేశంలో దామాషా పద్ధతి అమలు ద్వారా చిన్న చిన్న పార్టీల సంఖ్య పెరగవచ్చు. పార్టీల మార్పిడి, కుల, మత, ప్రాంతీయతత్వాలు పెరగవచ్చు. సంకీర్ణ ప్రభుత్వాలు అధికంగా ఏర్పడవచ్చు. ఒక పార్టీపెత్తనాన్ని అంతం చేయడానికి జరిగే కృషి జాతీయ జీవనాన్ని, సాంఘిక స్థిరత్వాన్ని భంగం చేయవచ్చు. ప్రజాస్వామిక విలువల పరిరక్షణకై స్వల్ప ప్రయోజనాల వైపు దృష్టిని కేంద్రీకరించటం ఉచితం. ప్రస్తుత విధానంలోనే తగు మార్పులు చేసి, అది కార్యసాధకంగా పనిచేసేటట్లు చూడవచ్చు. ప్రస్తుత విధానంలో చేయవలసిన మార్పులకు సంబంధించిన విషయాలు పెక్కు. అందులో ముఖ్యమైనవి:

1) ఓటింగ్ హక్కుకి వయస్సు, 2) పార్టీల మార్పిడి, 3) ఎన్నికల సంఘం నిర్మాణం, 4) ఎన్నికల ఖర్చు, 5) ప్రభుత్వ అధికార వినియోగం, 6) అభ్యర్థుల అనర్హతలు, 7) శాసన సభల రద్దు, 8) మంత్రివర్గ పరిమాణం, 9) ఎగువ సభల ఆవశ్యకత, 10) ఓటరకు ప్రతినిధుల బాధ్యత.

## రాజకీయ పార్టీల సూచనలు

కమ్యూనిస్టు పార్టి సూచనలు: 1) 18 సంవత్సరాల వయస్సు లందరికి ఓటింగ్ హక్కు ఉండాలి. 2) ప్రస్తుత ఎన్నికల విధానం స్థానే జాబితా పద్ధతితో కూడిన దామాషా విధానాన్ని ప్రవేశపెట్టాలి. 3) కొత్త పద్ధతిలో షెడ్యూల్ కులాలకు, వర్గాలకు, స్త్రీలకు రిజర్వేషన్ ఉండాలి. స్త్రీలకు 15 శాతం రిజర్వేషన్ ఉండాలి. 4) ప్రజా ప్రతినిధులను వెనుకకు పిలిపించే అధికారం ప్రజలకు ఉండాలి. 5) ఒక శాసన సభ్యుడు తన పార్టీని వదిలి వేరే పార్టీలో చేరినా లేక స్వతంత్రుడుగా ఉన్నా అతని శాసన సభా సభ్యత్వం రద్దు పరచాలి. స్వతంత్రుడు ఒక పార్టీలో చేరితే అతని సభ్యత్వం రద్దుపరచాలి. 6) భయాందోళనలు లేని పరిస్థితులలో ఓటరు ఓటు చేసేట్లు చూడాలి. 7) గుత్తదారులు, పెట్టుబడిదారులు, భూస్వాములు ప్రభుత్వాద్యోగులు ఓటర్లను ప్రభావితం చేయకుండాచూడాలి. 8) 5 లక్షల ఓటర్లకు ఒక ప్రతినిధి ఉండేలా పార్లమెంటుసభ్యుల సంఖ్యకు పెంచాలి. 9) ఎన్నికల రోజున ప్రభుత్వ కార్యనిర్వహణపై నడిచే వాహనాలను తప్ప ఇతర వాహనాలను నడపనీయరాదు. 10) ఎన్నికల రోజుకు మూడు రోజుల ముందే మత్తుపానీయాల అమ్మకాన్ని నిషేధించాలి. 11) ఎన్నికల సంఘం త్రిసభ్యసంఘంగా ఉండాలి. పార్లమెంటు సభ్యులలో అధిక సంఖ్యాకులు ఆమోదించిన వ్యక్తులను ఎన్నికల సంఘం సభ్యులుగా రాష్ట్రపతి నియమించాలి. 12) ఎన్నికల ఫలితాలు ప్రకటించిన ఆరునెలల్లో ఎన్నికలవివాదాలు పరిష్కారం కావాలి. 13) రాజకీయ పార్టీలు పెట్టే ఖర్చు ఎన్నికల ఖర్చుగా భావించరాదు. అభ్యర్థుల పేర్లు నియోజక వర్గాల పేర్లు లేకుండా పార్టీలు ప్రచురించే ఎన్నికల సాహిత్యంపై ఖర్చును అభ్యర్థులకు అనుమతించబడిన ఖర్చుతో భాగంకాదు. 13) పబ్లిక్, ప్రయివేట్ కంపెనీలు పార్టీలకు, అభ్యర్థులకు ఎన్నికల కోసం విరాళాలు ఇవ్వకుండా నిషేధించాలి. 14) ఎన్నికల ప్రకటన నుండి ఎన్నికలు ముగిసేవరకు కొత్త ఆర్థిక కార్యక్రమాలను, సంక్షేమ కార్యక్రమాలను ప్రభుత్వం ప్రకటించరాదు. 15) ఎన్నికల ప్రచారానికి కావలసిన ఓటర్ల గుర్తింపు పత్రాలు మొదలయిన వాటిని ప్రభుత్వం ఉచితంగా అందచేయాలి. 16) దూరదర్శిని, ఆకాశవాణి ప్రసారాలలో ఎన్నికల ప్రచారానికి వివిధ పార్టీలకు అవకాశం ఉండాలి. 17) నియోజక వర్గాల పునర్ విభజన సంఘంలో రాజకీయ పార్టీలకు ప్రాతినిధ్యం ఉండాలి. 18) శాసన సభ రద్దు అయిన ఆరునెలలలోనే ఎన్నికలు జరగాలి. 48) మంత్రి వర్గానికి అధిక సంఖ్యాకుల బలం ఉన్నదా లేనిదా శాసన సభలోనే తేలాలి. 20) మంత్రుల సంఖ్య శాసన సభ్యుల సంఖ్యలో 1/10 వంతుకు దాటరాదు. 21) రాష్ట్రాలలో ఎగువసభల అవసరంలేదు. ప్రస్తుత రూపంలో రాజ్యసభ కొనసాగరాదు. 22) ఎన్నికల విధా

నాన్ని, నడవడిని సమీక్షించేందుకు ఎన్నికల సంఘానికి సహాయ పడేందుకు జాతీయ స్థాయిలో రాజకీయ పార్టీల ప్రతినిధులతో కూడిన ఒక సలహా సంఘం ఏర్పాటు కావాలి.

మార్క్సిస్టు పార్టీ సూచనలు: 1) కేంద్రంలో, రాష్ట్రాల్లో ఏకసభ్య ఎన్నికల సంఘం స్థానే బహుసభ్య సంఘాలు ఉండాలి. 2) ఎన్నికల సంఘం పనిని పర్యవేక్షించడానికి ఎన్నికల్లో పాల్గొనే పార్టీల ప్రతినిధులతోకూడిన పర్యవేక్షక సంఘాల ఎన్నికల సంఘం స్థాయినుండి పోలింగ్ స్టేషన్ స్థాయివరకు ఉండాలి. 3) ఎన్నికల ప్రచారంలో అభ్యర్థులు వాడే వాహనాల సంఖ్యపై పరిమితి ఉండాలి. 4) ఓటింగ్ వయస్సు 18 సంవత్సరాలకు తగ్గించాలి. 5) దామాషా పద్ధతి ప్రవేశ పెడితే పార్టీల మార్పిడిని విరోధించవచ్చు.

జన సంఘం సూచనలు: 1) ఎన్నికలు ప్రస్తుత మెజారిటీ పద్ధతి ద్వారానూ, దామాషాపద్ధతి ద్వారానూ కలిపి జరపాలి. శాసన సభలో 1/3 వంతు స్థానాలను ప్రస్తుత పద్ధతి ద్వారా, 2/3 వంతు దామాషా పద్ధతి ద్వారా పూర్తిచేయాలి. 2) రాష్ట్రాలలో ఎగువ సభలను రద్దుచేయాలి. 3) అభ్యర్థుల ముఖ్యమయిన ఎన్నికల ఖర్చును ప్రభుత్వమే భరించాలి. 4) రాజకీయ పార్టీలకు ఎన్నికలకై గ్రాంట్లు ఇవ్వాలి. 5) ఎన్నికలకు 2 నెలల ముందు పదవుల నుండి తొలగాలి. 6) టెలివిజన్, రేడియో కార్యక్రమాల్లో వివిధ రాజకీయ పార్టీల ప్రచారానికి అవకాశం కల్గించాలి. 7) ఎన్నికయిన ప్రతినిధులను తిరిగి వెనుకకు పిలిచే అవకాశం ఉండాలి. 8) ఓటింగ్ వయస్సు 18 సంవత్సరాలు ఉండాలి. 9) ఎన్నికల సంఘం బహుసభ్య సంఘంగా ఉండాలి. పదవీ విరమణ చేసిన ప్రభుత్వోద్యోగులను ఎన్నికల సంఘం సభ్యులుగా నియమించరాదు. సుప్రీంకోర్టు జడ్జీలు కాదగిన వారినే ఎన్నికల సంఘం సభ్యులుగా నియమించాలి.

తార్కుండే సంఘం సూచనలు: 1974 అగస్టులో జనతంత్ర సమాజ్ తరపున జయప్రకాశ్ నారాయణ ఎన్నికల విధానంలో మార్పులు సూచించడానికై వి. ఎం. తార్కుండే, ఎం. ఆర్. మసానీ, పి. జి. మవులాంకర్, ఎ. జి. కూరానీ, కె. డి. దేశాయ్, ఇ. పి. డబ్ల్యు. డాకోస్టా సభ్యులతో ఒక సంఘాన్ని ఏర్పరచాడు. ఈ సంఘం తార్కుండే సంఘంగా వాడుకలోకి వచ్చింది. 1975 ఫిబ్రవరిలో ఈ సంఘం విపులమైన నివేదికను తయారుచేసి జయప్రకాశ్ నారాయణకు సమర్పించింది.

ఎన్నికల విధానంలో సంస్కరణల గురించి ఈ సంఘం పలువురి అభిప్రాయాలను సేకరించటమేకాక, 150 వినతి పత్రాలను కూడా పరిశీలించింది. ఒక్క కాంగ్రెస్ తప్ప మిగిలిన పార్టీలన్నీ తమతో సహకరించి ఎన్నికల సంస్కరణలపై తమ తమ భావాలను సూచనలను తెలియజేసినట్లు ఈ సంఘం తన నివేదికలో వెల్లడించింది.

వివిధ రకాలైన ఎన్నికల పద్ధతుల గురించి ముందుగా ప్రజలలో విస్తృతంగా చర్చలు జరిగిన తరువాతనే ఏదో ఒక విధానాన్ని అనుసరించాలని భావించి ప్రస్తుత పద్ధతికి ప్రత్యామ్నాయ విధానాన్ని ఈ సంఘం సూచించలేదు. కాని ప్రభుత్వ ఎన్నికల విధానంలో వెంటనే రావలసిన మార్పులను సూచించింది. సూచనలలో ముఖ్యమైనవి.

1) ఎన్నికలు స్వేచ్ఛగాను, న్యాయంగాను జరిగేటట్లు చూడటానికై ఎన్నికల కమీషన్ వ్యవస్థలో మార్పులు ఎన్నికలలో ధన ప్రభావాన్ని అరికట్టటం, అధికార యంత్రాంగాన్ని పార్టీ ప్రయోజనాల కోసం దుర్వినియోగం చేయటాన్ని అరికట్టటం, రేడియోను, టెలివిజన్‌ను అధికారపక్షానికి ఎన్నికల ప్రచార సాధనాలుగా వినియోగించుకొనకుండా అరికట్టటం అవసరం.

2) ఎనికల కమీషన్‌లో ప్రస్తుతం ఉన్న ఒక సభ్యునికి బదులు ముగ్గురు సభ్యులు కలిగి స్వతంత్ర ప్రతిపత్తి గల సంస్థగా ఉండాలి.

3) ప్రధాని, లోక్‌సభలో ప్రతిపక్ష నాయకుడు (లేక ప్రతిపక్షాలు ఎన్నుకొన్న సభ్యుడు) సుప్రీంకోర్టు ప్రధానన్యాయమూర్తి సభ్యులుగా ఉండే ఒక సంఘం చేసే సిఫారసుల ప్రకారం ఎన్నికల కమిషన్‌లో సభ్యులను రాష్ట్రపతి నియమించాలి.

4) రాజకీయ పక్షాలకు కంపెనీలు విరాళాలు ఇవ్వటంపై ప్రస్తుతం ఉన్న నిషేధాన్ని తొలగించరాదు. రాజకీయ పార్టీలు ప్రచురించే ప్రత్యేక సంచికలకు కంపెనీలు ప్రకటనలు ఇవ్వడంపై కూడా నిషేధం విధించాలి.

5) ఎన్నికలలో అభ్యర్థులు వేసే వ్యయంలో అధిక భాగాన్ని ప్రభుత్వమే భరించాలన్న సూచన ఆచరణసాధ్యం కాదు. అయితే అభ్యర్థులకు, వోటర్లకు కూడా ప్రభుత్వం కొన్ని సౌకర్యాలు కల్పించాలి.

6) ఎన్నికలలో ధన ప్రభావాన్ని నిర్మూలించటం అత్యవసరం. అభ్యర్థి వ్యయంపై పరిమితిని ప్రస్తుతపు స్థాయి కంటే

రెట్టింపు చేయాలి. అయితే రాజకీయ పార్టీలు తమ అభ్యర్థుల తర పున చేసే వ్యయాన్ని కూడా అభ్యర్థి వ్యయంగా పరిగణించి, ఈ పరిమితి పరిధిలోనికి తేవాలి.

7) శాసన సభలోగాని, పార్లమెంటులోగాని ఒక స్థానం ఖాళీ అయినప్పుడు తిరిగి ఉప ఎన్నికను ఆరు మాసాలలోగా జరిపి తీరాలన్న నిబంధన అవసరం. ప్రభుత్వం పార్లమెంటునుగాని, శాసన సభనుగాని రద్దు చేసినట్లు ప్రకటించిన నాటినుండి ఎన్నికలు జరిగే తేదీ వరకు కేవలం ఆపద్ధర్మ ప్రభుత్వంగా మాత్రమే వ్యవహరించాలి. ఈ కాలంలో ముఖ్యమైన విధానాలకు సంబంధించిన నిర్ణయాలు తీసుకొనటం కొత్త ప్రాజెక్టులు చేపట్టటం, వాగ్దానాలు చేయటం, మొదలైనవేమీ జరగరాదు.

8) రేడియోను, టెలివిజన్‌నుకూడా స్వతంత్ర ప్రతిపత్తి గల సంస్థలుగా మార్పు చేయాలి. వివిధ రాజకీయ పార్టీలు రేడియో, టెలివిజన్‌ల ద్వారా ప్రచారం చేసుకొనటానికై, ఆ పార్టీలకు లభించిన ఓట్లు నిష్పత్తి ప్రకారం సమయం, అవకాశం కల్పించాలి. ఎన్నికల కార్యక్రమం ప్రకటించిన తేదీనుండి ఎన్నికల తేదీ వరకు రేడియో, టెలివిజన్ ప్రసార కార్యక్రమాలకు ప్రత్యేకంగా సలహా సంఘాలను నియమించాలి. ఇందువలన అధికార పక్షం ప్రసార కార్యక్రమాలను తన స్వప్రయోజనాలకు దుర్వినియోగం చేసుకొనకుండా అరికట్టటం సాధ్యం అవుతుంది.

9) బ్యాలెట్ పత్రాలపై ఓటర్లు సంతకం చేసే విధానాన్ని రద్దుచేయాలి. నియోజక వర్గంలోని బ్యాలెట్ పెట్టెలన్నీ ఒక కేంద్రానికి చేర్చిన వెంటనే జాప్యం లేకుండా ఓట్లు లెక్కింపును ప్రారంభించాలి.

ప్రధాన ఎన్నికల అధికారి సూచనలు : ఎన్నికలవిధానంలో సంస్కరణల ఆవశ్యకత అన్న అంశంపై 1978 నవంబరులో బెంగుళూరులో జరిగిన ఒక సదస్సులో ఎన్నికల ప్రధానకమీషనర్ ఎస్. ఎల్. షక్ధర్ ఎన్నికల సంస్కరణలపై కొన్ని సూచనలు చేశారు. ఆ సూచనలలో ముఖ్యమైనవి : 1) రాజకీయ పార్టీలు సక్రమంగా ప్రజాస్వామ్య బద్ధంగా పనిచేసేటట్లు చూడటానికి పార్లమెంటు ఒక చట్టం చేయాలి. 2) రాజకీయ పార్టీలు జమా ఖర్చులు తెలియాలి, వాటిపై ఆడిట్ జరగాలి. 3) ఓటర్ల జాబితాను ఎప్పటికప్పుడు తాజాగా ఉంచడానికి ఏటా జనవరి, ఏప్రిల్, జూలై, అక్టోబరు మాసాలలో వాటిని సవరించాలి. 4) పార్లమెంటు, శాసన సభలలోను గల స్థానాలలో 50 శాతం ప్రస్తుత ప్రాతినిధ్య విధానం ద్వారా ఎన్నికైన అభ్యర్థులతో, మిగిలిన 50 శాతం స్థానాలను రాజకీయ పార్టీలు సంపాదించే ఓట్లశాతాన్ని బట్టి భర్తీ చేయాలి. 5) ఎన్నికల సాహిత్యం ముద్రణ క్రింద, ఎన్నికల ఏజంట్లకు చెల్లించే మొత్తం కింద అభ్యర్థులకు అయ్యే ఎన్నికల ఖర్చును ప్రభుత్వమే భరించాలి. 6) ఓటింగ్ హక్కు వయోపరిమితిని 21 సంవత్సరాల నుండి 18 సంవత్సరాలకు తగ్గించాలి. 7) ఎన్నికల ముందు రాష్ట్రాలలో రాష్ట్రపతి పాలనను విధించాలి. దీనివల్ల వివిధ పార్టీలకు సమానావకాశాలు లభించి స్వేచ్ఛగా, న్యాయంగా ఎన్నికలు జరగటానికి వీలుంటుంది. 8) ఎన్నికలలో నిలబడే స్వతంత్రులు ఒకసారి మొత్తం ఓటర్ల సంఖ్యలో కనీసం 10 శాతం ఓట్లనయినా సంపాదించుకోలేని పక్షంలో అటుపైన జరిగే ఎన్నికలలో పోటీ చేయనీయరాదు.

## కేంద్ర మంత్రి మండలి ఉప సంఘం

జనతాపార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత అత్యవసర పరిస్థితి కాలంలో ఎన్నికల చట్టంలో వచ్చిన మార్పులను రద్దుచేసింది. దేశానికి స్థిరమైన, సమమైన ఎన్నికల విధానం ఉండేందుకై ప్రస్తుత ఎన్నికల చట్టాలలో, పాలనా పద్ధతులలో మౌలికమైన మార్పులు సూచించడానికై జనతా ప్రభుత్వం అప్పటి హోం మంత్రి చరణ్‌సింగ్ అధ్యక్షతన, మంత్రిమండలి ఉప సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఆ ఉపసంఘం, మొరార్జీ దేశాయ్ మంత్రివర్గం నుండి 1978 జూన్‌లో చరణ్‌సింగ్ రాజీనామా చేసేవరకు సమావేశం కాలేదు. అటు తర్వాత ఆ ఉపసంఘం అప్పటి ప్రధాన మంత్రి మొరార్జి దేశాయ్ నాయకత్వాన పునర్నిర్మించబడి 1979 ఫిబ్రవరిలో మొదటి సారిగా సమావేశమయింది. ఉపసంఘం ఎన్నికల సంస్కరణపై తుది సూచనలలోగా మొరార్జీ ప్రభుత్వం రాజీనామా చేయటం జరిగింది.

## ఎన్నికల సంఘం ఏర్పాటు చేసిన ఉపసంఘం

రాష్ట్ర, జిల్లా, స్థానిక స్థాయిలలో ప్రస్తుత ఎన్నికల యంత్రాంగాన్ని పరిశీలించి, ఆయాస్థాయిల్లో ఉండవలసిన సక్రమ ఎన్నికల యంత్రాంగం నమూనాను సూచించేందుకు ఎన్నికల సంఘం 1979 మొదటి భాగంలో కర్ణాటక రాష్ట్ర ప్రధాన ఎన్నికల అధికారి అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించింది. ఎన్నికల నిర్వహణ, ఓటర్ల జాబితాల తయారీ, తదితర అంశాలు సంఘం పరిశీలనాంశాల్లో ఉన్నాయి.

పట్టిక - 1

లోక్‌సభ ఎన్నికల వివరాలు

| ఎన్నికల సంవత్సరం | లోక్‌సభ సాధనాలు | పోటీచేసిన అభ్యర్థుల సంఖ్య | ఓటర్ల సంఖ్య | పోలింగ్ కేంద్రాల సంఖ్య |
|---|---|---|---|---|
| 1952 | 489 | 1874 | 17,32,13,635 | 1,32,560 |
| 1957 | 494 | 1519 | 19,36,52,069 | 2,20,478 |
| 1962 | 494 | 1985 | 21,63,72,215 | 2,38,568 |
| 1967 | 520 | 2369 | 25,03,12,239 | 2,67,555 |
| 1971 | 518 | 2784 | 27,43,33,925 | 3,42,944 |
| 1977 | 542 | 2439 | 32,11,75,327 | 3,73,908 |
| 1980 | 542 | 4616 | 36,13,27,515 | 4,37,16[illegible] |

పట్టిక - 2

లోక్‌సభ ఎన్నికల నిర్వహణ ఖర్చు

| ఎన్నికల సంవత్సరం | ఖర్చు: రూపాయిల్లో |
|---|---|
| 1952 | 10,45,47,099 |
| 1957 | 5,90,21,786 |
| 1962 | 7,31,58,000 |
| 1967 | 10,95,33,772 |
| 1971 | 14,43,04,625 |
| 1977 | 29,81,40,964 |

1957 ఎన్నికల నుండి ఓటర్ల జాబితాలను ఎప్పటికప్పుడు మార్పు చేయటానికయిన ఖర్చు ఇచ్చట చేర్చలేదు.

పట్టిక - 3

లోక్‌సభ ఎన్నికల్లో ఓటు చేయని వారు

| ఎన్నికల సంవత్సరం | ఓటు చేయనివారి శాతం |
|---|---|
| 1952 | 54 33 |
| 1957 | 52.26 |
| 1962 | 44 58 |
| 1967 | 38.67 |
| 1971 | 44 78 |
| 1977 | 39.46 |
| 1980 | 43.20 |

పట్టిక - 4

లోక్‌సభ ఎన్నికల్లో చెల్లని ఓట్లు

| ఎన్నికల సంవత్సరం | చెల్లని ఓట్ల సంఖ్య |
|---|---|
| 1957 | 30,09,498 |
| 1962 | 47,22,548 |
| 1967 | 68,30,460 |
| 1971 | 49,19,788 |
| 1 77 | 53,07,617 |
| 1980 | 48,84,424 |

పట్టిక - 5

లోక్‌సభ ఎన్నికల్లో ఓటింగ్‌లో వ్యత్యాసాలు

| ఎన్నికల సంవత్సరం | గరిష్ట ప్రాంతం | ఓటింగ్ శాతం | కనిష్ట ప్రాంతం | ఓటింగ్ శాతం |
|---|---|---|---|---|
| 1957 | కేరళ | 66 56 | ఒరిస్సా | 36.11 |
| 1962 | కేరళ | 70 55 | ఒరిస్సా | 23.56 |
| 1967 | మద్రాస్ | 76 56 | ఒరిస్సా | 43.70 |
| 1 1 | తమిళనాడు | 71.82 | హి.ప్రదేశ్ | 41.16 |
| 1977 | లక్షదీవులు | 84.64 | ఒరిస్సా | 44 32 |
| 1980 | లక్షదీవులు | 88.78 | సిక్కిం | 44.86 |

పట్టిక - 6

లోక్‌సభ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ ఓట్ల బలం

| ఎన్నికల సంవత్సరం | మొత్తం ఓటుల్లో పొందిన ఓట్ల శాతం | చెల్లిన ఓట్లలో పొందిన ఓట్ల శాతం | పొందిన లోక్‌సభ సాధనాల శాతం |
|---|---|---|---|
| 1952 | 27.52 | 44.99 | 74.44 |
| 1957 | 28.70 | 47.78 | 75.10 |
| 1962 | 23.86 | 44.72 | 73.08 |
| 1967 | 23.51 | 40.73 | 54.44 |
| 1971 | 23.34 | 40.67 | 67.95 |
| 1977 | 20.34 | 34.54 | 27.51 |
| 1980 | 23.60 | 43.00 | 66.86 |

## ఉ ప యు క్త ర చ న లు


1. జి. జి. మీర్ చందాని : ది పీపుల్స్ వెర్డిక్ట్, వికాస్ పబ్లిషర్స్, న్యూఢిల్లీ, 1980.
2. రాబర్ట్ ఎల్ హర్ట్ గ్రేవ్ : ఇండియా గవర్నమెంటు అండ్ పాలిటిక్స్ ఇన్ ఎ డెవలపింగ్ నేషన్, ఫ్రీమాన్ బుక్ కంపెనీ, ఢిల్లీ, 1979.
3. డబ్ల్యు. హెచ్. మారిస్ జోన్స్ : గవర్నమెంటు అండ్ పాలిటిక్స్ ఇన్ ఇండియా, హచిన్సన్, లండన్, 1967.
4. నార్మన్ డి పామర్ : ది ఇండియన్ పొలిటికల్ సిస్టమ్, హటన్ మిఫ్లిన్, న్యూయార్కు, 1970
5. రిచర్డ్ ఎల్ పార్క్ : ఇండియాస్ పొలిటికల్ సిస్టమ్, ప్రెంటిస్ హాల్, న్యూజెర్సీ, 1967.
6. ఎస్. పి. వర్మ & సి. పి. భాంభ్రి : ఎలక్షన్స్ అండ్ పొలిటికల్ కాన్షస్‌నెస్ ఇన్ ఇండియా, మీనాక్షి ప్రకాశన్, మీరట్, 1967
7. ఆర్. చండీదాస్ : ఇండియా ఓట్స్-ఎ సోర్స్ బుక్ ఆన్ ఇండియన్ ఎలక్షన్స్, పాప్యులర్ ప్రకాశన్ బొంబాయి, 1968
8. ఆర్. పి. భల్లా : ఎలక్షన్స్ ఇన్ ఇండియా, ఎస్. చాంద్, న్యూఢిల్లీ, 1973
9. ఇక్బాల్ నారాయణ్ : ఎలక్షన్ స్టడీస్ ఇన్ ఇండియా, ఎలయిడ్ పబ్లిషర్స్, బొంబాయి, 1978
10. సిటిజన్స్ ఫర్ డెమొక్రసీ : రిపోర్ట్ ఆఫ్ కమిటీస్ ఆన్ ఎలక్టోరల్ రిఫార్మ్స్ అండ్ ఎలక్షన్ ఎక్స్‌పెన్సెస్, న్యూఢిల్లీ
11. పి. సత్యనారాయణ అండ్ జగదీశ్వరరావు బి. : భారతదేశ పాలనా వ్యవస్థ - తెలుగు అకాడమీ, హైదరాబాదు - 1972
12. కె. మధుసూధనరెడ్డి, పి. సత్యనారాయణ, డి. రవీంద్ర ప్రసాద్ : భారతరాజ్యాంగం, రాజకీయాలు, పాలన, తెలుగు విద్యార్థి ప్రచురణలు, మచిలీపట్నం, 1980
13. ది ఇండియన్ పొలిటికల్ సైన్స్ రెవ్యూ, జులై 1977 జులై 1980.

**శతజయంతి సంస్మరణ**

# కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మ

'పురాపి నవా' అనగా పాతదైన క్రొత్తదే అని సూక్తి. పదునెనిమిది పురాణాలను, పదునెనిమిది ఉప పురాణాలను అధ్యయన మొనర్చి అనాదృతమైన పురాణ వాఙ్మయమును ఆంధ్రీకరించిన 'ఆంధ్రవ్యాస' బిరుదాంచితులు శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు.

ఆంధ్ర బ్రహ్మాండపురాణము (నిర్వచనము) బ్రహ్మపురాణము, కౌమారికా ఖండము, అరుణాచల ఖండము, హాలాస్యమాహాత్మ్యము మున్నగు పురాణ కావ్యాలను, తాండవకృష్ణ భాగవతము (దశమస్కంధము - సంస్కృతము నుండి అనువాదము) సర్వమంగళాపరిణయము, హనుమద్విజయము, ధర్మసార రామాయణము, కలి విలాసము మున్నగు కావ్యములను, శ్రీ రామావతార తత్వము (11 సంపుటములు), శ్రీ కృష్ణావతార తత్వము (12 సంపుటములు), మనుచరిత్ర హృదయావిష్కరణము, మున్నగు గద్యకృతులను, పాండవాజ్ఞాతవాసము, విచిత్ర పాదుకాపట్టాభిషేకము, శ్రీరామవనవాసము అను మూడు దృశ్యకావ్యములను రచించారు. దాదాపు ఒకటిన్నరలక్ష పద్యముల రచించిన సారస్వతయోగులు శ్రీ జనమంచి వారు.

శేషాద్రిశర్మ గారు నెల్లూరు జిల్లా 'కలువాయ' గ్రామములో 4-7-1882న జన్మించిరి. తండ్రి సుబ్రహ్మణ్య శర్మగారు. తల్లి కామాక్షీదేవిగారు. శ్రౌతస్మార్త విద్యలకు నిష్ణాతులైనవారి కుటుంబమున శర్మగారు జన్మించారు. కలువాయ గ్రామమున మశూచి వ్యాపింపగా, శర్మగారి శైశవ దశలోనే వారు నెల్లూరు జిల్లా వదలి కడప జిల్లా లోని వేంకటరామపురము అను అగ్రహారమున స్థిరనివాస మేర్పరచు కొనిరి. శర్మగారికి బాల్యంలోనే మాతృ వియోగం కలిగింది. తండ్రి సుబ్రహ్మణ్య శర్మగారు మనో వైకల్యముతో కాశీ నగరమునకు వెళ్ళిపోయారు. బావగారైన గౌరిపెద్ది రామయ్యగారు శేషాద్రి శర్మగారిని చేరదీసి చదువు చెప్పించారు. రెండేళ్ళ తరువాత, శర్మగారి తండ్రి కాశి నుండి తిరిగి వచ్చి తమ కుమారుని 'విద్యావననిధి'గా తీర్చి దిద్దవలెనన్న ఆశయముతో కడపలో నున్న పండితులవద్ద విద్యాభ్యాసమునకు తగు ఏర్పాట్లు చేసి మరల యాత్రలకు వెళ్ళిరి. అప్పటికి శర్మగారి వయసు పదుకొండేళ్ళు. 1893 లో కొందరు బైరాగులతో పాటు కాలినడకచే కాశీపట్టణము చేరారు. నాలుగేళ్ళపాటు విద్యాధ్యయన మొనర్చారు. ఒకమారు మణికర్ణికా ఘట్టమున స్నానము చేయుచుండగ కాలుజారి గంగానదిలో పడ్డారు. కాని చిటికెలో ఎవరోగట్టును చేర్చి నట్లయినది. అప్పటికే లలితోపాసనాసక్తులైన శర్మగారిని లోకమాత తమను రక్షించినదని వారే చెప్పారు. వారణాసి పట్టణ పండితుల మన్ననలందుకొని శర్మగారు విజయనగరము, కసిమికోటలలో కొంతకాలముండి శ్రుతినేత్ర భాగత్రయమున నిష్ణాతులైరి. 1904లో విశాఖపురమును జేరి ఆగమ గణిత, యోగసాంఖ్యాది వేదాంత శాస్త్రములను, మంత్రశాస్త్రమును అధ్యయన మొనర్చిరి.

తొలుత అనకాపల్లిలోని సి. యస్. బి. హైస్కూలులో ఆంధ్రోపాధ్యాయులుగ పనిచేసి, 1901 లో కడపకు మరలి వచ్చి స్థానిక పురపాలకోన్నతపాఠశాలలో ఆంధ్రోపాధ్యాయులుగ జీవిక నారంభించి 1937 వరకు ఆ పదవిలో నుండి వేలాది విద్యార్థులకు విద్యాదాన



కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రి శర్మ

మొనర్చిరి. అప్పటికే అవధాన విద్యానిధులై ప్రశస్తి నార్జించి యుండిరి. కాని కందుకూరి వీరేశలింగం పంతులు గారి సూచన మేరకు అవధాన వుద్యమము నుండి తొలిగి, కావ్య రచనకుపక్రమించిరి. ఎనిమిది గంటలపాటు పాఠశాలలో ఉద్యోగము నాలుగు గంటల పాటు విశ్రాంతి తప్ప తక్కిన కాలమంతటిని కావ్య రచనకై వినియోగించిన మేధానిధులు శర్మగారు.

శర్మగారు జ్యోతిషము, వైద్యము మున్నగు శాస్త్రములలో దిట్టలై ఏమాత్రము ప్రతిఫలమాశింపక మంత్రోదకముచే వ్యాధులను నయమొనర్చేవారు. ఎందరో విద్యార్థులను చేరదీసి ఉచిత భోజనాది సౌకర్యములు కల్పించి విద్యాదాన మొనర్చారు.

వారి జీవిత విధానమత్యంత క్రమబద్ధమైనది. బ్రాహ్మముహూర్తమున లేచి స్నాన సంధ్యాది అనుష్ఠానములను పూర్తిజేసుకొని, కావ్యరచన, తర్వాత అధ్యాపకత్వము, కొంతకాలము సాంసారిక కృత్యములు, మరల పురాణ పరిశోధనము సాయంకాలమున సద్గోష్ఠి యివి వారి నిత్య కృత్యములు. ప్రతి లేఖకు స్వయముగా వెంటనే బదులు వ్రాసేవారు.

కపట మెరుగని సరళ హృదయులు శర్మగారు. పరమత సహనము వారి నైజగుణము. పొగడ్తలకు, సన్మానాలకు ప్రాకులాడుట ఎరుగరు. ఎందరినో కష్ట సమయములందు ఆదుకొన్నవారు. శర్మగారి మిత్రులొకరు, పరపతి సహకార సంఘమునుండి ఋణము తీసుకొని ఆ యప్పును తీర్చలేక పోయారు. శర్మగారు వుద్యోగవిరమణ చేసినప్పుడు లభించిన రెండువేల రూపాయలను పరపతి సహకార సంఘమునకు చెల్లించి శాంత చిత్తముతో యింటికి తిరిగి వచ్చిరి.

శర్మగారి గ్రంథముల నన్నింటిని (దాదాపు) వావిళ్ళవారు ప్రచురించి మహోపకార మొనర్చిరి. శర్మగారి షష్టిపూర్తి సందర్భమున సన్మానోత్సవ ప్రత్యేక సంచికను వెలువరించి గౌరవించారు. కావ్యతీర్థ, అభినవాంధ్ర వాల్మీకి, కళాప్రపూర్ణ మున్నగు బిరుదములతో భూషింపబడిరి. రాజమహేంద్రవరము, విజయవాడ, అనంతపురము, బళ్ళారి, నెల్లూరు మున్నగు పట్టణములలో పలుమార్లు ఘన సత్కారములందుకొనిరి.

పోతనామాత్యులవలె సహజ పండితులైన శర్మగారు భాగవత దశమస్కంధమును మాత్రమే 610 పుటలు (రాయల్ సైజు) 5200 పద్యములలో రచించిరి.

మహాపండితులైన నాగపూడి కుప్పుస్వామయ్య, వేదం వేంకటరాయ శాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి మున్నగు వారలు శర్మగారి నెంతగానో కొనియాడేవారు. కట్టమంచి రామలింగారెడ్డిగారు శర్మగారిని గురించి ప్రసంగిస్తూ "వీరి కవిత్వమునకు వీరి వినయాతిశయము శోభన గలిగించుచున్నది' కవిత్వ పాండిత్యములకును, సౌజన్యమునకును నిత్యసంధి లేదనుట మన మెరింగిన విషయమే. వీరెవ్వరిని గాని యధిక్షేపించినట్లు, ఎవ్వరితో గాని వాదమునకు బూను కొన్నట్లు గానరాదు. సౌజన్యము వీరి కలంకారము. ప్రఖ్యాతికై ప్రాకులాడువారు కాదు......." అన్నారు.

పండిత ప్రకాండులై, నిత్యసాహిత్యవ్రతులై, పరోపకార పరాయణ చిత్తులై పరదేవీ పదారవింద ధ్యానాసక్తులై మహాకావ్యముల నెన్నిటినో రచించిన శ్రీ శేషాద్రి శర్మగారు 1950 జులైలో దివంగతులయ్యారు.

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# సోమలదేవి - దక్షారామ శాసనము

1981వ సంవత్సరం ఫిబ్రవరి నెల "భారతి" లో శ్రీ కొల్లూరు సూర్యనారాయణగారు ప్రచురించిన "సోమలదేవి — దాక్షారామశాసనము"ను పరామర్శింపుచు కొనసాగించిన నా "చాళుక్య రాజ రాజ నరేంద్ర - వీర విజయాదిత్యుల సంతతి (1982 జనవరి, భారతి) అను వ్యాసమును పఠించిన శ్రీ సూర్యదేవర రవికుమార్ (దుత్తలూరు)గారు 1932 సం॥ ఏప్రియల్ నెల "భారతి" కలగూరగంపలో "సోమలదేవి - దాక్షారామశాసనము" అను వ్యాసమును ప్రచురించుచు తమకు కలిగిన సందేహముల నివృత్తి చేయ చరిత్ర పరిశోధకుల నభ్యర్థించినారు. అందు వారికి పొడమిన సందేహముల నుట్టంకించుచునే యెడనెడ నా వ్యాసమును విమర్శింపుచువచ్చిరి. అందువలననే నా వ్యాసములో నుట్టంకించిన విషయముల వివరణాత్మక సమర్థన మొనరింపవలసినవాడనైనాను. ఆ బాధ్యతను స్వీకరించి, ఈ వ్యాసరచన కుపక్రమించితిని. ఇందలి ఔచిత్యమును విజ్ఞులగు చరిత్ర పరిశోధకులే నిర్ణయింపగలరు.

పూర్వ చాళుక్య వంశములో నాఖరి తరము వారగు రాజ రాజ నరేంద్ర వీరవిజయాదిత్య సంతతి వరుసగా చోళసంపర్కము తోను, ఆరాధ్య బ్రాహ్మణ సంపర్కము వలనను తమ చాళుక్య గోత్రముల విడనాడి చాళుక్య శాఖనుండి, విడివడి వేర్వేరు గోత్ర నామములతో విలసిల్లెనని నేను ప్రతిపాదించిన విషయమును సమ్మతింపనొల్లక శ్రీ రవికుమార్‌గారీ వివాదమును రేకెత్తించినారు.

1. "సోమలదేవి దాక్షారామ భీమేశ్వరునకు కొన్ని దానము లిచ్చినది. ఆ దానముల దెలుపు క్రీ॥ శ॥ 1065 శాసనములో సోమలదేవి 'తొల్లి భీమేశ్వర వల్లభునకు ... .... యిచ్చె' నని చెప్పబడిన దానినిబట్టి ఈ దానములు క్రీ॥ శ॥ 1065లో ఇచ్చినవి గాక అతఃపూర్వమే ఈయబడినవని అర్థము చెప్పవలసి యుండును గదా ? లేక దానములు క్రీ॥ శ॥ 1065లో ఇచ్చినప్పటికి, శాసనము తరువాత ఎప్పుడో చెక్కబడినదా ? శాసనములోని 'తొల్లి' పదము దానమిచ్చిన కాలమునకు, శాసనమును చెక్కిన కాలమునకు మధ్య కొన్ని సంవత్సరములు గతించినవని తెల్పుటలేదా ?" అను సందియము వెలువరించినారు.

వారి దృష్టిలో ఈ శాసనములో నుదహరింపబడిన దానము లంతకు ముందెన్నడో చేయబడి, దానకాలమున శాసనము వ్రాయ వీలులేక, అట్టి వీలుకలిగిన కాలమున అనగా క్రీ॥ శ॥ 1065లో శాసనము చెక్కించుట జరిగియుండవచ్చును. ఒకవేళ క్రీ॥ శ॥ 1065లోనే దానము లిచ్చినను తరువాత ఎప్పుడో శాసనము చెక్కించుట జరిగినదా ? ఆ విధిని దాన కాలమునకు శాసన రచనా కాలమునకు మధ్య కొంతికాలము గడచియుండెనుగదా ? ఈ సమస్యా పరిష్కారమెట్లని ? ఆ శంకను వెలిబుచ్చినారు.

ఈ సందర్భమున శాసనములోని వాక్యములను నిశిత దృష్టితో పరిశీలింపవలసియున్నది. శాసన పాఠములోని ప్రథమ భాగములోని సంస్కృత పాఠభాగమును, దానివెనుక నిల్చిన తెనుగు అనుబంధ శాసన పాఠభాగము నొకదానికొకటి ప్రతి బింబములుగాక వేర్వేరు రీతుల నడచినవి. సంస్కృత పాఠము "శాకే సంవత్సరేషుమున్ని [వ] సుదిగే రాజ మార్తణ్డ భూ భృత్పు [త్రీ] సా .... .... నేత్రీ కనకవిరచితం కల్ప భూజాత పుష్పం" ప్రాదాద్భీమేశ్వరాయవ్యది .... .... శదధ సదాదీశ్వదా చంద్రతారం దీపం రౌప్యంచ పాత్రం బిసనదృశ భుజా రేవదేవి తనూజా" అని యున్నది.

ఈ ఉట్టంకింపుతో "సోమలదేవి" నామస్మరణమే కనబడదు దానమిచ్చినది "రాజమార్తాండ భూ భృత్పుత్రీ" అని యొకచోట, "రేవదేవి తనూజ" అని వేరొకచోట చెప్పబడినది ; అనగా "రాజ మార్తాండ" బిరుదాంకితుడగు ప్రభువునకు "రేవదేవి'' అనునామెకు పుట్టిన పుత్రిక శా. శ. 987లో ఈ దాన మొసంగినదని మాత్రమే స్పష్టీకరింపబడినది. అగుచో నీరాజమార్తాండుడెవరో ? "రేవదేవి" యెవరో ? తెలియదగు ఆధారములీ సంస్కృత పాఠభాగమున లభింపవు.

అందువలననే కీ॥ శే॥ కొమర్రాజు లక్ష్మణరావు పంతులు గారు ఈ శాసనదాత్రి రాజ రాజ నరేంద్రునకు రేవలదేవికిజనించిన కుమార్తె అని అభిప్రాయపడినారు. ఇందులకు కారణము "రాజ మార్తాండ బిరుదము" రాజ రాజ నరేంద్రునకొక్కనికే కలదను నమ్మకమే ; శాసనములోని సంస్కృత పాఠభాగము ననుసరించి, శాసనోదాహృత దానములు, ఆ సంవత్సరములోనే చేయబడినవని చెప్పుట జరిగినది. అంతియేగాని అతఃపూర్వమే ఈయబడిన దానముల నుదహరించుచు శా॥ శ॥ 987లో శాసనము వ్రాయబడి నటు లెక్కడను సూచింపబడలేదు. అందుచే శ్రీ రవికుమార్‌గా రూహించినటుల దానము లెపుడో చేయబడి, వానిని క్రీ॥ శ॥ 1065లో శాసనస్థ మొనరించినటుల చెప్పుట సరిగాదు ;

అయితే శాసనములోని సంస్కృత పాఠభాగమున కను బంధముగా చేర్చబడిన తెనుగు పద్య ప్రారంభమున, సంస్కృత పాఠములో వివరముగా చెప్పని విషయముల విపులీకరించు ప్రయత్నము జరిగినది. సంస్కృత పాఠమునకు అనుబంధమైన విషయములు తెనుగు పద్య భాగములో చోటుచేసుకొన్నవి. అట్టి వాటిలో "తొల్లి" అనుపదమును, యెత్తుగీత "సకల వసుమతీ సముకుటల సద్రత్న కిరణ రుచి విరాజితచరణుండయిన, నిజ భుజ ప్రధాని బెజయితదేవని, కూంతు సరియ పోల్పంగాంతిలెందు" అను వాక్యములు ముఖ్యములు. ఈ వాక్యములో "తొల్లి" అను పద ప్రయోగము సంస్కృత పాఠమునందులేదు. అయిన తెనుగు పద్యభాగమున పాదుకొనుటకు కారణమిదియైయుండును. సోమలదేవి ఈ దానమునకు పూర్వము (తొల్లి) భీమేశ్వరునకు సితమణి బద్ధమిచ్చి ఆనాడు శాసనము వ్రాయించుటకు పరిస్థితులు అనుకూలింపక, నుజ్జగించియుండి, ఇపుడు చేసిన "కనకరచిత రుచిర కల్పావనీరుహ కుసుమమును, వెణ్డిపణ్డితోనఖణ్డితద్యుతి దీపమును" దానమిచ్చుచు, తొల్లియిచ్చిన దానవిషయము నిందుజేర్చి ఈ సమయమున నుట్టంకించుచు శాసనము వ్రాయించియుండును. భీమేశ్వర మహాదేవునకు సితమణి బద్ధమిచ్చునాటి పరిస్థితులు అను కూలముగా లేకున్న కారణమున యూరకుండి, మలిసారి దాన మిచ్చునపుడు తనతండ్రి వేంగీరాజ్యాధినాదుడైయున్న కారణంబున,

పరిస్థితులన్ని విధముల ననుకూలముగా పర్యవసించిన కారణమున శాసనము వ్రాయించెను. అంతియేగాని శాసనములో నుదహరింప బడిన దానములన్నియు అతఃపూర్వమే చేయబడి క్రీ॥ శ॥ 1065 సంవత్సరములో శాసనస్థ మొనరింపబడెనను ట యూహింపదగినది గాదు.

దానములు క్రీ॥ శ॥ 1065వ సంవత్సరములో నిచ్చినప్పటికి శాసనము తరువాత యెప్పుడో చెక్కబడినదా? అన్న మీమాంస కంఠకంఠే తావేలేదు. శాసనము క్రీ॥ శ॥ 1065వ సంవత్సరముననే వ్రాయబడినది. అందు పూర్వ దాన ప్రసక్తి, తత్కాలమందిచ్చిన దానములజేర్చి యుట్టంకించుచు శాసనబద్ధ మొనర్చుట జరిగినది. ఇట్టివి చరిత్రలో క్రొత్తలుగావు.

ఇక శ్రీ రవికుమార్‌గారి రెండవ సందేహము మరింత వింతగా యున్నది. శాసనములోని "బెజుయిత దేవుని" అను పదమునకు "విజయాదిత్య దేవుడ"ని అర్థము చెప్పుకొనవలయునా? అని వారు ప్రశ్నించుట నేననుకొనవలెనో తోచకున్నది. చరిత్రకారు లెల్ల "బెజయిత దేవుడ"న విజయాదిత్య దేవుడని యర్థమనియే పలుసారులు వక్కాణించి, నిరూపించియున్నారు; విజయాదిత్యునకు "రాజమార్తాండ" బిరుదమున్నట్లు గూడ వారంగీకరించి "రేవలదేవి" విజయాదిత్యుని భార్యగా, "సోమల దేవి" వారికుమార్తెగా గుర్తించి యున్నారు; ఇది చరిత్ర పరిశోధకులందరకును తెలిసిన విషయమే; మరల వివరింపబని లేదను కొందును.

మూడవ సందేహము వెలువరించి, వ్యాఖ్యానించుటలో శ్రీ రవికుమార్‌గారు "సోమలదేవి వయస్సు శాసనకాలము నాటికి నేననినట్లు 15 సంవత్సరములు గాక 30 సంవత్సరములకు తక్కువ యుండియుండదు" అని నిష్కర్ష చేసినారు. భవతు. ఈ నిర్ణయమునకు వచ్చుటకు వారికిగల ఆధారము లేమియో చెప్పి యుండలేదు. మేమిరువురము మామా ఊహలపై ఆధారపడియే, సోమలదేవి వయో నిర్ణయము గావించినాము. శ్రీ రవికుమార్‌గారి వచనానుసారం క్రీ॥ శ॥ 1065 నాటికి "సోమలదేవి" వయస్సు 30 సంవత్సరములన్న, ఆమె క్రీ॥ శ॥ 1035వ సంవత్సరమున జన్మించి యుండవలెను. శ్రీ కొల్లూరు సూర్యనారాయణగారు డా॥ సి. వి. రామచంద్రరావుగారి వక్కాణమునుబట్టి ఈ "సోమల దేవి" "అనంతవర్మ చోడగంగుని" అర్ధాంగి యగుటకు సావకాశ మున్నదని సెలవిచ్చినారు. అందులకు పోల్చలకముగా వారిట్లువ్రాసి యున్నారు. "క్రీ॥ శ॥ 1108 నాటి ముఖలింగ శాసనములో ఒక "సోమలదేవి" "చోడగంగదేవు"ని "మనోమానసహంసి"గావర్ణింప బడినది. పై రేవలదేవి కుమార్తెయే ఈ "సోమలదేవి" అని డా॥ సి. వి. రామచంద్రరావుగారు గుర్తించారు. (భారతి 1975, నవంబరు) దీన్ని వాస్తవంగా అంగీకరించటానికి అవకాశముంది. అని తమ విశ్వాసాన్ని ప్రకటించారు. అయితే ఈ "సోమలదేవి" చోడగంగుని అర్ధాంగిగాక "ఉంపుడుగత్తె" యని, ఈమె ఎవరో తెలియదని, ఈమె తన్ను గురించి శాసనములో "త్రికలింగ పతేః శ్రీ గంగ చూడామణేః మనో మానస హంసీ" యని చెప్పుకొన్న దని కీ॥ శే॥ భావరాజు వేంకట కృష్ణారావు పంతులుగారు వ్రాసియున్నారు. (చూ. కళింగదేశ చరిత్ర పే. 219) ఆ విధిని డా॥ సి. వి. రామచంద్రరావుగారి యూహ, శ్రీ కొల్లూరు సూర్య నారాయణగారి సమర్థన వ్యర్థమగుచున్నది;

శ్రీ కొల్లూరు సూర్యనారాయణగారు, డా॥ సి. వి. రామ చంద్రరావుగారీ సందర్భమున నొక్క ముఖ్య విషయమును విస్మరించి తొందరపాటు నిర్ణయ మొనరించినారు. అనంతవర్మ చోడగంగుని జన్మకాలమును దృష్టిలో నుంచుకొని వారీ నిర్ణయము చేసినట్లగపడదు. ఏలనన – అనంతవర్మ చోడగంగదేవుని తండ్రి రాజరాజ వీరేంద్రవర్మ క్రీ॥ శ॥ 1068 లో చోళరాజేంద్ర తనయ "రాజసుందరి"ని వివాహమాడెను. ఆ పిదప 2, 3 సంవత్సరము లకు "రాజసుందరి" యందు వీరేంద్రవర్మ, అనంతవర్మ చోడ గంగునికనెను. అనగా అనంతవర్మ క్రీ॥ శ॥ 1070లో జనించి యుండవలెను. అట్లయిన క్రీ॥ శ॥ 1035లో జన్మించిన "సోమల దేవి" తన కంటె 35 వ సత్సరముల చిన్నవాడగు అనంతవర్మ చోడగంగుని పరిణయమాడినట్లు అగును. ఇదెంతటి పరిహాస భాజనమగు విషయమో వేరుగా చెప్పనవసరములేదు. కావున డా॥ సి. వి. రామచంద్రరావుగారు, వారి ననుసరించి శ్రీ కొల్లూరు సూర్యనారాయణగారు పొరబడినారనియే చెప్పక తప్పదు;

అతనికంటె ఘనుడు అచంట మల్లన్న అనురీతిని శ్రీ రవి కుమార్‌గారు అనంతవర్మ చోడగంగుని వదలి అతని తండ్రికే "సోమలదేవి"ని అర్ధాంగిగా చేయ ప్రయత్నించినారు. చూడుడు:-

"సోమలదేవి తండ్రి విజయాదిత్యుడు వేంగి సింహాసనము నకై రాజరాజుతో జరిపిన పోరాటంలో అతనికి కళింగ గంగరాజులు సహాయపడిరి. రాజరాజు తనమామ రాజేంద్ర చోళుని సైన్యసహాయ మున విజయాదిత్యుని వేంగినుండి పారద్రోలెను. విజయాదిత్యుడు మరల గంగరాజైన 3వ వజ్రహస్తుని కుమారుడగు దేవేంద్రవర్మ సహాయముతో వేంగిసింహాసనాన్ని ఆక్రమించినాడని అనంతవర్మ చోడగంగుని శాసనములలో గలదని డా॥ కె. సుందరంగారు "ది సింహాచలమ్ టెంపిల్" అను ఆంగ్ల గ్రంథములో వ్రాసిరి. దీనిని

బట్టి విజయాదిత్యుడు గంగరాజులతో వియ్యమంది, తన కుమార్తె యగు సోమలదేవిని గంగరాజైన దేవేంద్రవర్మ కిచ్చినట్లు ఊహించుట కవకాశమున్నది. దేవేంద్రవర్మ విజయము లను కుమారుడు అనంతవర్మ చోడగంగుడు తనశాసనము లలో ప్రస్తుతించినట్లు డా. సుందరరంగారు వ్రాసిరి. జనవరి 82 "భారతి"లో కృష్ణమూర్తిగారుదహరించిన క్రీ॥ శ॥ 1108 నాటి ముఖ లింగ శాసనమున పేర్కొనబడిన "త్రికళింగ మండల పతియగు శ్రీ గంగ చూడామణి" దేవేంద్రవర్మయే ; అయితే "శాసనమున గంగా చూడామణియని ఉండగా, వివరణకర్తలు "చోడ గంగుడ" ని వ్రాయుట ప్రామాదికము. దేవేంద్రవర్మ గంగరాజేగాని "చోడగంగు"గాదు) అతని "మనోమానసహంసి" గా పేర్కొనబడిన "సోమలదేవి" దాక్షారామ శాసనమున చెప్ప బడిన సోమలదేవియే అనుటకు సందేహమేమి ? దేవేంద్రవర్మ సోమలదేవినేగాక రాజ రాజ నరేంద్రుని మనుమరాలు కులోత్తుంగ చోళుని కుమార్తె అయిన "రాజసుందరి"ని వివాహము చేసికొని, గాంగ — చోడవంశములకు సంబంధము స్థిరపరచినాడు. వీరి కుమారుడే అనంతవర్మ చోడగంగు (ది సింహాచలమ్ టెంపిల్). కనుక సోమలదేవి తన భర్తయైన గాంగరాజు సాయముతో తన తండ్రి వేంగీసింహాసనమున సుస్థిరుడైన పిమ్మట తాను "తొల్లి" భీమేశ్వరునకిచ్చిన దానమును గూర్చి అప్పుడు అనగా క్రీ॥ శ॥ 1065లో శాసనమును వ్రాయించెననుకొనుట సమంజసముకాదా ; అని దేవేంద్రవర్మ భార్య సోమలదేవియని చెప్పి నా వాదనను పరోక్షముగా పూర్వ పక్ష మొనరింప జూచినారు ;

కొన్ని కొన్ని విషయ నిర్దేశములొనరింప ఊహలపై ఆధారపడి వర్తించుట తప్పుగాదు. కాని — నేల విడిచి సాము చేయులాగున ఆ ఊహలు నిరాధారములుగా నుండరాదు. ఇతర సన్నివేశములబట్టియో, పరిస్థితులవలననో, మరియే ఇతరకారణముల వలననో సమర్థింపదగినవిగా నుండవలెను. ఇట శ్రీ రవికుమార్ గారు తమ ఊహాలతో అనౌచిత్యపు నిర్ణయముల జేయగడంగిరి. రాజ రాజ దేవేంద్రవర్మ వంశవృక్ష మిట్లున్నది :—




ఆంధ్రేతిహాస పరిశోధక మండలి రాజమహేంద్రవరము వారి "కళింగ దేశచరిత్ర" లోని వంశవృక్ష వివరము క్రింది విధముగానున్నవి —




ఇందు "దేవేంద్రవర్మ రాజరాజదేవుడు శక సంవత్సరం 992లో పట్టాభిషిక్తుడాయెను. ఈతడు మూడవ వజ్రహస్తదేవుని కొడుకు. 8 సంవత్సరములు రాజ్యము చేసెను. ఈతడు ద్రవిళాహ వమందు జయలక్ష్మికి భర్తయై తర్వాత చోళరాజేంద్రుని (గంగై కొండచోళుని) కూతురైన రాజసుందరిని వివాహమాడినట్లును (అకారణమున వేంగీ రాజరాజ నరేంద్రునకు తోడల్లుడైనట్లును) వేంగీరాజగు విజయాదిత్యుడు చోళులచే నోడింపబడుటకు సిద్ధముగా నుండగా రాజరాజ దేవేంద్రవర్మ వానిని రక్షించెననియు అనంత వర్మ చోడగంగుని శాసనములవలన తెలియవచ్చుచున్నవి. శ్రీ రవి కుమార్ గారూహించినట్లు రాజరాజదేవేంద్రవర్మ చాళుక్య రాజ రాజనరేంద్రుని మనుమరాలు కులోత్తుంగ చోళుని కుమార్తె రాజ సుందరిని వివాహమాడెననుట, విజయాదిత్యునికుమార్తె సోమలదేవి నుద్వాహమై యావివాహబంధమున విజయాదిత్యునకు సాహాయ్యము చేసెననుట యదార్థము కాదని తేలుచున్నది.

రాజరాజదేవేంద్రవర్మ పట్టాభిషిక్తుడైనది క్రీ॥ శ॥ 1070 వ సంవత్సరమున. ఆ సమయమున కాతనికి 25 సంవత్సరముల ప్రాయముండెనను కొన్న అతని జననము క్రీ॥ శ॥ 1045 అగు చున్నది. సోమలదేవి శ్రీ రవికుమార్‌గారి అంచనా ప్రకారం క్రీ॥ శ॥ 1035వ సంవత్సరమున. అనగా సోమలదేవి జన్మించిన పిదప పదిసంవత్సరములకుగాని రాజరాజదేవేంద్రవర్మ జన్మించ లేదు. అవిధిని సోమలదేవి దేవేంద్రవర్మకంటే పదిసంవత్సరములు పెద్ద. భర్తకంటే భార్య పెద్దదైన ఈ సందర్భమున వారిరువురకు వివాహమెట్లు జరుగునో, అదియెట్లు శాస్త్ర విహితమో దురూహ్య

ముగానున్నది. ఈ సమస్యా పరిష్కారము శ్రీ రవికుమార్ గారే యొనరింపవలెను.

సోమలదేవి దేవేంద్రవర్మ భార్యకాదని రుజువు చేయు హంశము సోమలదేవి శాసనమందే గలదు! ఆమె తన్ను వివరించు కొను సందర్భమున తాను ''బెజయిత దేవుని'' కూతురననియే చెప్పికొన్నది. శ్రీ రవికుమార్ గారన్నట్లు సోమలదేవి దేవేంద్ర వర్మ భార్యయై యుండియున్న, తనభర్త పేరుదహరించుకొనక తండ్రి పేరుదహరించుకొని యుండునా? అది సాంప్రదాయ విరుద్ధ ముగాదా? వివాహితయైన యామె తనభర్త పేరును జెప్పక తండ్రి పేరు చెప్పుకొను టెక్కడనైన నుండునా? ఒకవేళ భర్త అనామకుడైనను ఇట్టి విపరీత పక్కాణముండదు గదా! జగదేక వీరుడగు భర్త యుండగా వాని పేరునుదహరింపక పరిహరించుట కేమి కారణము? అదియునుగాక మాతాపితరులపై ప్రేమమగ్గలమై యున్న వారి పేరులుదహరించుచునే తన భర్త పేరును కూడా ఉదహరించియుండవలదా? అందుచే సోమలదేవి క్రీ॥ శ॥ 1065 నాటికి కన్యగానేయుండి, వివాహయోగ్యమైన వయః పరిపాక మందున్నదని రూఢియగుచున్నది. పైవాదములను పరాస్త మొనరిం చిననాడుగాని శ్రీ రవికుమార్ గారి నిర్ణయమునిలువనేరదు. "సోమల దేవి" దేవేంద్రవర్మ భార్యయనుట చెల్లదు.

''వీరవిజయాదిత్యుడు వృద్ధాప్యమున ఒక కుమారుని కని నట్లు అతని స్వస్థతికై రెండు గ్రామములు దానమిచ్చినట్లు తెల్ప బడినర్యాలి శాసనమున వీరవిజయాదిత్యుడు" రాష్ట్రకూట ప్రముఖ కుటుంబినుల సమావేశపరచి, మంత్రి పురోహిత సేనాపతి యువ రాజు దేవారిక సమక్షమున "తవ సంతానబలాయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం" దానమిచ్చుచున్నట్లు లిఖింపబడినది. అది క్రీ॥ శ॥ 1072వ సంవత్సరమున జరిగినది. అప్పటికి యువరాజు (పేరు తెలియదు) సజీవుడయ్యే యున్నాడని కృష్ణమూర్తిగారు వ్రాసిరి. ఇందలి యువరాజశబ్దము వీరవిజయాదిత్యునికుమారునకై స్పష్టముగా నిర్దే శింపబడినచో, శాసనమున "యువరాజ బలాయురారోగ్య'' అని చెప్పబడవలయునుగాని, స్త్రీ పురుషభేదము తెలియని ''సంతాన బలాయురారోగ్య'' అని ''సంతాన'' శబ్దముచే చెప్పకూడదని అంతా పూర్వక అశంకను వెలిబుచ్చుచు, కొన్ని శాసనముల నుదహ రించి అందున్న ''రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః సమాహూయ మంత్రి పురోహిత సేనాపతి యువరాజ దౌవారిక ప్రధాన సమక్షమ్'' అను పడిగట్టు శబ్ద జాలముతో శాసనములు లిఖింప బడుచుండునని వక్కాణించుచు ఆకోవలోనిదే ర్యాలి శాసనములుగూడనని నుడువ సాహసించినారు!

ప్రాచీన శాసనములలో వ్యర్థపదాడంబరముండదు. ఉత్ప్రేక్ష లుండవచ్చును. ప్రతిపద మర్థవంతమై యథార్థస్థితిని దెల్పునదియై యుండునుగాని ఊరకే పాదపూర్తికి, అనృతవాక్యోద్ఘాటనకు లక్ష్య భూతమై యుండదు. ఇట "యువరాజ బలాయురారోగ్య" అని చెప్పక "సంతాన బలాయురారోగ్య" అనుట సందేహాస్పదముగా నున్నదనుట వింతవాదన. సాధారణముగా గృహస్థులు తమ "సంతాన బలాయురారోగ్య వృద్ధ్యర్థం" దాన ధర్మములొనర్చుట, ప్రతిగృహీతలు దాతల "పుత్రపౌత్ర వంశాభివృద్ధిరస్తు - ఆయు రారోగ్య భాగ్య ప్రాప్తిరస్తు" అని దీవించుట మనందఱి యనుభవ ములోనున్నదే! అప్పటికి పౌత్రులు లేకున్నను, ఉండినను ఈ దీవెనలు లభించుచునే యుండును. అట్టి దీవెనలలో పుత్రికల, దౌహిత్రుల ప్రశంసలొక్కొక్క సమయములందుండకపోవచ్చును. అంత మాత్రమున ఆ కుటుంబినికి దుహితలుగాని దౌహిత్రులుగాని లేరని అర్థమా? దాత కుటుంబములోని ప్రతి ఒక్కరును ఆయు రారోగ్య భాగ్యములతో తుల దూగవలెననియే ఆ దీవెనల అర్థము. అట్టి సందర్భమున "సంతాన బలాయురారోగ్య వృద్ధ్యర్థం'' అనగా ''విజయాదిత్యుని కుటుంబములోని ప్రతివ్యక్తి బలాయు రారోగ్యవృద్ధ్యర్థం'' అనియేఅర్థము. విజయాదిత్యుని సంతానమున యాతని కుమారుడు (యువరాజు) చేరియుండడా? ప్రత్యేకముగా యువరాజు ఆయురారోగ్య వృద్ధి నిమిత్తమాదాన ముద్దిష్టమై యున్నను ప్రతిగృహీత, దాతయొక్క సంతాన (కుటుంబ) ఆయు రారోగ్యవృద్ధినే సమిష్టిగా కోరి దీవించుట సహజము. సాంప్ర దాయము. అట్టిదే ఈ ''సంతాన'' పద ప్రయోగము. శ్రీ రవి కుమార్ గారుదహరించిన శాసనములలోని ''రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః సమాహూయ ... .... సమక్షమ్'' అను ఉట్టంకింపు. రోకంటిపాటగాని అర్థవంతమైన మాటకాదనుట వారికేచెల్లును!

నేనుదహరించిన శ్లోకములలో చెప్పబడిన త్రిలింగ దేశ ములోని రాజమందిరము, రాజమహేంద్రవరములోనిదే అనుట యెట్లు? రాజమహేంద్రవరమే "రాజమందిర"మని చెప్పబడినదా? అన్న ప్రశ్నలకు సమాధానమొక్కటే. పూర్వము రాజమహేంద్ర వరరాజ్యమనియు, త్రిలింగమనియు, ఆంధ్రరాజ్యమనియు వేంగీ రాజ్యమునకు వ్యవహారము. (చూ. కళింగదేశచరిత్ర - పే. 338) ఆ రాజమహేంద్రవర పదమే జనవాక్యమున రాజమహేంద్రము, రాజమందిరము, రాజమహేంద్రి, రాజమండ్రి, రాజమండ్రిగా నామ పరివర్తన మందినట్లుల చెప్పుటలో ఏ విప్రతిపత్తియు నుండ దనుకొందును.

శ్రీ తురగా కృష్ణమూర్తి
పిట్టల వేమరం.

## అ ఱ వ ము

'మేతకరిపిల్ల, అరపున మేకపిల్ల,
పాలుబోతు తనంబున పందిపిల్ల,
ఎల్లపనులను చెఱుపంగ పిల్లిపిల్ల,
అందమున కోతిపిల్ల ఈ అఱవపిల్ల!

ఈ చాటు పద్యం శ్రీనాథ మహాకవిదని ప్రతీతి. ఇందులో ఆతడు ఒక 'అఱవపిల్ల'ను వర్ణించాడు. తెలుగు వాళ్ళు సాధారణంగా తమిళనాడును అఱవదేశమనీ, తమిళభాషను అఱవభాష, అరవము అనీ, తమిళులను అరవవాళ్ళనీ అంటూ ఉంటారు. ఈ 'అఱవ'పదం తెలుగు వాళ్ళకు తమిళులపట్లనూ, తమిళభాష పట్లనూ ఉండే దురభిప్రాయాన్ని ద్యోతకం చేస్తున్నట్లు గోచరిస్తుంది. శ్రీనాథ మహాకవి పేర చలామణి అవుతున్న పైపద్యంలో కూడా అతనికి సదరు తమిళబాలిక పట్లుకల అమితమైన అసహ్యాభావం వ్యక్తమవుతున్నది!

'తనగీతి అఱవజాతిని గాయకులనుగా
దిద్ది వర్థిల్లిన తెలుగుపాణి'

అంటూ శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు మన సంగీతపు గొప్పతనాన్ని గూర్చి చెబుతూ 'తమిళజాతిని' 'అఱవజాతి' అన్నారు. ఇక్కడ కూడా కవి తమిళజాతిని తక్కువగా చూస్తునట్లు తుక్కన స్ఫురిస్తుంది!

శ్రీనాథుని కన్న పూర్వం 'తమిళ' పదానికి బదులుగా 'అఱవ' పదాన్ని తెలుగు కవులెవరైనా వాడి నారో లేదో నాకు తెలియదు. మొత్తానికి నాటినుండీ నేటి వరకూ తమిళులను అరవవాళ్ళనీ, తమిళాన్ని అఱవమనీ, తమిళదేశాన్ని అరవదేశమనీ, మనం [illegible] ఉన్నామని చెప్పడంలో కాసంతకూడా అతిశయోక్తి లేదు. ఎందుకో తెలియదు. దాయాది మాత్సర్యమేమో! తమిళనాడు, తెలుగునాడులు ప్రక్క ప్రక్కన నెలకొన్న ప్రదేశాలు కదా!!

తమిళం తంగం అంటారు తంగమంటే బంగారు. బంగారంలాంటి తమిళం అధ్వాన్నపు అఱవంగా ఎప్పుడు మారిందో తెలియదు. ఇది సీతాకోకచిలుక గొంగళి పురుగుగా మారినట్లు - తలక్రిందులు వ్యవహారమైంది. ఈ 'అఱవ' పద వ్యుత్పత్తిని గూర్చి నేను నాకు తెలిసిన కొద్దిమంది పండితులను ప్రశ్నించాను. సరియైన సమాధానం దొరకలేదు. కాన ఆంధ్ర తమిళములందు అఖండ పాండిత్యమును గడించిన పండిత ప్రకాండులు దయతో ఈ 'అఱవ' పదపు పుట్టుపూర్వాలను గురించి "భారతి" ద్వారా వివరించి నాలాంటి జిజ్ఞాసువులకు చిత్తతృప్తి కలిగించాలని ప్రార్థిస్తున్నాను.

**శ్రీ శంకరగంటి రంగాచార్యులు**

## శాస్త్రీయ, కళా రంగాలలో అనుస్సృజనాత్మక ఆత్మ పరిశీలనము- కార్ల్ పాపర్ భావనపై ఒక వివరణ

శాస్త్రము, కళ — అనే యీ రెండూ, రెండు నేత్రాల్లాం టివి. మానవాభ్యుదయమనే అనంత గగనానికి సూర్యచంద్రుల్లాం టివి. అంటే ఆకాశంలోంచి కాంతిని విరజిమ్ముతూ ఆ సూర్య చంద్రులెలా చీకట్లను పొగొడుతూ ఉంటారో, అలాగే యీశాస్త్రము, కళ అనే యీ రెండూ — మానవ పరిజ్ఞానానికి సంబంధించిన అనేకమైన సమస్యలను విడదీసి, వడబోసి, విడమరచి, విశదీక రించి చెప్తుంటాయి. ఈ శాస్త్రము, కళ — రెండూ నేత్రాలే ఐనా, రెండింటి లక్ష్యం దృశ్యశోధనే ఐనా, ఆ రెండూ ఒకదాన్నొకటి ఓవర్ క్రాస్ చెయ్యడంకాని, ఓవర్ లాప్ కావడం కాని లేకుండా, జరగకుండా, సునిశిత దృక్పథానికి ఊపిరిపోయడం అత్యంత ఆశ్చర్యకరం. అయితే చాలమంది శాస్త్రాన్ని, కళల ఏకోదరత్వాన్ని తెలుసుకోలేక కళని ఉపాంగముల క్రింద, శాస్త్రాన్ని ఉపాంగముల పేదిక క్రింద జమకట్టి, దానికి తీరని అపకారాన్ని తలపెడు తున్నారు. పాపర్ అన్నట్లు యునికెలెక్చువల్ అప్రోచ్ అనేది ఉండే [illegible]నుంచి మానవాళి యున్నిటీ ప్రీమిటివిటీలోకి, కష్టనష్టాలను అడుగుబొట్లను, ఎత్తుపల్లాలను 'తెలియజెప్పాలనే సాకుతో, నడిపిస్తూ తీసుకుపోతున్న గ్రాయ్సమ్ మ్యానరిజానికి పరాకాష్ఠ అయిన పెసిమిస్టిక్ అప్రోచ్ ను ఏమాత్రం కేర్ చేయవలసిన అవసరం ఉండదు. అప్పుడే మానవుడు తనకుతెలియని, తనకు సంబంధించిన మానవ పరిజ్ఞానాన్ని తెలుసుకొనేందుకు కుతూహలపడతాడు ఆ జీల్ అనేది ఆశలోంచే పుడుతుందికాని, నిరాశల్లోంచి కాదు. అలా అని ఆశను దురాశగానో, పేరాశగానో తీర్చిదిద్దుకోవడం మూర్ఖత్వం. దేనికైనా సంయమనమనేది, సంతులమనేది అవసరం. అవిలేనప్పుడు ఎంతటి మేధావులనైనా పరిపూర్ణవ్యక్తులుగా పరిగణించడానికి వీలులేదు.

విమర్శ అనేది నిర్దిష్టమైన పరామర్శ. అది సహేతుకమైన ప్రశంస. లోపాలను ఎత్తి చూపించే అభిశంస. ప్రతి విషయాన్ని తులనాత్మకంగా పరిశీలించి, పరీక్షించి, పర్యవేక్షించే దివ్యాంశ. ఈ విద్యద్రహస్యాన్ని బట్టబయలు చేసుకోగలిగినపుడే శాస్త్రము కానివ్వండి, కళే కానివ్వండి సత్సాంప్రదాయిక మానవాభ్యుదయానికి నూతనోత్తేజాన్ని కలిగించగలుగుతాయి. అందుకే విమర్శ సామాజిక స్పృహ కలిగిఉండాలి. సృజనాత్మక అవగాహనలో ఐక్యమైఉండాలి. అస్తవ్యస్తంగా, అర్థరహితంగా దుఃఖపూరితంగా లోపభూయిష్ఠంగా, నిరుత్సాహపరచేదిగా ఉండకూడదు. ఆశావాది కానివాడు మంచి విమర్శను ప్రతిపాదించలేడు. అది అతనికి సాధ్యంకాదు. అందుకే ఆశ అంటే హోప్ ఉండాలి. ఆ వాదనలో సిగ్నిఫికంట్ ఐడియాలజీ ఉండి తీరాలి. విట్‌కీ, సటైర్‌కీ, ఐరనీకి ప్రాధాన్యముండాలి. సిన్సియర్‌గా, సీరియస్‌గా ఉంటూనే అందులోనే ఎనలేనిహాయిని, ఆనందాన్ని, ఊహించ శక్యంకానంత చైతన్యాన్ని కలిగించగలగాలి. అప్పుడే అది నిజమైన విమర్శ. పరమాణు సిద్ధాంతానికి నిర్దిష్టమైన అవగాహన ఎలా యివ్వాలన్న విషయం ప్లాంక్‌కి కాని, ఐన్‌స్టీన్‌కికాని, రూథర్‌ఫర్డ్‌కికాని, బోర్‌కి కాని ముందుగానే తెలుసా ? కాని తెలుసుకోగలమన్న ధీమా వారిని తెలుసుకొనేలా చేసింది. ఈనాడు మనమనుభవిస్తున్న అనేక యాంత్రిక సుఖాలు వారి దయాదాక్షిణ్యమైన అప్లైడ్ ఫిజిక్స్‌నని నేనంటే కాదనే వారు చాల అరుదుగా ఉంటారని అనుకొంటాను. అందుకే మనిషి ఆశించాలి. ఆ ఆశలోనే శ్వాసించాలి. ఆ శ్వాసలోనే తననుకొన్న సత్యాన్ని శోధించాలి. సాధించాలి. చివరికి శాసించాలి. చంద్రునిపై అంతిమైన కవిత్వాలల్లుకోవడమే తెలిసిన మనకు, అదొకగ్రహమని, అందులోకి నేడు ప్రవేశించగలిగామని అనుకొంటుంటేనే థ్రిల్‌గా ఉంటుంది. లేదా ? విప్లవానికి సంకేతంలా నిలబడ్డ యీ సూర్యుడు రేపో మాపో మనిషి పాదాలక్రింద పడనున్నాడు. ఇది అసాధ్యమనే వారున్నారు. వారికి నిజమైన అవగాహన లేదనే నేనంటాను. ఇది కూడ సాధ్యమే. అయితే యిది సహజంగానే గ్రేట్ డ్రీమ్. నిద్రతో చెలగాటం. భయపడడం పిరికి లక్షణం. ముందు జాగ్రత్తలు తీసుకోవడం శాస్త్రీయదృక్పథం. ఈ ఆశనే స్పిరిట్‌గా భావించవచ్చు. ఆ స్పిరిటే సైంటిఫిక్ డిస్కవరీకి డైరక్టరీలాంటిదని అనుకోవచ్చు.

కార్ల్ పాపర్ పరిపూర్ణమైన ఆశావాది. పెసిమిజమ్‌లో కూడ ఆయన ఆశను చూడగలిగాడు. పెసిమిజమ్, ఆప్టిమిజమ్‌గా రూపొందగలదన్న ఆశాభావాన్ని కూడ ఆయన వ్యక్తంచేసాడంటే కేవలం ఆశ్చర్యం కలిగించడమేకాదు - మానవ పరిజ్ఞానంలో ఆయనకున్న విశిష్టమైన ప్రజ్ఞాపాటవం కూడ తెలిసొస్తుంది. శాస్త్రీయ, కళా రంగాలలో అనుసృజనాత్మకమైన ఆత్మపరిశీలనాన్ని ఆయన కొన్ని ప్రాతిపదికల వారీగా చర్చించాడు. వాటిని కొంతవరకు విపులీకరించేందుకు ప్రయత్నిస్తాను.

## కళ - శాస్త్రము

కవిత్వాన్నే ప్రధానంగా పాపర్ పరిగ్రహించినా, నేను 'కళ' అని అనడమే సముచితంగా ఉంటుందని అభిప్రాయపడడం వల్ల మొదటి ప్రాతిపదిక కిలా నామకరణం జరిగింది. ఈ రెండింటి అవినాభావ సంబంధం, పరస్పర బాంధవ్యం యిందులో చర్చించబడింది. ఆ రెండింటి అరిజిన్ మిథికల్ అని పాపర్ సూచన. మిథ్ అంటే హ్యూమన్ ఫాంటసీని దృష్టిలో ఉంచుకొని మన ప్రపంచాన్ని మనకే విశదీకరించే ఒక ఫెనామెనన్ లేక ఒక ఫాక్ట్. అయితే అది బేస్‌లెస్సా అని అనుకోవడంలోనే ప్రశ్న ఉదయిస్తుంది. అందులోనుంచి తర్కం, తత్ఫలితంగా యదార్థం ఉద్భవిస్తాయి. హేతుబద్ధమైన వాదనకి ఛాలెంజ్‌గా రూపురేఖలు దిద్దుకొంటుంది సైన్స్. వాస్తవికతను కళ్ళకు కట్టినట్లు చిత్రించేందుకు నడుము కట్టు కొంటుంది ఆర్ట్. అందుకే విలక్షణమైన విరుద్ధ తత్త్వంతో చూచేవారికి సైన్స్ అనికాని, ఆర్ట్ అని కాని కనిపించక శాస్త్రీయమైన కళాత్మక స్పందన మాత్రమే కనిపించి, అంతు తెలియని రసానుభూతిని ప్రసాదిస్తుంది. ఇంతకుమించి పాపర్ తన మొదటి ప్రాతిపదికలో ఎక్కువగా ప్రతిపాదించలేదు.

## విమర్శ - తీరుతెన్నులు

అనుభూతి విమర్శ, హేతువాద విమర్శ అని వర్గీకరించడం జరిగింది. అనుభూతి విమర్శ అనుభూతిలోంచి అంటే కళాత్మక పరదుల్లోంచి జీవం పోసుకొచ్చింది. భాషాసౌందర్యం, శక్తివంతమైన పదుధ్వని ప్రవాహం, ఊహాతీతమైన ఉత్ప్రేక్ష, ఉద్దీపన, ఉదాత్తత, శృతితప్పని సమ్మేళనం, గతి తప్పని విద్వత్సాహితీ ప్రభావం-యిత్యాదులు రూపాన్ని యిస్తాయి. నిష్పాక్షికమైన తీర్పుకి స్థానాన్ని కల్పిస్తాయి. హేతువాద విమర్శ తార్కికమైనది. అది ఒక చర్చావేదిక. సత్యాన్వేషిక నిత్యపరిశోధక. బిగిసడలని కాన్మలాజికల్ అవుట్లుక్ దీనికి ప్రధానంగా ప్రాణాన్నిపోస్తుంది. దానిపై ఏర్పరుచుకొనే రకరకాల పరికల్పనలు - సిద్ధాంత పరంగా రూపొందించబడ్డవి. ఆధారాలతోసహా నిరూపించబడ్డవి - హేతువాద విమర్శకు తగిన పజుల్‌ను అందిస్తాయి. అనుభూతి విమర్శనూ,

హేతువాద విమర్శనూ, దృష్టిలో పెట్టుకొని యివాల్యుయేట్ చైడం మొదలెడితే బహుశా సద్విమర్శ, అంటే, ఏవిధమైన లోటుపాట్లు లేక స్థితప్రాజ్ఞిక దృష్టితో పర్యావలోకించే మహత్తరమైన పరామర్శ ఉద్భవించ వచ్చుననే ఆశాభావాన్ని పాపర్ దీనిద్వారా తెలియ జెప్పేందుకు ప్రయత్నించాడేమోనని నా ఉద్దేశ్యం-నిజానికి విమర్శ, స్వయం విమర్శతో ప్రారంభమవ్వాలి. ఆ స్వయం విమర్శ పరస్పర విమర్శకు దారి తీయాలి. ఆపై సహకార విమర్శతో చేతులు కలపాలి. అంటే స్వయం విమర్శ, సమిష్టి విమర్శ - యీ రెండింటి ద్వారా మాత్రమే సమన్వయ విమర్శ సాధ్యమౌతుంది. సామరస్య పూరితమైన సమన్వయ విమర్శే సద్విమర్శ ఔతుంది. అది మనో బలానికి, నిగ్రహానికి గీటురాయి. దాన్ని సాధించడమే గొప్పతనం. ఇదే పాపర్ తన రెండవ ప్రాతిపదికలో నామమాత్రంగా చెప్పాడు. ఇక మూడవ ప్రాతిపదికను పరిశీలిద్దాము.

### మానవ పరిజ్ఞానము - శాస్త్రీయ, కళారంగాల ప్రాధాన్యము

శాస్త్రము, కళ - అనే యీ రెండు విశ్వకళ్యాణాన్ని అపేక్షించి రూపొందించబడ్డవే. ఈ అపేక్షలో ఆశ ఉంది. ఆ ఆశ లోంచి శ్వాసపోసు కొచ్చిందే సిద్ధాంతము. అందులోంచి రూపొందినవే యీ శాస్త్రము మరియు కళ. సిద్ధాంతి మనేది మనకు మనమే రూపకల్పన చేసుకొన్నది. మన పరిజ్ఞానాన్ని తెలుసుకొనేందుకు, మనచేతనే రూపొందించబడ్డ ఊహాజనిత వాస్తవమది. మనవ్యక్తిగతను మనభవితను, మన వర్తమానాన్ని మనకు మనమే విశదపరచుకొనేందుకు, మనమే ఏర్పరచుకొన్న తార్కిక జవసత్వమది అందుకొనమే యీ శాస్త్రము, కళ వెలువడ్డాయి. కనుక వాటి ప్రాధాన్యం మరి యే యితర లక్ష్యానికీ కాదు. కేవలం సర్వేజనో సుఖినోభవంతన్న-ఆశీర్వచనానికి తొలిపీఠిక రాసేందుకు మాత్రమే. ఈ ఆశతోనే పాపర్ యీ ప్రాతిపదికను నిర్దేశించాడేమోనని నా భావన.

### పాపర్ భావనపై ఒక వర్గీకరణ

పాఠకుల సౌకర్యార్థం పాపర్ ప్రతిపాదనలను క్రింది విధంగా వర్గీకరణ చేయడంలో దోషంలేదనే భావిస్తున్నాను. సాహసమని అనుకోవడం లేదు కనుక మన్ననలు కాని, మన్నింపులు కాని కోరుకోవడంలేదు.




### చివరి మాట

ఈ వ్యాసం కొంతవరకైనా విమర్శ అంటే ఏమిటో తెలియ జేస్తుందనే ఆశిస్తున్నాను. ఆ ఆశతోనే అంతయ్యగారు యీ పాటికే దీనిమీద వ్యాఖ్యానించి ఉన్నా (ఆగస్టు నెల భారతి, 81), సాహసించి వ్రాయడం జరిగింది.

**డా॥ గుమ్మనూరు రమేష్ బాబు**
తిరుపతి.

## తప్పు లా?

శ్రీ సర్దేశాయి తిరుమలరావు గారు తమ సహజ ధోరణిలో శ్రీ శ్రీ శ్రీ గారి "స్వర్గభైరవం" మీద రాసినది (భారతి ; మే 1982) చదివాను.

1. భైరవం = కుక్క అని ఒక్క శ్రీ జి. ఎన్. రెడ్డి గారి తెలుగు నిఘంటువు (ఆం. ప్ర. సా. అ.) లో తప్ప

ఇంకెక్కడా నాకు కనిపించలేదు. హవుండ్ గురించి అంత రాయాలా ?

2. భైరవ-భైరవి శబ్దాల విచారణకి ఇదేనా తావు?

3. ఆయనకి సమాసం బాగా లేదు, సరే! కాని ఇంత విజ్ఞాన ప్రదర్శనం యొక్క ఉద్దేశం ఏమిటి ?

4. "ది బార్డ్ ఆఫ్ అవన్" అంటే అర్థం ఏమిటి ?

5. సమాసం తప్పా ? శ్రీ తి. రా. గారికి బావుళ్లేదా ?

6. మొగకుక్కలు ఉండవా ? మిత్రులు లేరా ? దొరలు ఆడవాళ్ళు కారా ? ఇంగ్లీషులో కుక్కలకి "షి, హి" అని వాడగా నేను చదివాను, విన్నాను.

7. "జాగిలమ్ములు" అనేమాటని (?) శ్రీ శ్రీ శ్రీ గారు ఏవిధంగా తప్పుటర్థంలో వాడారు ?

శ్రీ శ్రీ శ్రీ గారి తప్పులేమిటో వివరంగా చెబుతూనే "స్వర్గం" అనే పదాన్ని ఎందుకు వాడారో తెలియదంటా రేమిటి శ్రీ తి. రా. గారు ?. ఇలాగ తప్పులు పడితే కవిత్వం నిలుస్తుందా ?.

గంటి రామలింగం
మదరాసు - 600 004

# రాక్షస తంగడి యుద్ధమా ?

క్రీస్తు శకం 1565వ సంవత్సరానికి దక్షిణదేశ చరిత్రలో ప్రాధాన్యత ఉంది. ఆ సంవత్సరం జనవరి 23వ తేది చరిత్రాత్మక రాక్షస తంగడి యుద్ధం బహమని సుల్తానులకు అళియరామరాయలకు జరిగింది. ఈ యుద్ధాన్నే తళ్ళికోట యుద్ధం అని పేర్కొనటం సంభవించింది.

నిజానికి ఈ యుద్ధాన్ని "బన్నిహట్టి" యుద్ధం అనిపిలవాలి. ఈ రాక్షస తంగడి యుద్ధం తాళికోట గ్రామానికి 34 మైళ్ళదూరంలో ఉన్న బన్నిహట్టి గ్రామంలో జరిగింది. హెచ్. కె. షెర్వాణీ ఈ యుద్ధాన్ని బన్నిహట్టి యుద్ధం అని పిలవాలని వ్రాసినారు. జర్నల్ ఆఫ్ ఇండియన్ హిస్టరి (ఆగస్టు 1957) పత్రికలో ఈ యుద్ధాన్ని "కృష్ణా యుద్ధం" అని పిలవాలని వ్రాయడం జరిగింది. రాధేశ్యాం కింగ్‌డమ్ ఆఫ్ అహమద్‌నగర్ అనే పుస్తకంలో బన్నిహట్టి యుద్ధం అనే పేరును సమర్థించినారు. జె. ఏ. క్యాంప్‌బెల్ బిజాపూర్ జిల్లా గెజిటీర్‌లో (1884) ఈ చర్చ చేసినారు. రాక్షసి-తంగడి గ్రామాలు కృష్ణానదికి ఉత్తరం వైపు ఉన్నాయి. రామరాయలు యుద్ధం చేసింది దక్షిణభాగంలో. బన్నిహట్టి గ్రామం మస్కి, హుకేరి సంగమ ప్రాంతంలో ఉంది.

చరిత్రకారులు, రచయితలు గమనిస్తారా ?

ఆచార్య యస్. శ్రీపతి నాయుడు
మదనపల్లి

# లేఖ

మార్చి 1982 భారతి సంచికలో శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రి "విశ్వబ్రాహ్మణ కవులు" అను వ్యాసమున కీ. శే. జలదంకి కృష్ణస్వామిశర్మగారిని విశ్వబ్రాహ్మణ కవులలో జేర్చుట దొసగు అనుచు మిత్రులు విద్వాన్ కొమాండూరి రామానుజాచార్యులుగారు 'భారతి' జూన్ 1982 సంచికలో 'సవరణ' యనుపేర ప్రకటించిన లేఖలో నాల్గవయంశముగా పేర్కొనినారు. వేదమువారు కీ. శే. కృష్ణస్వామిగారిని విశ్వబ్రాహ్మణ కవులలో జేర్చుట అసంగతమనియు, వారు శ్రీ వైష్ణవ సంతతికి జెందిన వారనియు, వారు రెవెన్యూలో చాలకాలము పనిచేసినారనియు, శ్రీ రామాయణమున రామనాటకముల పేరు వెలయించినారనియు చెప్పుచు తాను 1950 ప్రాంతమున కీ. శే. కృష్ణస్వామిగారిని సందర్శించి వందనము సల్పితిననియు వ్రాసిరి.

కొమాండూరివారు వ్రాసిన కీ. శే. జలదంకి కృష్ణస్వామి శర్మగారు వేరేవారై యుండవచ్చును. కాని వేదమువారు పేర్కొన్న జలదంకి కృష్ణస్వామి శర్మగారు విశ్వబ్రాహ్మణులే. వారు 'క్రౌంచాకారు' కావ్యకర్తలు.

'పారుటాకులు వెన్వెంట పైకిరేగ' అను పాదముతో ప్రారంభమైన గీతపద్యముతో వారు కావ్యమును ప్రారంభించిరి. వారు ఒంగోలు అమెరికన్ బాప్టిస్టు మిషన్ హైస్కూలులో చిరకాలము సీనియర్ తెలుగు పండితులుగా పనిచేసిరి. ఆ కాలమున 1915 నుండి 1948 వరకు నేను వారి శిష్యుడను. వారి కారణముగనే నాలాంటి కొందరము తెలుగు సాహిత్యం పట్ల ప్రభావితులమైతిమి. వారి భార్యామణి పేరు శ్రీమతి వరలక్ష్మి. మాష్టారు ఆమెను 'వరం' అనిపిలుస్తుండేవారు.

నాగభైరవ కోటేశ్వరరావు
విడవలూరు

# గ్రంథ విమర్శలు

## శ్రీ రమణ భాషణములు

[ఆంగ్ల సంకలనము : శ్రీరమణానంద సరస్వతి, ఆంధ్రాను వాదము : శ్రీరామచంద్ర కౌండిన్య. డెమ్మీ సైజు. గట్టి బైండు. పుటలు 11+775. వెల: 20/- రూ. ప్రకాశకులు : శ్రీ టి. ఎన్. వెంకటరామన్, ప్రెసిడెంట్, బోర్డు ఆఫ్ ట్రస్టీస్, శ్రీ రమణా శ్రమము, తిరువణ్ణామలై - 606 603.]

ఈ శతాబ్దంలోని మహాయోగులలో భగవాన్ రమణ మహర్షి మొదట పేర్కొనదగినవారు. ఆయన బాల్యంలోనే గృహ పరిత్యాగంచేసి ఏకాంతంలో తపోనిష్ఠ నవలంబించి ఆత్మజ్ఞాన పరమావధిని పొందిన మహనీయులు. గణపతి మునివంటి భారతీయులు. పాల్ బ్రంటన్‌వంటి పాశ్చాత్యులు శ్రీ మహర్షి ప్రభావంవల్ల ప్రభావితులై ఆయన శిష్యులైనారు. శిష్యుల నిర్బంధంవల్ల వారు ఏర్పరచిన శ్రీ రమణాశ్రమంలో ఈ శతాబ్ది ప్రథమ పాదంలోనే స్థిరనివాసం ఏర్పరచుకొని అసంఖ్యాకులైన తత్త్వజిజ్ఞాసువుల సందేహాలను తీరుస్తూ, వారికి ముక్తసరిగా ముక్తి మార్గాన్ని ఉపదేశించి విశ్వవిఖ్యాతిని గడించారు. శ్రీ మహర్షి దర్శనమాత్రాననే చాలా మందికి సందేహనివృత్తి అయేది. కొందరికి సూత్రప్రాయా లయిన వారి వాక్యాలు విన్నంతమాత్రాన సంశయాలు విచ్ఛిన్నాలై ఆత్మావగతికి దారిదొరికేది. ఆయన బహుభాషా వేత్తలు. ఉపన్యాసా లిచ్చే ధోరణి లేదు. తరచు మౌనముద్రలో ఉండేవారు. స్వల్పంగా సంభాషించేవారు. అయితే - వారి దర్శనం చేసుకుని, ఉపదేశాలను గ్రహించే అవకాశం లభించిన వారు అల్పసంఖ్యాకులే! అట్టి అవకాశం లేని వారి ఉపయోగార్థం ఆశ్రమంవారు ఎన్నో గ్రంథాలు ప్రకటించారు. అనుభవజ్ఞులు, ఆశ్రమవాసులు తమ అనుభవాలను వెల్లడిస్తూ గ్రంథాలు వ్రాశారు. లేఖలు ప్రకటించారు. వానిని పఠించిన నాస్తికులెందరో ఆస్తికులైనారు. మానవుల ఆత్మ విజ్ఞాన వికాసంకోసం శ్రీ రమణాశ్రమం వారు చేస్తున్నకృషి అమోఘమైనది. ఆ ఆశ్రమంవారు ప్రకటించిన బృహద్గ్రంథాలలో ఈ "శ్రీరమణ భాషణములు" ముఖ్యమైనది.

శ్రీ రమణ మహర్షి సన్నిధిలోనే కాలంగడిపిన శ్రీ రమణానంద సరస్వతి (పూర్వాశ్రమమున శ్రీ మునగాల వెంకట రామయ్య గారు) శ్రీ మహర్షి భాషణములను సంగ్రహించి, సంకలనం చేసి ఆంగ్లభాషలో ఈ గ్రంథాన్ని సంతరించారు. ప్రశ్నోత్తర రూపంలో ఇది సమకూర్చబడింది. శ్రీ మహర్షిని పెక్కుమంది జిజ్ఞాసువులు అడిగిన ప్రశ్నలకు (చాలచోట్ల పృచ్ఛకుల పేర్లుకూడా ఉదహరించబడినవి) వారిచ్చిన సమాధానాలు ఇందులో పొందు పరుపబడినవి. ఇవి శ్రీ భగవానుని ఆమోదముద్ర వేసుకొన్నవే!

జీవితం క్లిష్టంగానూ, క్లేశభూయిష్ఠంగానూ ఉన్న సమయంలో మనశ్శాంతికై శ్రీ భగవానుని సన్నిధిని చేరి, అవకాశం దొరికినప్పుడల్లా పావనాలు, మధురములు, కనువిప్పు కలిగించేవి అయిన శ్రీ మహర్షి వాక్కులను సంకలనం చేసినట్లు ఆంగ్ల లేఖకులు చెప్పుకొన్నారు. మనశ్శుద్ధి, సూక్ష్మాలు, అర్థగభీరాలు అయిన శ్రీ భగవానుల పలుకుల స్పష్టతరావగాహన ఈ సంకలనకు ప్రయోజనమని ఆయనయే చెప్పారు. ఆంగ్ల మూలాన్ని పరిచయం చేస్తూ పాశ్చాత్య సాధకులు సాధు అరుణాచల (మేజర్ ఎ. డబ్లియు. చాడ్విక్. ఒ. బి. ఇ) శ్రీ భగవాన్ అంటారు - "నీ వాత్మవు. వేరేమియు కావు. ఇతరమెల్లా భ్రాంతియే; కావున ఇపుడే ఇచ్చటనే ఆత్మగా ఉండు. అందుకై అడవులబట్టనక్కరలేదు. గదిలో దూరి గడియలు వేసికోనవసరంలేదు. అనుదిన వ్యవహారాల నెప్పటివలెనే చక్కబెట్టుకో. కాని, కర్తతో తాదాత్మ్యం మానివేయి. ఆత్మ సాక్షి మాత్రమే. అది నీవు" అని.

ఈ భాషణాలలో పై ప్రవచించిన దానికి ఉదాహరణలపై ఉదాహరణలు - "భిన్నరుచుల వారికి, భిన్నయోగ్యతల వారికి అనుగుణంగా ఇచ్చియున్నవి. ఈ గ్రంథం చదివినవానిని, అప్రయత్నంగానే అంతర్ముఖుని, మూలాన్వేషిని చేస్తుంది. దీని చదవడమే గొప్ప సాధన" అని చెప్తున్నారు. అది అక్షరాలా నిజం. ఈ భాషణాల్లో స్పృశించబడని విషయం అంటూ లేదు. సాధన మార్గాలు, స్వర్గ నరకాలు, కామ క్రోధాలు, భక్తి ప్రపత్తులు, జ్ఞానాజ్ఞానాలు, అన్నీ చోటు చేసుకున్నాయి. కుశంకలకు నిదానంగా సమాధానా లీయబడినవి. శ్రీ సాధు అరుణాచలం చెప్పినట్లు, ఈ గ్రంథాన్ని చదివి అవగాహన చేసుకొనడమే పెద్దసాధన. ఆధ్యాత్మిక తత్త్వాన్ని అవగాహన చేసుకొని మనశ్శాంతిని పొందుటకు ఈ గ్రంథం ఎంతగానో ఉపయోగపడుతుంది.

ఆంధ్రానువాదం చేసిన శ్రీరామచంద్ర కౌండిన్య ఆంగ్లాంధ్రాలలో సమర్థులైన విద్వాంసులు. డాక్టరేట్టుపొంది అత్యున్నత విద్యాశాలల్లో అధ్యాపకులై విశ్రాంతి తీసుకొన్న పిమ్మట

శ్రీ రమణాశ్రమంలో విశ్రాంతి తీసుకుంటూ తత్త్వచింతనలో నిమగ్నులైన అనుభవజ్ఞులు. మూలకర్తకు జామాతలు. కావున అనువదించే అధికారం వీరికే ఉందని చెప్పవలసి ఉన్నది. సర్వజన సుగ్రాహ్యమైన సరళ భాషలో దుర్గ్రాహ్యలైన విషయాలను చాలా చక్కగా చెప్పగలిగారు. గ్రంథాంతరాపేక్ష లేకుండా ఆత్మతత్త్వ విచారమునకు అత్యంతోపయుక్తమైన యీ గ్రంథం తత్త్వ జిజ్ఞాసుల ఆదరాన్ని తప్పక పొందగలదని భావిస్తున్నాను.

"ఆంగీరస"

## భగవద్గీత యదార్థ సందేశము, నిరాకార జ్యోతిబిందు పరమాత్మ

[వెల : రు. 3. ప్రతులకు : ప్రజాపిత బ్రహ్మకుమారి ఈశ్వరీయ విశ్వవిద్యాలయము, మదనపల్లె - 517 325]

భగవద్గీత నిజమైన సారం గురించి ఆది శంకరుల కాలం నుంచి నేటివరకూ పెక్కు గ్రంథాలు వెలువడినాయి. అయా వ్యాఖ్యానాలు వారి వారి మతములను పరిపుష్టం చేసుకునేందుకుద్దేశించినవిగా వుండడంవల్ల వాస్తవత వ్యక్తం కాజాలదు. అదే తీరున యీ ప్రజాపిత బ్రహ్మకుమారి ఈశ్వరీయ విశ్వవిద్యాలయం వారు కూడా గీతాజ్ఞానము యొక్క ఉద్దేశ్యము - ప్రయోజనం గురించి కొంత మీమాంసచేశారు. గీతలో ఇప్పుడు లభించే 700 శ్లోకములలో అధికభాగం లక్ష్యం - ఆత్మ పరమాత్మల జ్ఞానం, యోగస్థితి, కర్మ, అకర్మ, వికర్మలయొక్క జ్ఞానమును తెలుపుట యని ఈ గ్రంథకర్త ఉద్దేశం. ఇది సరయిన ఉద్దేశమే. అయితే ప్రవృత్తి, నివృత్తుల భేదము తెలియజేయడం అంత సులభంకాదు. సాధనద్వారా అనుభూతిని పొంది యీ భేదమును తెలుసుకొనవలయును.

మానవుడు జన్మజన్మాంతరముల నుంచి దేహాభిమానము, అజ్ఞానముతో చేయుచు వచ్చినాడని ఈ పుస్తకం 11వ పుటలో వున్నది. కర్మచేయడం ద్వారా జ్ఞాని అవుతాడు అని విజ్ఞుల వ్యాఖ్యానం. కర్మములు చేయడం వలన మనస్సు కలుషితంగ మారినద (4వ పుట)ని భావించుట సర్వజిజ్ఞాసలోక సమ్మతం కాజాలదు. కర్మ యననేమో తెలిసిన కర్మచేయడం వలన మనస్సు పవిత్రస్థితిని, బిందుస్థితిని చేరుతుందని తెలియగలదు.

మానవుడు మనో వికారములపైన కర్మేంద్రియములపైన విజయమును సాధించినప్పుడు సంపూర్ణ బ్రాహ్మణు డగును (13) అనుటలో సందియములేదు. కానీ సర్వేంద్రియముల పైన విజయమును సాధించిన వ్యక్తి మనస్థితి నిరాకారముగ, జీవన్ముక్తునికి సన్నిహితంగా ఉండి బ్రాహ్మణ అబ్రాహ్మణ భావాలకు అవకాశం లేకుండా పోవును. ఈ స్థితినే కొందరు స్వర్గారోహణ మందురు.

ఆత్మ అనాది, అవినాశి మరియు అవిభాజ్యము అను అవగాహన ఎట్లుకలుగును? (క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగచర్చ యీపుస్తకంలో జరిగిన తీరు గమనించదగినట్టిది.) ఆదిమ స్వరూపంలో ఆత్మ ఎట్లుండును? పవిత్రముగా నుండునని ఆత్మజ్ఞానులు చెప్పుదురు. విశ్వవ్యాప్తమయిన ఆత్మ దేహమునందు ప్రవేశించినప్పుడు దేహాభిమానమునకు లోనయి వికారము చెందుననుట సమంజసమా? ఈ పుస్తకం 18వ పుట నుంచి 140వ పేజీ వరకూ జిజ్ఞాసులు చర్చించవలసిన అంశాలు చాలా ఉన్నాయి. జ్యోతిర్బిందువు - ప్రకాశించుచున్న నక్షత్రము ఆత్మ అనే నిర్వచనాన్ని తాత్త్వికులందరూ అంగీకరిస్తారో లేదోగానీ యీ విషయంలో జరిగిన మంచి యత్నాలలో ఇదొక టనడానికి మాత్రం సందేహంలేదు. పరమాత్మకంటే ఆత్మ భిన్నమైనదనే వాదనను తాత్త్వికులు ఆమోదిస్తారా? అయితే సర్వ ఆత్మల తండ్రి, పరమపిత శివుడు అనే వాదం గురించి విభిన్నాభిప్రాయాలకు ఆస్కారంలేదు. అదే విధంగా పరమాత్మ "అశరీరి" అనుటకు కూడా సందేహము లేదు.

ఈ పుస్తకం 42, 43 పుటలలో పరమాత్మ యొక్క దివ్యనామం గురించి చెప్పిన అంశాలు ఆస్తికులందరూ ఆలోచించదగినవి. "భగవంతుడు" ఒక సర్వ వ్యాపకతత్వము యొక్క పేరు కాదు. ఒక పురుషవిశేష నామము (14 వ పుట) ఈ వివరణలో తత్వ పరిజ్ఞానం ఉన్నది. ఇట్లు పెక్కు తాత్త్విక విషయాలను చర్చించిన యీ పుస్తకం మంచి పుస్తకం అనడానికి సందేహ మెందుకు?

## యోగము యొక్క విధులు మరియు సిద్ధులు

[ప్రతులకు: ప్రజాపిత బ్రహ్మకుమారీ ఈశ్వరీయ విశ్వవిద్యాలయము, 11/185, సిపాయి వీధి, మదనపల్లె - 517 325 ప్ర. దా:- పాండవ భవన్, మౌంట్ అబూ (రాజస్థాన్) వెల - రు. 6]

భౌతిక ప్రపంచ బాధలతో అలమటించి పోతున్న మానవ మనస్సులను కొంచెం సేపయినా తనకంటే భిన్నమైన శక్తులవైపు మరలించడం ద్వారా కొంత ఉపశమనం కలిగించడం ఎంతయినా

అవసరం. అందుకు ఇలాంటి పుస్తకాలు బాగా ఉపయోగపడ గలవు. సరయిన పద్ధతిలో యీ పుస్తకంలో సూచించిన సాధనచేస్తే మానసిక రుగ్మతలేకాక శారీరక రుగ్మతలు కూడా తగ్గుతాయని కొందరు అనుభవజ్ఞులు చెబుతున్నారు. మనస్సుయొక్క శాంతి సమాజ కళ్యాణమునకు సర్వశ్రేష్ఠమైన ఉపాయమే యోగము. జ్ఞానము మరియు యోగమే శాశ్వతమైన శాంతి సుఖములను మరియు ఆనందమును కలగజేయు సాధనము వంటి 21 అధ్యాయాలు ఈ 360 పుటల పుస్తకంలో ఉన్నాయి.

యుద్ధములు మొదట మనసులో పుట్టుచున్నవి. కార్మికులు యజమానులు, పోలీసులు, విద్యార్థుల వంటి వారిలో మనఃక్షోభము కలిగినప్పుడు, కొట్లాటలు సమ్మెలు వంటివి జరుగుతున్నాయి. ఇలాంటి వాటిని నిరోధించగలగడానికి మనశ్శాంతి ఉపయోగపడు తుందే. మానవునికి మనశ్శాంతి నిచ్చునదే సేవలన్నింటిలోను గొప్ప సేవ. భావావేశమే సంక్షోభాలకు కారణం. గుణచింతన, ధైర్యము, మైత్రీభావము, సంతోషము భావావేశాన్ని నివారిస్తాయి. మానవుడు మనశ్శాంతికోసం కర్మముల యొక్క బీజమును అంగీకరించి ఆచరణలో పెట్టవలసి వసరం. అజ్ఞానము, మిథ్యాజ్ఞానము మానవాళిని యీనాడు వేధిస్తున్న సమస్యలు. వాస్తవానికి మిథ్యాజ్ఞానముకంటే ఎక్కువ ప్రమాదకరమయినది అజ్ఞానం. అజ్ఞానం ఎన్నటికయినా తొలగే అవకాశమున్నది, మిథ్యాజ్ఞానం తొలగే ఆస్కారమే లేదు.

నిన్ను నీవు తెలుసుకొనుట, పరమాత్మను తెలుసుకొనుట, సృష్టిచక్రముయొక్క ఆది, మధ్య, అంత్యజ్ఞానమును మానవుడు గ్రహించగలగాలి. ఈ పుస్తకం 9వ అధ్యాయంలో ప్రాచీనవాస్తవ యోగము గురించిన అంశాలున్నాయి. ఇంతకూ ప్రజాపిత బ్రహ్మకుమారీ ఈశ్వరీయ విశ్వవిద్యాలయం వారి దృష్టిలో యోగమనగా నేమి ? పరమాత్మునియొక్క ప్రేమలో యేకాగ్రత లేక అస్థితిలో నిమగ్నమగుటయే యోగము. పరమాత్మునియెడ ఉత్కృష్టమైన ప్రేమ మరియు తన్మయత్వమే యోగము. మనస్సు, వాక్కు కర్మలను ఈశ్వరీయ సంబంధముల కనుకూలంగా చేసికొనుటయే యోగము. ఈ యోగము అతి సహజమైనదని ఈశ్వరీయ విశ్వవిద్యాలయం వారి అభిప్రాయం. నిరాకార శివబిందు శివపరమాత్మయననేమో వివరించేసే బొమ్మలు యీ పుస్తకంలోఉన్నాయి. వారిదృష్టిలో బ్రహ్మలోకము, సూక్ష్మలోకము, స్థూలలోకము అని మూడు లోకములు పరమాత్ముడు త్రిలోకనాథుడుగదా ! ఇలా యీ పుస్తకం గురించి వ్రాస్తూ పోతే మరొక వృద్గ్రంథమే తయారవుతుంది. అది ఈశ్వరీయ మహిమ. ఇంద్రియ నిగ్రహం చాలా అవసరం ప్రతివారికి. అదే విధంగా ధ్యానంకూడా అవసరమే. 354వ పుటలో పతంజలి యోగము యొక్క ఎనిమిది అంగములను వివరించినారు. ఆస్తికులూ, నాస్తికులూ కూడా శ్రద్ధగా చదివి చర్చించి, ఆచరించవలసిన పెక్కు అంశాలు యీ పుస్తకంలో ఉన్నాయి. ప్రజాపిత బ్రహ్మకుమారి ఈశ్వరీయ విశ్వవిద్యాలయం లోని కార్యకర్తలు సోదరులూ – సోదరీమణులు. పేరుకుకాదు. కార్యాచరణలో సేవలో వారందరూ నిజంగా సోదర సోదరీమణులు. ఇలాంటి సంస్థలు ఇతోధికంగా యేర్పడి తమ తమ పరిధులలో మానవసేవ చేయటం యీ రోజులలో చాలా అవసరం.

శ్రీ వి. ఎస్. అవధాని

## సింగరేణి పాటలు

[సంకలనం జాతశ్రీ. వెల : రు. 1-50 లు. ప్రతులకు : విఠల్‌రావ్ భవన్, ఇల్లెందు – 507 123, ఖమ్మంజిల్లా]

సింగరేణి కాలరీస్ వర్కర్సు యూనియన్ ఎనిమిదవ మహాసభ సందర్భంగా, అభ్యుదయ రచయితల సహకారంతో ఈ సంకలనం వెలువడినట్లు ప్రకాశకులు చెప్పుకొన్నారు. దీంట్లో కవిత్వం రాసిన వారెవ్వరూ గొప్పచదువులు చదివిన వారుకారనీ, కవిత్వం రాయాలనే త్వరవల్ల కవిత్వం రాయలేదని, సింగరేణి బొగ్గు గనులలో పనిచేసే కార్మికుల జీవిత వాస్తవంలోంచి ఈ కవిత్వం (పాటలు) ఉద్భవించిందని సంకలనకర్త జాతశ్రీగారు చెబుతున్నారు. ఈ సంకలనంలోని ప్రతి పాటలోనూ అక్కడ పనిచేసే కార్మిక జీవితం, దాని బాధాహి అభావమూహం ప్రతిఫలిస్తాయి.

"సిరులను పెంచుతున్న
సింగరేణి ముద్దుబిడ్డా
నడుం కట్టి నడవరో
పోరు పాట పాడరో
పోరాటం నేర్వరో
శివమెత్తి ఆడరో" (భానుశ్రీ)

ఎందుకీ పోరాటం అని ప్రశ్నిస్తే–బ్రతుకుల కనీస విలువలకోసం వాటి రక్షణకోసం అని సమాధానం.

"అడుగడుగున లంచాలు–బెదిరింపులు రచ్చెన
జులుం చేసి గెలిచేటి–దొరలు జెప్పె రచ్చెన
చార్జీటు, సస్పెండ్లు–మన బతుకు రచ్చెన
కార్మికుల కడుపుల్ల–మట్టిగొడితె రచ్చెన

కన్ను తెరిచి చూడరా-కలిపినోడ్డె రచ్చెన
పని వసతి సదుపాయం-కలిగుంటె రచ్చెన
సమ్మెలు పోరాటాలే-నిజమైన రచ్చెన''
(భాను సత్యనారాయణ)

చార్షీటులు, సస్పెండులు ప్రతి పాటలోనూ కనబడతాయి. శ్రమచేసి సంపదను సృష్టించే కార్మికులకు రక్షణలేదు. వారి బ్రతుకులకు భద్రతలేదు. వారి పీడిత జీవితానికి అంతం లేదు. కనుక ఐక్యతతో రక్షణకై, హక్కులకై, జీవిత అవసరాలకై, బానిస బ్రతుకునుండి విముక్తికై పోరాడవలసిన అవసరాన్ని ఈసంకలనం గుర్తు చేస్తున్నది.

## స్పృహ

[వచన కవితా సంకలనం. సంకలనకర్త : పడిపల్లి దక్షిణామూర్తి బి. ఎ. (లిట్) మూల్యం . తెలియదు. ప్రతులకు : మిత్రకళాసమితి, సాహితీ సాంస్కృతిక వేదిక, జన్నారం - 504205, అదిలాబాదు జిల్లా.]

''కళను ఓ ఉద్యమంగా నడిపించి సమాజంలో చైతన్యాలను రేకెత్తించాల్సిన అవసరం నేడు ఎ తేని ఉంది. కళ ద్వారా సమాజసేవ చేయాలనే మహదాశయంతో 27-5-79న కళా హృదయులందరూ కలసి జన్నారం గ్రామంలో మా మిత్రకళా సమితికి పురుడు పోశార''ని స్వగతంలో కార్యవర్గం చెప్పుకున్నది. కవులను ప్రోత్సహించాలనే తలంపుతో ఈ కవితా సంకలనం వెలువడింది. ఇందులోని కవులందరికీ సామాజిక స్పృహ ఉండటం వలన ఈ సంకలనానికి 'స్పృహ' అని పేరు పెట్టడం జరిగిందని ప్రకాశకులు చెప్పారు. నాటికి, నేటికి తేడా చెబుతూ-

''మాతృ ప్రేమకై మనము తపియించితి మానాడు
మానభంగముల చూసి మురియు చుంటిమి నేడు''

అంటున్నారు డా॥ కె. రాధాకిషన్‌రావుగారు. అతిసాధారణంగాఉండే మనిషిని, అసాధారణంగా ఉండే మనిషిని సమాజం ఎట్లా చూస్తుందో యం. డి. సయీదొద్దీన్ అహమ్మద్‌గారు చెబుతున్నారు.

"ఓ మొగ్గా ! ఇపుడు నీవు-సామాన్యంగానే కనిపిస్తావు
కాబట్టి నిన్ను ముట్టదు లోకం
ఎపుడైతే లోకాన్ని నందనవనంగా మార్చాలని పుష్పిస్తావో
అపుడే ఈ లోకంలోని రాక్షసుల చేతులు నీమీద పడతాయి"

మందా దుర్గా ప్రసాదరెడ్డిగారు సమభావం కోసం వేదన పడుతున్నారు.

''పాంచ జన్యంలా గర్జించు
పాశుపతంలా నిర్జించు
సమభావమునే పెంపొందించి
సమ సమాజమును స్థాపించు''

మిత్రకళాసమితి సాంస్కృతిక వేదికను ప్రోత్సహిస్తూనే ఒక్కమాట చెప్పాలి. రాసింది ప్రతిదీ అచ్చువేయాలనే తపన కంటె, రాసిందాంట్లో ప్రాణం ఉన్నదాన్ని పలువురికీ అందించాలనే ఆకాంక్ష పెంచుకుంటే మంచిది. అందుకు ఉద్యమిస్తారని ఆశ.

## సంజీవని

[కవితా సంకలనం. వెల : రు. 3-00 లు ప్రతులకు : సాహితీ సమితి, నిజామాబాద్ - 501 101, రంగారెడ్డిజిల్లా.]

ఈ కవితా సంకలనానికి కమిట్‌మెంటు కమామీషు అంటూ ఆర్. ఎస్. కె. మూర్తిగారు రాసిన పరిచయంలో తమకుగల యాంటీ మార్కిస్టు దృక్పథాన్ని పంచదార పూత పూసిన విష గుళికలా ప్రదర్శించినారు. ఈ సంకలనంలో గేయాలు పద్యాలు కూడా అందుకు తగినట్లుగానే ఉన్నాయి. ప్రజలుకోరింది రాయడం మూర్తిగారి దృక్పథంలో దోషం. రాజులు కోరింది కోరినట్లుగా దస్తాలు కొద్దీ రాసేయడం ఆదర్శం. మనదైతే లౌక్యం ఇంకొకడిదైతే మోసం అన్న మధురవాణి వాక్కు అక్షరాక్షర సత్యం కాదా మరి ? కవిత్వంలో విషయ పరంగా కూడా మూర్తిగారు తప్పుదోవ పట్టారు. రాసుకునే హక్కు ప్రతివారికీ ఉందికాని తన రచనద్వారా సమాజాన్ని తప్పుదారి పట్టించే హక్కు ఎక్కడుంది ? ఆ హక్కున్నట్లనే ఈనాడు అనర్థక, అరాచక కవిత్వం వలసినంతగా మనకు దిగుమతి అవుతోంది. సంప్రదాయ మార్గంలోనూ, ఆధునిక మార్గంలోనూ రాసిన పద్యాలు, కవితలు ఈ సంకలనంలో ఉన్నాయి. కవులకు కవిత్వం అల్లగలశక్తి, ఉక్తి ఉన్నట్లు ఈ సంకలనం ఋజువు చేస్తోంది. కమిట్‌మెంటు పరంగా పునరాలోచించాలని మనవి.

శ్రీ టి. ఎల్. కాంతారావు

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.




"సాంప్రదాయ సిద్ధమయిన
భారతీయ ఔషధాలకి
ప్రత్యేకమయిన శక్తివుంది.
ఉదాహరణకి,
అమృతాంజన్."

ప్రకృతిలో లభించే అత్యంత
శక్తివంతమయిన పది మూల
ఔషధాలతో అమృతాంజన్ తయారు
చేయబడుతోంది. అంటే అమృతాంజన్
చాలా శక్తివంతమయినది.

అందుచేత అమృతాంజన్
తలనొప్పులకు, జలుబులకు,
వంటినొప్పులకు, బెణుకులకు
శీఘ్రంగానూ, నిశ్చయంగానూ
ఉపశమనం కలిగిస్తుంది.
అంతేకాదు అమృతాంజన్
సురక్షితమయిన బాధా నివారిణి.

అమృతాంజన్ :
80 సంవత్సరాలకు పైబడిన
నమ్మకమైన దివ్య
ఔషధము




# అమృతాంజన్
## తలనొప్పులకు .జలుబులకు.
## వంటినొప్పులకు .బెణుకులకు